# రాణీఘాట్

నవల

రవీంద్రనాథ ఠాకూర్

అనువాదం :

పురాణం కుమార రాఘవశాస్త్రి

రవీంద్ర గ్రంథమాల, విజయవాడ - 2

# రాజీ ఘాట్

## 1

రాత్రి చాల ప్రొద్దుపోయింది. వేసంగిరోజులు. ఆకు లల్లాడటంలేదు; గాలి బంధించేసింది. యశోహార యువరాజు, ప్రతాపాదిత్యుని జ్యేష్ఠపుత్రుడు, ఉదయాదిత్యుడు తనపడక గదిలో కిటికీదగ్గరకూచున్నాడు. భార్యకూడా అక్కడేవుంది. ఆమెపేరు సురమ. "మీరు కాస్త ఓపికపట్టండి. ధైర్యం పోగొట్టుకోవద్దు ఏనాటికైనా మంచిరోజులు తప్పకుండావస్తాయి" అన్నది సురమ తన ప్రియతముని ఉద్దేశించి.

"నాకు మరిం కేసుఖాలు అక్కర్లేదు. అస లీరాజభవనంలో నేను జన్మించకండా, ఇలా ఒక యువరాజు ననిపించుకోకండా, రాజుగారి జ్యేష్ఠపుత్రుడి నన్న హోదా లేకండా, ఈ రాజ్యసింహాసన-ధన-మాన-గౌరవాదులకు ఉత్తరాధికారిని కాకండా, ఒక క్షుద్రతమ - తుచ్ఛతమ - సాధారణవ్యక్తినై బ్రతుకగలిగితే నాకంతేచాలు." అన్నాడు ఉదయాదిత్యుడు.

ఆ మాటలకు సురమాదేవిమనస్సు చాల వ్యాకులితమైంది. అతని దక్షిణహస్తాన్ని తన రెండుచేతుల్లో నొక్కిపట్టుకుంది. అతనిముఖంలోకిచూస్తూ ఒక నిట్టూర్పు విడిచింది. యువరాజుయొక్క ఎటువంటికోరికైనా సఫలంచేసేందుకు తన ప్రాణమైనా ఇవ్వగల ధీరురాలే ఆమె. కాని ప్రాణాల్ని ధార

పోసియైనా తాను తీర్చగలిగినదికాదు అతనికోరిక. అదీ ఆమె విచారానికి హేతువు.

"సురమా! రాజవంశంలో పుట్టాను. అందువల్లనే నాకుసుఖంలేదు. రాజవంశంలో అందరూ ఉత్తరాధికారులుగా పుడతారు; సంతానంగా కాదు. నాన్నగారు నన్ను చిన్నప్పటి నించీకూడా అనుక్షణమూ నన్ను గమనించి చూస్తునే ఉన్నారు. తాను ఆర్జించినయశం, గౌరవం నేనునిలబెట్టగలనా లేదా? వంశమర్యాదను సముజ్వలస్థాయిలో ఉంచుతానా లేదా? రాజ్యభారమంతా సంబాళించుకుంటానా లేదా? — అదీ వారి అనుమానం. నేను చేసే ప్రతిపనీ, కదిలినా మెదిలినా కూడా ఆయన బహుజాగ్రతగా కనిపెడుతూ వచ్చారు. వాత్సల్యదృష్టితోమాత్రం కాదుసుమీ! ఇంకా ఆత్మీయులైనవాళ్ళు, మంత్రులు, దర్బారుజనం, ప్రజలు — అందరూ కూడా నాప్రతిమాట, ప్రతిపనీ పరిశీలనగా పరికిస్తూనేవచ్చారు; నా భవిష్యత్తునుగురించి ఒక స్థిరనిర్ణయానికి కూడా వచ్చేశారు. అందరూ అంటూనే ఉన్నారుకదా: ప్రస్తుతపు క్లిష్టపరిస్థితులలో రాజ్యరక్షణ నా వల్ల అయేపనికాదనీ, నేను నట్టి తెలివి తక్కువాడిననీ, నా కేమీ చేతకాదనీ. ఎవరికీ నా మీద ఇప్పుడు చిన్నమెత్తు గౌరవంకూడా లేదు. నాన్నగారికకూడా నేనంటే అసహ్యమే కలిగిపోయింది. నా మీద ఆయనిప్పుడు ఏ ఆశా పెట్టుకోనేలేదు. నేను బ్రతికివున్నానో చచ్చానో కూడా ఆయనకు అవసరంలేకుండా ఉంది"

సురమ కన్నులు చెమ్మగిలిపోయాయి. "అయ్యయ్యో ఆయన అలాగ ఎలాఉండగలుగుతున్నారో!" అన్నది అప్రయ

త్నంగా. ఆమెకు దుఃఖం కలిగింది. కోపంకూడా వచ్చింది.
"మిమ్మల్ని తెలివితక్కువవాళ్ళని ఎవరంటున్నారో నిజానికి వాళ్ళే శుద్ధ తెలివితక్కువవాళ్ళు".

ఉదయాదిత్యునికి కొద్దిగా నవ్వొచ్చింది. రోషంతో రాగ రంజితమైన ఆమె ముఖాన్ని...గడ్డం పుచ్చుకుని కొంచెం పైకెత్తాడు. కాని మరుక్షణమే గంభీరముద్ర వహించి "కాదు సురమా! రాజ్యాన్ని శాసించగల బుద్ధి చాకచక్యం నాకు నిజంగానే లేదు. పరీక్ష జరిగింది; ఆ విషయం ఏనాడో రుజువై పోయింది. నా పదహారవయేట...రాజ్య వ్యవహారాలు నేర్చుకుంటాను కదా అని...హుసేన్ ఖాళీ పరగణా నాకు అప్పగింత పెట్టారు. ఆరు నెలలు గడిచాయో లేదో పెద్ద గందరగోళమే ఆరంభమైంది. ప్రజలు చెల్లించవలసిన కప్పం తగ్గించేశాను. ప్రజలు నాకు ఆశీస్సులు కురిపించారు. ఉద్యోగులు మాత్రం వెళ్ళి రాజుగారితో నా మీద నేరాలు చెప్పారు. ఇంకేముంది? "ప్రజలకంతగా ప్రియపాత్రులైపోయిన యువరాజావారు సరిగా రాజ్యపాలన చెయ్యగలగటం అసంభవం." అన్నారు, రాజసభలో ఉన్న యావన్మందీకూడా. నాటినించీ నాన్నగారు కన్నెత్తి నాముఖంవైపే చూడ్డం మానేశారు 'ఈ కులభ్రష్టుడు రాయగడ్‌లోని మా పెదనాన్నగారి తలలో తయారైనాడు. సితార్ వాయిస్తూ, నృత్యంచేస్తూ తిరుగుతాడు. అంతే వాడిపని. రాజవంశగౌరవం మట్టిపాలు చేసేస్తాడు' అన్నారు నన్నుగురించి ఆయన చాలసార్లు".

"కాని మీరు ఓపిక పట్టండి – ధైర్యంగా ఉండండి – ఏమన్నా అనండి. ఇంతకూ వారు మీరు కన్నతండ్రే కదా!

ఈ నాడు వారి హృదయం...కొత్త రాజ్యాలు సంపాదించాలనీ. ఉన్న రాజ్యాన్ని విస్తరింపజేయాలనీ...దురాశతో నిండి పోయి వుంది. అక్కడ యిక వాత్సల్యానికి చోటులేదు. కాని వారి ఆశలు క్రమేణా నెరవేరుతున్నకొద్దీ వాత్సల్యంకూడా పెంపొందుతూ వుంటుంది."

"సురమా! నువు దూరపు చూపుగలదానివి. నీది పదునైన బుద్ధి. కాని ఈ సారిమాత్రం నీ ఊహ సరైందికాదు; పొరపాటు పడ్డావు. ఆశకు అంతం ఉండదుకదా! నాన్నగారి రాజ్యపు సరిహద్దులు విస్తరిస్తూన్నకొద్దీ, ఈ రాజ్యం ఎప్పుడే విధంగా చేయి జారిపోతుందోనన్న భయంకూడా పెరుగుతూనే ఉంటుంది. అదీగాక రాచకార్యాలు పెరిగి భారం పెద్దదా తున్నకొద్దీ నన్నాయన ఇంకా ఇంకా పనికిమాలినవాడినిగానే భావిస్తూ ఉంటారు."

సాధారణంగా సురమాదేవి ఊహల్లో పొరపాటేమీ ఉండదు. ఆమె వెలువరించిన విశ్వాసంలో పొరపాటు వుంటే ఉండవచ్చు. విశ్వాసం బుద్ధినికూడా అతిక్రమించి వెడుతూ ఉంటుంది. ఇంతకూ అలా జరగవలెనని ఆమె మనసారా ఆశించింది.

ఉదయాదిత్యుడింకా ఇలా చెప్పసాగాడు. "నాలుగు వైపులనుంచీ నా మీదకి జాలిచూపులూ, అనాదరమూ ప్రసరిస్తూ ఉండటం సహించలేక రాయగడ్‌లో తాతగారి దగ్గరకు పారిపోతూ ఉండేవాడిని. నా జాడ, జవాబు నాన్నగారికి అక్కర్లేకుండానే పోయిందిగా! ఆహా! ఇక్కడికీ అక్కడికీ ఎంత తేడా అనుకున్నావు! అక్కడ పొలాలు, తోటలు,

చెట్లు, చేమ చక్కగా చూడగలుగుతాం. పాదబంధనం లేదక్కడ. హాయిగా ఆ గ్రామవాసుల పాకల్లోకి వెళ్ళొచ్చు, రావచ్చు. రాత్రింబగళ్ళు రాజోచితమైన వేషమే ధరించి ఉండనక్కర్లేదు. అదీగాక...నీకు తెలుసుకదా... తాతగారు ఎక్కడఉంటే అక్కడ... ఆ చుట్టుపట్ల చాలమేరవరకూ... చింత, చీకు గాంభీర్యం అనేవి మచ్చుకేనా ఉండవు. గాన వినోదాలతో ఆయన తనచుట్టూ సంతోష తరంగాల్ని, ఉల్లాసభావాల్ని వెదజల్లుతూ వుంటారు. ఆయనసమక్షంలోకివెళ్లామంటే మనస్సు ఉల్లసితమౌతుంది, సద్భావాలే కలుగుతాయి; శాంతి అనుభవిస్తాం. అక్కడికి వెళ్ళానంటేసరి, నేను యశోహార యువరాజునన్న సంగతే ఇట్టేమరచిపోతాను. ఆహా! అక్కడ నాకు లభించిన శాంతి మరువుకోస్తుందా? ఆఖరికి... నాకు పద్ధెనిమిదోయేడు వచ్చింది... అది వసంతకాలం... రాయగడ్‌లో మలయమారుతం వీస్తున్నది ... అటువంటి సమయంలో ఆ ఉద్యానంలో, ఆ వసంతశోభలో రుక్మిణిని చూచాను."

"ఆ సంగతి చాలాసార్లు చెప్పావు. విన్నానులెండి" అన్నది సురమాదేవి చటుక్కున మధ్యలో.

"ఇప్పుడింకోసారిగూడా విను. అప్పుడప్పుడు ఒకొక్కవిషయం గుండెలో బరువెక్కి పీడిస్తూ ఉంటుంది. అది మరి బయటికి వెళ్ళగక్కకోకపోతే బ్రతికేది ఎలాగ? ఆ సంగతి నీకు వినిపిస్తూంటే యిప్పటికీ నాకు సిగ్గు వౌతుంది, మనసులో కష్టంగానూ ఉంటుంది. అందుకనే మాటిమాటికి చెప్పుకుంటూవస్తున్నాను. ఆ సిగ్గు నాకు కలక్కుండా పోయిన

నాడు ప్రాయశ్చిత్తం అయినట్టు భావిస్తాను. ఆ తరువాత ఇక ఆ విషయం ప్రస్తావించను."

"ప్రాయశ్చిత్తమెందుకండీ మీకు? మీరేదైనా పాప మనేది చేసివుంటే ఆ దోషం మీది కానేకాదు. ఆ పాపానిదే దోషం. నేను మిమ్మల్ని ఎరగనా యేమిటి? అంతర్యామికి తెలియదా మీ హృదయాంతరాళం?"

"రుక్మిణీ నాకన్నా మూడేళ్ళు పెద్ద. ఆమె ఒంటరిగానే నివసిస్తోంది- వితంతువు. తాతగారి దయమీద ఆధారపడి జీవిస్తోంది రాయగడ్‌లో. ప్రప్రథమంగా నన్నామె యెలా ఆకర్షించిందో, నాకు బాగా జ్ఞాపకంలేదు. అప్పుడు నా హృద యంలో మధ్యాహ్న కిరణాలు ప్రజ్వలిస్తున్నాయి. నాటి తీక్షణతమూలాన నేను సరిగా చూడలేని పరిస్థితిలో పడిపో యాను. ప్రపంచమంతా ఏ వైపుచూచినా కన్నీటి వెలుగులతో కప్పబడివున్నట్టు కనిపించేది. శరీరంలోని రక్తముయావత్తూ తలలోకి ప్రవహిస్తున్నట్టనిపించేది. అందులో ఆశ్చర్యమేమీ లేదు; అసంభవమూ కాదు. దోష ద్రోంక, దిక్కు దివాణం అంటూ ఏర్పరిచేందుకు వీల్లేకుండా, సర్వం ఏకాకారంగా పొడగట్టేది. ఇటువంటి అవస్థ అంతకుముందుగాని, ఆ తరువాత గాని నా కనుభవంలోకి రాలేదు. నేనొక క్షుద్రవ్యక్తిని, దుర్బలుడను, బుద్ధిహీనుడను. ఇటువంటి నా హృదయపరి స్థితికి విరుద్ధంగా ఆ జగదీశ్వరుడు నా కళ్ళముందు ఎందుకో మరి ఈ సమస్త జగత్తునూ అంతగా ఉత్తేజితంచేసి వేశాడు ఆనాడు! ఆరహస్యం ఆయనకే తెలియాలి. ఈ చరాచరాత్మల సమస్త విశ్వమూ నా మీద కత్తికట్టిందా అనిపించేట్టు ఒక్క

క్షణంలో నా హృదయాన్ని తప్పుడుదారికి తిప్పేసింది. ఎంతో సేపు కాదు. ఒక్క క్షణంలోనే - ఈ బాహ్యజగత్తు నామీద తీవ్రంగా ఊచిపట్టి దెబ్బకొట్టింది. ఆ క్షణంలోనే ఒక దుర్బల హృదయం... వేళ్ళు పెళ్లగించిన వృక్షంవలే... గుబాలున కూలిపోయి నేలగిరచి పడిపోయింది. దుమ్ములో అలాగే పడివుంది. చివరకు లేచిచూచుకుంటే ఏముంది? నిండా దుమ్ము గొట్టుకొని మలినమైపోయివుంది. ఆ దుమ్ము, మాలిన్యం ఇంకా అలాగే ఉన్నాయి. వొదలిపోవడంలేదు. నా కర్మం ఏమికాలిందో మరి! స్వచ్ఛముగా ఉండదగిన నా బ్రతుకును ఈ పాపంతో బొగ్గులా చేశాడు భగవంతుడు. వెలుగును చీకటికిృంద మార్చేశాడు. అంతా ఒక్క క్షణంలో నా హృదయోద్యానవనంలోని మాలతీ పుష్పాలు, జాజులూకూడా సిగ్గుతో వాడి, మాడి నల్లబడిపోయాయి"

ఇలా చెప్పుకుపోతూంటే ఉదయాదిత్యుని ముఖంలోని పసిమిఛాయ ఎరుపుతిరిగింది. విశాలనేత్రాలు ఇంకావిప్పారినవి. ఆ పాదమస్తమూ విద్యుత్ ప్రవాహంలోవలె కంపించి పోతున్నది. సురమహృదయం తొణికిసలాడుతున్నది. అప్పుడు హర్షమా? గర్వమా? కష్టమా? "అదంతా అలా వుండనీయండి. ఇదిగో నా మీదవొట్టు. ఇక చెప్పవద్దు" అన్నదామె.

ఉదయాదిత్యుడు ఆగలేదు. "కొంతసేపటికి నాలోని రుధిరజ్వాలల వేగం శాంతించింది. అప్పుడు తిరిగి మామూలు దృష్టి ఏర్పడింది నాకు. ఈ ప్రపంచమనేది బాగా వేడెక్కిన మెదడుగలిగి, రక్తనేత్రాలతో విజృంభించే మదవతి కాదు;

భయంకరస్వప్నదృశ్యంకాదు. అని తెలుసుకోగలిగిన తర్వాత అప్పుడు నా అవస్థ ఏంచెప్పేది? ఎక్కడనించి ఎక్కడికి వచ్చి పడ్డాను! లక్షలాది మైళ్ళఅడుగున పాతాళంలో, కాకుల్లేకటి కోణంలో, కన్నుమూసి కన్నుతెరచేసరికి గుభాలున కూలి పోయాను. తాతగారు వచ్చి నన్ను ఆదరంగా తీసుకువెళ్ళారు. నా ముఖం ఎత్తి ఆయన కప్పుడుఎలాచూపించానో! ఏమైనా, అంత జరిగాక ఇక మళ్ళీ రాయగడ్‌కు వెళ్ళలేకపోయాను. నన్ను చూడకపోతే తాతగారు ఉండలేరుకదా! రావలసిందని కబుర్లుచేస్తూ వచ్చారు. కాని నా హృదయంలో ఒకరకమైన భయం గూడుగట్టుకుని వుంది. ఆ చాయలకు మళ్ళీ వెళ్ళనే లేకపోయాను. తాతగారే అప్పుడప్పుడు నన్నూ, నా చెల్లెలు విభాదేవిని చూడ్డానికి వస్తూఉండేవారు. అభిమానం అదీ ఏమీవుండేదికాదు. 'నీవురాయగడ్‌కు రావటంమానేశావేం?' అని మాటమాత్రంకూడా అడిగేవారుకాదు. వచ్చేవారు, మమ్మల్నిచూచేవారు; సంతోషంగా ఉల్లాసంగా కాలంగడిపే వారు—వెళ్ళిపోయేవారు."

ఉదయాదిత్యుడు రవంత మందహాసంచేశాడు. మృదు లము, స్నిగ్ధము అయిన ప్రేమ విశాలనేత్రాల్లో వ్యాపించి పోయింది. ఆప్యాయంగా సురమాదేవి ముఖంలోకి చూచాడు. ఇప్పుడు చెప్పకూడని విషయమేదో ఆమెకు అర్థమైంది. తల వంచుకుంది. నునుసిగ్గుతో విచలితఅయింది. యువరాజు తన దోసిలిలోకి తీసుకుని ఆమెనతమస్తకాన్ని పైకిఎత్తాడు. ఆమెకు మరీదగ్గరగావచ్చి కూచున్నాడు. మెల్లిగా ఆ మెముఖబింబాన్ని తన హృదయానికి హత్తుకున్నాడు. కుడిహస్తాన్ని ఆమె

నడుముచుట్టూ పెనవైచి శాంత మృదుల ప్రేమభారంతో ఆమె కపోలం చుంబించాడు. "ఆ తరువాత ఏమైందో నువ్వు చెప్పాలి సురమా! తెలివితేటలచేత దీప్యమానము, స్నిగ్ధ ప్రేమచేత కోమలము, మృదుహాస దర వికచసుందరము అయిన నీ ముఖ బింబం ఎక్కడనించి వచ్చి మహోదయం అయిందో! నే నెన్నడూ అనుకోలేదు – ఆ విధంగా నాలో కూరుకుపోయిన కారుచీకటి తొలగిపోగలదని. నువ్వే నా ఉషస్సు; నా హృదయ కాంతికిరణం, నా ఆశాజ్యోతి. నీ వద్ద ఏ మాయా మంత్రం ఉన్నదో! ఆచీకటినంతా చెదరగొట్టేశావు" అంటూ పలుసార్లు ఆమెను ముద్దుపెట్టుకున్నాడు. సురమ ఏమీ మాటాడలేదు. ఆమె కన్నుల్లో ఆనందం వెల్లివిరిసింది.

"ఇన్నాళ్ళకు నాకు నిజంగా ఒక మంచి ఆశ్రయం లభించింది. నేను తెలివితక్కువవాడిని కాదు – అని ప్రప్రథమంగా నువ్వు నాకు తెలియజెప్పావు. ఆ మాట నేను విశ్వసించాను. నన్ను గురించి నేనూ ఆలాగే అనుకుంటూ వచ్చాను. బుద్ధి అనేది...చీకట్లు కమ్ముకుంటూన్న...ఎగుడుదిగుడుగా, కశ్మలంగా ఉండే...ఒక ఇరుకు సందులాంటిది కాదనీ...విశాల రాజమార్గంవలె సరళ సమతల ప్రశస్తమై వుంటుందనీ నువ్వు నాకు ప్రబోధించావు. నువ్వు రాకముందు నన్ను నేనే ఏవగించుకుంటూ ఉండేవాడిని. నామీద నాకే ఆదరణ లేకుండా ఉండేది. ఏపని చేయటానికీ ఉత్సాహం ఉండేది కాదు, సాహసం కలిగేదికాదు. 'ఇలా చేయటం బాగుంటుంది' అని నా మనస్సు చెబితే...సంశయగ్రస్తమైన సంస్కారం తలెత్తి, 'ఏమో మరి! ఏం చెప్పగలం? బాగుండకపోనూవచ్చు' అని

గొణగటం ఆరంభించేది. ఇతరులు ఎవరెలాగ ఏమి చేసినా సహించే వాడిని. నాకుమాత్రం ఏం చెయ్యటానికీ తోచేది కాదు. ఇన్నాళ్ళకిప్పుడు నాకు తెలిసింది – నాలోకూడా కొద్ది పాటి సత్తా అంటూ ఉన్నదనీ, నేనూ ఒక వ్యక్తిననీ – ఇది వరకు నేను అవ్యక్తుడిని, అగోచరుడను. నువు నన్ను అవ్యక్తం లోనించి బైటికి తెచ్చావు. నేను ఆ విస్మృతుడనైనాను. ఈ నాడు...నా మనస్సు మంచిదని చెప్పిన పనిని అప్పటికప్పుడు చేసెయ్యాలని ఉత్సాహపడుతున్నాను. నీ మీద నా కిప్పుడు సంపూర్ణమైన విశ్వాసం. నువు నన్ను విశ్వసిస్తున్నంతకాలం నా ఆత్మవిశ్వాసం కుంటుపడదు. నువు నన్ను ఇంత బలవం తుని చేయగలిగావంటే నీ యీ సుకుమార శరీరంలో ఎంత బలం దాగివున్నదో కదా!

ఇంత – అని పరిమితి చెప్పేందుకు వీల్లేనంత ఆత్మీయ భావంతో సురమాదేవి మగని వక్షస్సీమకు హత్తుకుని ఒదిగి పోయింది. ఆతని ముఖంలోకి చూస్తున్న ఆమె నేత్రాల్లో ఎంత ఆత్మార్పణ బుద్ధి ద్యోతకం ఔతున్నదో చెప్పలేం. 'నాది అంటూ ప్రత్యేకంగా వేరేమీలేదు. నేనే లేను. అంతా నువ్వే. కనుక నా సర్వస్వం ఉన్నట్టే' అని భాషిస్తు న్నట్టుగా ఉన్నాయి ఆమె నేత్రాలు.

చిన్నప్పటినుంచీకూడా ఉదయాదిత్యుడు చుట్టపక్కాలు తన యెడల చూపే ఉపేక్షాభావాన్ని సహిస్తూవచ్చాడు. ఒక్కొక్కనాడు నిస్తబ్ధనీరవగంభీర నిశాఘడియలలో సురమా దేవితో ఏకాంతంగా కూచుని తన గత జీవిత గాథను పరికర

కాలు ప్రకరణాలుగా సమాలోచించుకుంటూ ఉండటము అతనికి సరదా అనిపిస్తుంది.

"ఇలా ఎన్నాళ్ళని కాలం వెళ్ళబుచ్చగలం సురమా! ఒకవైపున రాజసభలోని ప్రముఖులంతా నాకేసిజాలిచూపులు నిగిడిస్తూ ఉన్నారు. మరోవైపు అంతఃపురంలో మా అమ్మ నీకు రాజవంశ నియమ నిబంధనలు అలవాటుచేస్తూ ఆరళ్ళు పెడుతూఉంది. దాసీలు, పరిచారికలుకూడా నిన్నంతగా గౌరవించడంలేదు. నేను ఎవరితోనూ ఏమీ సరిగ్గా మాట్లాడలేక పోతున్నాను. అంతా సహిస్తూ నోరు మూసుకుని ఊరుకుంటున్నాను. తేజోవంతమైన స్వభావం నీది. అయినా నువ్వుకూడా సహించి ఊరుకుంటున్నావు. నిన్ను నేను సుఖపెట్టలేకపోయిన తర్వాత... నా మూలాన నువ్వు కేవలం కష్టాలే, అవమానాలే భరిస్తూ ఉన్నావంటే... ఇటువంటి పరిస్థితికన్నా నువ్వునన్ను పెళ్ళిచేసుకోకుండా వుంటే బాగుండిపోయేదికదూ."

"అదేమిటండీ! మీరుకూడా అలాగంటారేం? ఇటువంటి సమయంలోనేకదా మీకు సురమాదేవి ఆవశ్యకత! అంతా సుఖమే అయితే నేనుమీకు చేసే సేవ ఏముంటుంది? సుఖసమయాల్లో సురమాదేవి ఒకవిలాసవస్తువు మాత్రమే, కేళీఉపకరణమే. మీకు ప్రతిపనిలోనూ నేను సాయపడాలి. మీకు సుఖపడేందుకు నేను ఎటువంటి దుఃఖాన్ని అయినా సహించగలగటంలోనే నాకు ఆనందం ఉంది. అట్టి అనుపమ ఆనందాన్నే నేను అనుభవిస్తున్నాను. సమస్త దుఃఖాల్ని అతిక్రమించి నాలో జాగృతమౌతున్న మహదానందం అదే. మీరు పడుతున్న కష్టాలన్నింటినీ ఒక్కసారిగా తొలగించలేక

పోతున్నాననేది అదొక్కటే, నాలో దుఃఖమంటూ ఉన్న ట్లయితే."

యువరాజు కాసేపు మౌనంగా ఉన్నాడు. చివరికిలా అన్నాడు: "నన్నుగురించి నాకు చింతేమీ లేదు. బాధలు సహించడము నాకు అలవాటైపోయింది. కాని నాకోసంగాను నువు అవమానాలు భరించడందేనికి? ఉత్తమయిల్లాలునలె దుఃఖసమయంలో నాకు ఓదార్పు కలిగించావు, శ్రమలో విశ్రాంతి ప్రసాదించావు. కాని నేను భర్తనైవుండీ నిన్ను అవమానకర పరిస్థితులనుంచి రక్షించుకోలేకపోయాను. మీ నాన్నగారు శ్రీపురానికి రాజు. వారు మా నాన్నగారి ఆధిపత్యాన్ని మన్నించడం లేదు. మా నాన్నగారికింద ఒక సామంతరాజుగా ఉండక స్వతంత్రులుగా ఉన్నారు. అందుకు ప్రతీకారం నీమీద తీర్చుకోవటం జరుగుతున్నది. మా నాన్న గారు నిన్ను నీచంగా చూచి తమ ఆధిపత్యగౌరవం సుస్థిరంగా ఉన్నట్టు సంతృప్తి పొంద దలచారు. ఇతర్లు ఎవరైనా నిన్ను అవమానిస్తుంటే చూచీ చూడకుండా ఉదాసీనంగా ఉంటు న్నారు. నిన్ను కోడల్నిగా స్వీకరించడమే నిన్ను గొప్పగా మన్నించినట్టు అయిందని ఆయన భావన. నాకు అప్పుడప్పుడు మనసులో అనిపిస్తూఉంటుంది. 'ఇక్కడ యిదంతా విడిచిపెట్టేసి నిన్ను తీసుకుని మరెక్కడికేనా వెళ్ళిపోదాము' అని. ఈపా టికి తీసుకునివెళ్ళి పోయేవాడినేమోకూడా. నువే అడ్డుతూ వచ్చావు."

రేయి చాల గడిచింది. సంధ్యాసమయంలో పొడసు రించిన నక్షత్రాలు చాలాఅస్తమించాయి. వాటిస్థానే ఇప్పుడు

కొత్తవి వచ్చి నిల్చాయి బైట దూరాన ప్రాకారద్వారంవద్ద పహారా కాస్తున్నవారి పదధ్వనులు కొద్దిగా వినిపిస్తున్నవి. ప్రపంచమంతా నిద్రపోతున్నది. నగరంలోని దీపాలన్నీ కొం డెక్కాయి. ఇళ్ళన్నీ మూసేవున్నాయి వీథుల్లో ఒకటి రెండు కుక్కలు తప్పితే జనసంచారంలేదు. ఇప్పుడు ఉదయాదిత్యు డున్న పడకగది తలుపులు వేసే వున్నాయి. హఠాత్తుగా బైటినుంచి ఎవరో తలుపుకొట్టుతూన్న చప్పుడు వినిపించింది. ఏమిటా, ఎవరా అని గాభరాపడుతూ వెళ్ళి తలుపుతీశాడు. గుమ్మంలో విభాదేవి నిల్చివుంది. "ఏం విభా! ఏమిటీ? ఏమైంది. ఇంత రాత్రప్పుడు ఇలా వచ్చావేం?" – అడిగాడు యువరాజు.

విభాదేవి ఉదయాదిత్యుని చెల్లెలని మనకు తెలుసు. "ఈ పాటికంతా సర్వనాశనమై వుండాలి" అన్నది విభాదేవి భయకంపిత కంఠస్వరాన. "ఏం? ఏమిటైంది?" అని ఆతృతగా అడిగారు–ఉదయాదిత్యుడు, సురమాదేవి. విభాదేవి వొణుకు తూన్న కంఠస్వరంతో ఏమిటో చెప్పింది. చెబుతూ చెబుతూనే ఏడువసాగింది. "అన్నయ్యా! ఇప్పుడేం చెయ్యాలి మరి!" అన్నది. "సరే. నే నిదిగో వెడుతున్నాలే" అన్నాడు ఉదయా దిత్యుడు.

"వద్దు – వద్దు – నువు వెళ్ళద్దు" అన్నది విభ.

"ఏం వెడితే?"

"నాన్నగారికి తెలిస్తే ఎలాగమరి? వారికి నీ మీద చాల కోపం వస్తుందేమో!"

"ఛీ-ఛీ-అదంతా ఆలోచిస్తూకూచోవలసింది ఇటువంటి సమయంలోనా?" అన్నది సురమాదేవి.

ఉదయాదిత్యుడు దుస్తులు వేసుకున్నాడు. నడుముకు కత్తి బిగించుకున్నాడు. బయలుదేరి వెళ్ళబోతున్న అన్నగారి చేయిపట్టుకుని "నువు వెళ్ళబోకు అన్నయ్యా! మరెవరి నైనా పంపించు. నాకు చాల భయంగావుంది" అన్నది విభ.

"విభా! నువు ఇక అభ్యంతరం చెప్పబోకు. వ్యవధి లేదు" అంటూ యువరాజు తక్షణమే వెళ్ళిపోయాడు.

విభాదేవి విహ్వలచిత్తయై సురమాదేవి చెయిపుచ్చుకుని "నాన్నగారికి తెలిస్తే ఏమౌతుందోకదా వదినా!" అన్నది.

"ఇంకా అయ్యే దేముంది? వారి హృదయభాండాంరంలో వాత్సల్యం చాలవరకు అంతర్హితమైపోయింది. ఏ కొంచమో మిగిలివుంటే అదికూడా ఇప్పుడు లేకుండా పోతుంది. పెద్ద ఇబ్బందేమీ లేదు."

"అది కాదు వదినా! నాకు చాలభయమనిపిస్తోంది-చెప్పద్దూ. నాన్నగారికి కోపంవచ్చి కఠినంగా వ్యవహరిస్తారేమో! అన్నయ్యను తీవ్రంగా దండిస్తారేమో!"

సురమాదేవి ఒక పొడుగాటి నిట్టూర్పు విడిచింది. "ప్రపంచంలో 'నా అన్న వాడెవడూ లేక నిస్సహాయుడైయున్న వానికి నారాయణుడే అధికంగా తోడుపడతాడు.' అని నా విశ్వాసం. ఓ దేవదేవా! నీ పవిత్రనామము కళంకితము కాకుండుగాక! నీపై నాకుగల భక్తిని సడలింపకుమయ్యా!" అన్నది సురమాదేవి

# 2

"ఆ పనివల్ల ఎట్టి పరిణామాలు వస్తాయోకదా! మహా రాజా!" – మంత్రి అడిగాడు ప్రతాపాదిత్యుని.

"ఏం పని?"

"నిన్న మీరు ఆజ్ఞాపించారే..."

"నిన్న నేను ఏమాజ్ఞాపించాను?" విరక్తి భావంగా అన్నాడు రాజు.

"తమరు తమ పెత్తండ్రిగారి విషయమై..."

"పెత్తండ్రిగారి విషయం? ఏమిటది?" దూకుడుగా ధ్వనించింది ప్రశ్న.

"వసంతరాయ్ యశోహారపట్నం వస్తూ దారిలో 'శిములతలి' సత్రంలో బస చేసినప్పుడు..."

ప్రతాపాదిత్యుడు కనుబొమలు పైకి లేపుతూ "ఊఁ – అప్పుడు! పూర్తిగా చెప్పు"

"అప్పుడు ఇద్దరు పఠానులు బయలుదేరిపోయి..."

"ఊ, పోయి!"

"ఆయన్ను హత్య చెయ్యాలి"

మహారాజుకు కోపం వచ్చింది. "మంత్రీజీ! అకస్మాత్తుగా చంటిపిల్లాడవైపోయావే! నీ చేత ఒక్కమాట చెప్పించటానికి పది ప్రశ్నలు అడగవలసి వస్తున్నదే! మాట నాలుక మీదికి రావటానికే అంతగా సంకోచిస్తున్నది కామాలేం? రాజకార్యాల్లో మనస్సు చక్కగా లగ్నం చెయ్యలేకపోతు

న్నారా? ఔనౌను, వయస్సు మళ్ళుతోందికదూ! ఇక పర లోక చింతనలో కాలక్షేపం చేయవలసిన సమయం వచ్చేసింది కామోలు! పోనీ, సెలవుపెట్టి ఆ పనే చేసుకుంటూ కూచుంటే బాగుండిపోనుగా!"

"మహారాజావారు నా అభిప్రాయం సరిగా గ్రహించి నట్టు లేదు."

"ఓ – బాగా గ్రహించాను. నేను ఒక్కమాట అడుగు తాను చెప్పండి – నేను తలపెట్టిన కార్యాన్ని మీరు నాలు కతో ఉచ్చరించేందుకుకూడా సంకోచిస్తారెందుకూ? నే నొక కార్యం తలపెట్టి చేస్తున్నానంటే...దానికి ఒక కారణం అవ శ్యం ఉండి తీరుతుంది అని మీరు భావించితీరాలి. బాగా ధర్మాధర్మవిచారణ కావించే నే నా నిర్ణయం చేశాను."

"చిత్తం, మహారాజా! నేను..."

"నేను చెప్పదలచుకున్నది పూర్తిగా వినండి ముందు– ఈ పని నేను తలపెట్టినప్పుడు – అంటే పెత్తండ్రిగారిని హత్య చేయించేందుకు ఉద్యమించే ముందు – మీతో లోతుపాతు లన్నీ చర్చించాను. ఆ పనిలో అధర్మం ఏమీ లేదు. మ్లేచ్ఛులు మన దేశం రావటంతో అనాచారం ఎక్కడచూచినా పెచ్చు పెరిగిపోతోంది. వాళ్ళు చేస్తున్న అత్యాచారాలవల్ల దేశంలో సనాతనధర్మం నశించిపోతోంది. క్షత్రియులు తమ కూతుళ్ళను మొగలాయి వాళ్ళకిచ్చేస్తున్నారు. హిందూ ఆచారాలు భ్రష్టమై పోతున్నవి. నే నీమ్లేచ్ఛుల్ని దేశంనించి తరిమిపారే స్తాను. ఆర్యధర్మం రాహుగ్రస్తం కాకుండా రక్షిస్తాను. అదే నా వ్రతం; దీక్ష. ఈ వ్రతం పూర్తి కావాలంటే నాకు బలం

ఉండాలి. అందుకు మన వంగదేశంలోని రాజులంతా నా ఆధిపత్యంకింద ఏకం కావాలి. యవనులకు మిత్రులై వున్నవాళ్లను మొదట నాశనంచేస్తేతప్ప ఆశయం నెరవేరదు. పెత్తండ్రి వసంతరాయ్ నాకు పూజ్యపాదుడే - కాని నిజంచెబితే పాపం లేదుగా! ఆయన మా వంశానికి కళంకప్రాయుడు—మ్లేచ్ఛులకు దాసుడై ప్రవర్తిస్తున్నాడు. అటువంటి వ్యక్తితో ఈ ప్రతాపాదిత్యునికి ఏవిధమైన సంబంధబాంధవ్యం ఉండదనుకో. రణం పుట్టినప్పుడు చెయ్యి అయినా నరికి పారేయవలసిందే. మా వంశానికి రణం, దేశానికి రణం, ఈ వసంతరాయ్‌ని నరికి పారేయవలసిందే - రాజవంశాన్ని, దేశాన్ని రక్షించుకోవలసిందే - అదీ నా ఆశయం"

"ఆ విషయమై మహారాజావారితో నాకు భిన్నాభిప్రాయం లేనేలేదు."

"లేకేం - ఇదివరకు ఉంది. నిజంచెప్పండి. ఇప్పటికీ ఉంది కదూ! చూడండి మంత్రీజీ! మీరు నా అభిప్రాయంతో ఏకీభవించలేక పోయినప్పుడల్లా ఆ విషయం నాతో కచ్చితంగా పైకి చెప్పివేస్తూ ఉండండి. అంతమాత్రం సాహసంకూడా మీకు లేకపోతే ఇక ఈ పదవి మీదికాదే అనుకోండి. మీ మనస్సులోని సందేహం స్పష్టంగా పైకి చెప్పేయండి. నేను బాగా అర్థం చేసుకునేందుకు అవకాశం ఇవ్వండి. ఎటువంటి పరిస్థితుల్లోనైనా పెత్తండ్రిగార్ని చంపటంఅనేది పాపం అని మీరు అభిప్రాయపడుతున్నారు. 'లేదు - లేదు' అనబోకండి. నిజంగా అదేభావం మీ మనసులో పొటమరిస్తోంది. దానికి జవాబు లేకపోలేదు. తండ్రిగారి ఆజ్ఞననుసరించి భృగుమహర్షి

తల్లిని చంపివేశాడు. ఇక అటువంటప్పుడు ధర్మం శాసిస్తోంటే నేను పెత్తండ్రిని ఎందుకు చంపివెయ్యకూడదూ?"

ఈ విషయంలో... అర్థాత్తూ ఇందును గురించి ధర్మాధర్మసంబంధమైన ఎట్టి అభిప్రాయమూ మంత్రికి లేనేలేదు. మంత్రి ఎంతలోతుగా ఆలోచించగలుగుతున్నాడో, రాజు అంతలోతుగా ఆలోచించలేకుండా ఉన్నాడు. అదీ అసలు విషయం. మంత్రికి తెలుసు - ఈ విషయంలో తనసంకోచ భావం పైకి ప్రస్ఫుటం చేసినట్టయితే రాజుకు బాగా కోపం వస్తుంది. కాని ముమ్ముందు సంభవించగల పరిణామాల్నిబట్టి మనస్సులోనైనా తెలుసుకుని సంతోషిస్తాడు. తన సంకోచం వెలువరించకపోయినట్టయితే రాజుకు తనమీద అనుమానం, భయం తప్పకుండాఏర్పడతాయి. "నేనుతమకు ఈవరకే మనవి చేసి ఉన్నాను. ఈ సమాచారం తెలిస్తే ఢిల్లీచక్రవర్తి చాల కోపగించుకుంటాడు నిజంగా."

ఆ మాటతో ప్రతాపాదిత్యునికి వొళ్ళుమండిపోయింది. అన్నాడు: "ఆగ్రహపడతాడు. ఔనౌను. ఆగ్రహించే అధికారం అందరికీ ఉంది. ఢిల్లీ చక్రవర్తి నాకు భగవంతుడా యేమిటి. అతడు ఆగ్రహిస్తే ముచ్చెమటలు పోసి గడగడలాడేవాళ్ళిక్కడ చాలామందే ఉన్నారు: మానసింగు, బీరబల్, మన వసంతరాయ్; ఇంకా ఆలోచించిచూస్తే తమరు కూడాను. ఇంతకూ మనం యావన్మందినీ ఆత్మవతుగా పరిగణించేందుకు వీల్లేదని మీరు గమనించాలి."

మంత్రి మందహాసం చేశాడు. "చిత్తం. అలాగే- మహారాజా! ఉత్తుత్తరోషానికి నేనైనా భయపడను. కాని

ఆ రోషంతోపాటు కత్తులు, కటార్లుకూడా ఉన్నవ్వాడు కాస్త తమూయించి ఆలోచించాలిగా! మహారాజా! ఢిల్లీశ్వరుని ఆగ్రహం అంటే... పాతిక వేల సైన్యం అన్నమాట.”

దానికి సరైన సమాధానం చెప్పలేక ప్రతాపాదిత్యుడు “చూడండి మంత్రిజీ! ఢిల్లీచక్రవర్తిభయం చూపించి నన్ను నా రాజకార్యాలనుంచి మరలించేందుకు ప్రియత్నించకండి. అది నన్ను ఒకరకంగా అవమానించడమే ఔతుంది.”

“ప్రజలకు తెలిస్తే ఏమి సమాధానం చెపుతాం?”

“తెలిస్తేకదా!”

“ఇటువంటి కృత్యాన్ని ఎన్నాళ్ళో మూసిపెట్టి దాచలేము మహారాజా! ఈ వార్త వ్యాపించి తీరుతుంది. వంగదేశమంతా తమకు శత్రువైపోతుంది. పైగా ఏ ఉద్దేశ్యంతో ఈ కార్యం తలపెట్టారో అది నెరవేరకపోగా మొదటికే చెడుతుంది. మిమ్మల్ని జాతిభ్రష్టునిగా పరిగణిస్తారు. అనేకరకాల ఇబ్బందుల్ని ఎదుర్కోవలసివుటుంది మహారాజా!”

“మంత్రిజీ! ఇదిగో మరోసారికూడా చెబుతున్నాను. నేను ఏపనైనా బాగా ఆలోచించే చేస్తాను. కాబట్టి నేను ఏపనిలోనైనా జోరబడి చేస్తున్నపుడు మీరు ఆ యీ అనవసర భయాలు చూపించి నన్ను వెనక్కు లాగేందుకు ప్రయత్నించకండి. నేను పాలుతాగే పసిపిల్లాడిని కాదు. అడుగడుగునా నన్ను అడ్డగించుతుండేందుకు కాదు మిమ్మల్ని నేను దగ్గర అట్టిపెట్టుకున్నది.”

మంత్రి మరి మాటాడలేదు. ఆయన పాటించవలసిన రాజాజ్ఞలు రెండు. ఒకటి: రాజుగారితో తనకు భేధాభిప్రాయం

ఉంటే స్పష్టంగా బయటికి చెప్పాలి. రెండు : వ్యతిరేకాభిప్రాయం సూచించి, తలపెట్టిన కార్యంనించి రాజును మరలించేందుకు ప్రయత్నించకూడదు. ఈరెండుఆజ్ఞలను సమన్వయం చేసి తాను ఎలా నడుచుకోవాలో మంత్రికి ఈ నాటివరకూ బోధపడ లేదు.

కాసేపాగి మంత్రి "మహారాజా! ఢిల్లీ చక్రవర్తి..." అంటూ ఏమో చెప్పబోయాడు.

రాజుకు ఆగ్రహం వచ్చేసింది "మళ్ళీ ఢిల్లీ చక్రవర్తి అంటావేమిటి? మంత్రీజీ! రోజు మొత్తంమీద తమరు ఢిల్లీ చక్రవర్తి పేరు ఎన్నిసార్లు స్మరణ చేస్తున్నారో అన్నిసార్లు గనక జగదీశ్వరుని పేరు స్మరించేటట్టయితే పరమార్థమన్నా దక్కుతుంది. నేను తలపెట్టిన ఈ పని పూర్తి అయేవరకూ ఢిల్లీశ్వరుని పేరు ఉచ్చరించబోకండి. ఇవాళ సాయంత్రం ఆ పని సక్రమంగా ముగిసినట్టు వార్త రావాలి. వచ్చినతరువాత అప్పుడు నా చెవిదగ్గరచేరి మీ యిష్టంవచ్చినన్నిసార్లు ఢిల్లీశ్వరుని నామం జపం చేయండి - అంతవరకూమాత్రం కాస్త ఆత్మ సంయమనం కలిగివుండండి దయచేసి."

మంత్రి మళ్ళీ కాసేపు మౌనంలో పడ్డాడు. ఢిల్లీశ్వరుని సంగతి మానేసి "మహారాజా! ఉదయాదిత్య యువరాజు..." అంటూ ఆరంభించాడు.

అర్థోక్తిలోనే రాజు అందుకుని "ఢిల్లీశ్వరుడు, ప్రజలు అయినారు. ఇక ఒక ఆడంగి పిల్లవాడి పేరు తెచ్చి నన్ను భయపెడదామని చూస్తున్నారా?"

"మీరు నన్ను పొరపాటుగా అర్థం చేసుకుంటున్నారు మహారాజా! మీ పనికి ఆటంకం కలిగించటం నా అభిప్రాయం కానేకాదు."

"అయితే ఏమిటి మీరు చెప్పదలచింది? కానీయండి" అన్నాడు రాజు చల్లబడి. "రాత్రి మన యువరాజుగారు అశ్వారూఢులై ఒక్కరే ఎక్కడికో బయలుదేరి వెళ్ళారు. ఇంతవరకూ తిరిగి రాలేదు."

"ఏ దిక్కుగా వెళ్ళాడు?" అడిగాడు రాజు విరక్తి భావసూచకంగా.

"తూర్పుగా వెళ్ళారు"

రాజు పళ్ళు పటపట కొరికాడు. "ఎప్పుడు బయలుదేరి వెళ్ళాడూ?"

"నిన్న అర్థరాత్రప్పుడు."

"శ్రీపురం జమీందారు కూతురు ఇక్కడే ఉందా?"

"చిత్తం ఇక్కడే ఉన్నారు."

"ఆ పిల్లను పుట్టింటికి పంపిస్తేనే బాగుంటుంది."

మంత్రి మరేమీ మాటాడలేదు. రాజు ఇలా చెప్ప సాగాడు: "ఉదయాదిత్యుడు ఏనాడూ కూడా తాను యువరాజ న్నట్టుగా సంచరించలేదు. చిన్నప్పటినించీ మామూలు ప్రజలతో కలిసి మెలిసి తిరుగుతూ వచ్చాడు. నా సంతానం ఇలా తయారవుతుందని ఎవరనుకుంటాను? సింహపు పిల్లకు సింహత్వం నేర్చుకోవాలా? నేర్పాలా? ఇంతకూ 'నరాణాం మాతుల క్రమః' అనే వాక్యం ఉందికదూ! బహుశా వాడికి మేన మామల చాలు వచ్చివుంటుంది. అది చాలక నేను శ్రీపురం

జమీందారు సంబంధం కూడా చేశాను. ఇంకేం, బంగారానికి సువాసన అబ్బినట్టయింది. అప్పటినుంచీ కుర్రవాడు పూర్తిగా అధోగతి పాలైనాడు. భగవంతుని దయవల్ల చిన్నబ్బాయి అయినా బాగుపడితే అంతేచాలు. నేను ఆరభించిన మహా త్కార్యం నిరవశేషంగా నెరవేరి...ప్రాణోత్క్రమణ సమ యంలో ఏ విధమైన కొదువ, చింత లేకుండా ఉండటమే భగ వంతుని నేను కోరే వరం – వాడింకా తిరిగి రానేలేదా?"

"లేదు – మహారాజా !"

నేలమీాద పదాఘాతం చేశాడురాజు. "ఎవరేనా కావ లావాడు వెళ్ళకపోయాడూ అతనితోకూడా !"

"ఒకడు వెళ్ళటానికి ఉద్యుక్తుడైనాడు. కాని యువ రాజుగారు 'వద్ద'న్నారు."

"పోనీ – అతనికి తెలియకుండా వెనకాలే ఒకడు వెంబ డించి వెడితే బాగుండేదిగా !"

"ఎవరికీ ఏవిధమైన అనుమానమూ కలగలేదు"

"అనుమానమే కలగలేదా ! మంత్రిజీ ! ఎవరూ వెళ్ళ కండా ఊరికేకూచుని వాళ్ళు చాల మంచిపని చేశారనేనా మీారు నాకు చెప్పదలచింది? అటువంటి అర్థంలేని ప్రసంగాలు నాతో ఎప్పుడూ చేయకండి. పహారా వాళ్ళు తమ కర్తవ్యాన్ని విస్మరించారన్నమాట. ఆ సమయాన ద్వారంవద్ద నియుక్తులై ఉండిన పహారావాళ్ళు ఎవరో వాళ్ళను పిలిపించండి ఇక్కడికి. ఈ చేసిన తప్పిదంవల్ల నా కోరిక విఫలంకావటమే తటస్థిస్తే ధ్వంసీపటలం చేసి విడిచిపెడతాను. మంత్రిజీ ! మీారుకూడా భయభావంనించి విముక్తులుకావటానికి వీల్లేదు. ఈ కార్యంలో

నాకు తప్ప మరింకెవరికీ ఏవిధమైన బాధ్యతా లేదనేనా మీరు నా ముందు రుజువుచేయదలచినది? అయితే వినండి; అసలు బాధ్యత అంతా మీమీదే ఉంది."

రాజు పహరావాళ్ళకు కబురుచేశాడు. కొంతసేపు గంభీరంగా మౌన ముద్రవహించిచాడు. "ఢిల్లీశ్వరునిగురించి మీరు చెబుతూ ఆపేశారు, ఏమిటదీ?" అని అడిగాడు చివరకు.

"మీమీద చాల ఫిర్యాదులు వెళ్ళాయిట ఢిల్లీశ్వరుని దగ్గరకు — అలాగని చెప్పుకుంటున్నారు; విన్నాను"

"ఎవరు పంపించారట ఫిర్యాదులు. మా యువరాజా వారు కారుకద!"

"కాదు మహారాజా! అలాంటిమాట అనకూడదు. ఎవరుపంపించివుంటారో ఇంతవరకూ పత్తా తెలియటంలేదు."

"సరే, ఎవడు పంపిస్తేనేంలే. ఆ విషయమై మీరేమీ విచారపడవలసిన అవసరం లేదు. ఢిల్లీశ్వరుని వ్యవహారం నే నే స్వయంగా ఆలోచిస్తాను. అతన్ని దండించే యేర్పాటు నేనే చూచుకుంటాను — ఆ పఠాన్‌లు ఇంకా తిరిగివచ్చినట్లులే దే! ఉదయాదిత్యుడూ ఇంకా తిరిగి రానేలేదుకదా! పిలిపించండి పహరావాళ్ళ నిక్కడికి తొందరగా."

## 3

అశ్వారూఢుడై విద్యుద్వేగంతో వెళ్ళిపోతున్నాడు యువరాజు. నిర్జనమార్గం; చీకటిరాత్రి. దారి బాగా వెడల్పుగా, సమతలంగా ఉండటంచేత మరేం భయంలేదు — ఆ నీరవనిస్తబ్ధ నిశాగర్భంలో గుర్రపు గిట్టలచప్పుడు ప్రతిధ్వనిస్తోంది. అక్క—

డక్కడ కుక్క ఒకటి మొరుగుతూ కనిపించేది. ఒకటి రెండు నక్కలు ఉలికిపడిలేచి వెదురుపొదల్లో పోయి దాక్కునేవి. ఆకాశంలో నక్షత్రాలు ప్రకాశిస్తున్నవి. దారి కిరుప్రక్కలా వున్న చెట్లపై మిణుగురు పురుగులవెలుగు, గిట్టెలచప్పుడుతో పాటు మరింకేదైనా ధ్వనిఉన్నదీ అంటే కీచురాళ్ళరవమే. ఆ చుట్టుప్రక్కల మనుష్యులపొడ ఏమైనా ఉన్నదీ అంటే అక్కడక్కడ ఏ చెట్టుకిందనో పడివున్న రక్తమాంసాలులేని ఎముకల గూళ్ళులా బిచ్చగాళ్ళో బిచ్చగత్తెలో, అంతే. అయిదుకోసులదూరంవెళ్ళాక యువరాజు ఒకమైదానం చేరు కున్నాడు. గుర్రపువేగం తప్పనిసరిగా తగ్గిపోవలసివచ్చింది. ఆ పగలంతా వర్షంపడింది. దారి యావత్తూ బురద అయింది. గుర్రపుగిట్టెలు దిగబడిపోతున్నవి. మూడుసార్లు గుర్రం తూలి పడిపోయేంతపనైంది. బాగా అలవువచ్చింది. ముక్కురంధ్రాలు ఉబ్బుతున్నాయి, పొట్టలు పడిపోతున్నాయి. నోట్లోనించి నురుగువచ్చేస్తోంది. డొక్కల్లోనించి ఒకవిధమైన చప్పుడు వస్తోంది. ముఖమంతా చెమటతో తడిసిపోయింది. వాతావర ణంలో గాఢంగా వేడిమి వుంది. గాలి బంధించేసింది. ఇంకా చాలాదూరం ప్రయాణం చెయ్యవలసివుంది. నీళ్ళతో, బురదతో నిండివున్న ఆ మైదానాన్ని, తరువాత పొలాల్ని దాటి యువరాజు ఎట్టకేలకు సరైనరోడ్డుకు చేరుకున్నాడు. గుర్రాన్ని తిరిగి వేగంగా దౌడుతీయించాడు. దాని మెడమీద ఒక్క చరుపుచరిచి "సుగ్రీవ్" అన్నాడు. తక్షణమే గుర్రం చెవులు నిక్కించి, ఇంతలేసి తన కళ్ళువిప్పి ఒక్కసారి యజ మానివైపు చూచింది. ఒక్కసారి మెడవంచి సకిలించింది.

మెడవంచి కళ్ళెం సళ్ళుచేసుకుంది మళ్ళీ. తలవంచి బాణంలా సాడుతీసింది. ఇసువంకలా వున్న చెట్లు సుస్పష్టంగా కనిపించటమే లేదు ఆ వేగంలో ; ఆకాశంకేసిచూస్తే నిప్పురవ్వలు అపరిమిత మైన వేగంతో పరుగుతీస్తున్నట్టుగావున్నాయి నక్షత్రాలు. అటి స్తబ్ధ వాతావరణంలోకూడా వాయువు అలలుఅలలుగా సుళ్ళుతిరుగుతూ 'బంయ్ బంయ్'ని శబ్దిస్తూ చెవులప్రక్కనించి దూసుకుపోతోంది. లోకాలయం ముందు పహారాకాస్తున్న నక్కలు తెలిపాయి–మూడవజాము అయినట్టు. ఆ సమయాన 'శిములతల' సత్రంముందు వచ్చి ఆగాడు యువరాజు. మరు క్షణమే గుర్రం కుప్పగా నేలకు కూలిపోయి మరణించింది. యువరాజు దానివీపుమీద తట్టిచూచాడు. ముఖంపుచ్చుకుని ఎత్తి "సుగ్రీవ్, సుగ్రీవ్" అని పిల్చాడు. కాని అది కదల్లేదు. మెదల్లేదు. ఒక పెద్దనిట్టూర్పు విడిచి యువరాజు లేచాడు. సత్రం గుమ్మందగ్గరకు పోయి తలుపుకొట్టాడు. చాలసార్లు తపతప కొట్టినతరువాత సత్రం కాపలావాడు తలుపుతీయకుం డానే కిటికీలోనించి ముఖంపెట్టి "ఎవరయ్యా, ఇంతరాత్రప్పుడు నువ్వు?" అంటూ చూచేసరికి గుమ్మంముందు శస్త్రధారియైన యువకుడు కనిపించాడు.

"ఒకమాట ఉంది. తలుపు తియ్యి"

"తలుపెందుకు తియ్యాలి. నువ్వు చెప్పేదేమిటో చెప్పరాదూ!"

"రాజగడ్ రాజు వసంత్ రాయ్ ఈ సత్రంలో బస చేశారా?"

# 4

అదొక నిర్జనప్రదేశం. ఒక మర్రిచెట్టుక్రింద వాహకులు లేని పల్లకీ ఒకటి ఉంది. దానిలో వృద్ధ వసంతరాయ్ కూచుని వున్నాడు. ఎవరూ లేరు దగ్గర... ఒక్క పఠాన్ తప్ప. పల్లకి ఇవతల కూచున్నాడు. ఇంతలో దూరాన ఏదో ప్రజల కోలాహలం వినిపించింది. మళ్ళీ కాసేపటిలోనే అది సమసిపోయింది. నిస్తబ్దంగావుంది వాతావరణం. "ఖాన్ సాహెబ్! నువుకూడా వెళ్ళకపోయినావటోయ్!" అన్నాడు వసంతరాయ్.

"నేను కూడా ఎలా వెళ్ళనండీ బాబూగారూ! మా ప్రాణాల్నీ, ఆస్తుల్నీ రక్షించేందుకు మీ మనుషులందర్నీ పంపించేశారు. అటువంటప్పుడు మిమ్మల్ని ఒంటరిగా, యిటువంటి దిక్కుమాలినచోట, కాపుదల అనేది ఏమీ లేకుండా దిగబెట్టి వెళ్ళిపోనా? నేను అలాంటి నమ్మకద్రోహిని కాదు సుమండీ! మా కవి చెప్పలేదూ; 'నాకు అపకారం చేసినవాడు నాకు అప్పుపడ్డాడన్నమాటే – వాడు ఆ అప్పును పరలోకంలో తీర్చుకోవలసిందే, తప్పదు – నాకు ఉపకారం చేసినవాడికి నేను అప్పు పడ్డానన్నమాట. ఆ అప్పుమాత్రం నేను ఎన్నటికీ తీర్చుకోలేను' అని మా కవివాక్యం."

భేష్. ఈ వ్యక్తి చాలా మంచివాడు– అనుకున్నాడు వసంత్‌రాయ్ తరువాత యిద్దరికీ కొంత ఏదో సంభాషణ జరిగింది. "ఖాన్‌సాహెబ్! నువు చాల మంచివాడవోయి" అన్నాడు వసంత్‌రాయ్ పల్లకీలోనుంచి బట్టతల బయటపెట్టి.

ఖాన్‌సాహెబ్ వంగి ఒక్క సలాం చేశాడు-తమ యిద్దరిలో ఆ విషయమై బేదాభిప్రాయం లేదన్నట్టు. కాగడా వెలుగులో వసంతరాయ్ ఖాన్‌సాహెబ్ ముఖం చూచాడు. "నువు ఒక శ్రీమంతులయింటో పుట్టిన వాడులా కనిపిస్తున్నావే!" అన్నాడు.

"చిత్రంగా ఉందే. మహారాజులుంగారి ఊహా కటాబిటిగా సరిపోయింది."

"ఏం ఉద్యోగంలో ఉన్నావిప్పుడు?"

పఠాన్ ఒక నిట్టూర్పు విడిచాడు. "ఇపుడు నా పరిస్థితులేమీ బాగాలేవు బాబయ్యా! పొలం కౌలుకు పుచ్చుకుని ఏదోరకంగా దున్నుకుంటున్నాను. కవి అంటాడు: 'దేవా, నువు గడ్డిని గడ్డిరూపంలో సృష్టించావు; అందులో నీ కాఠిన్యం బయటపడదు. కాని, రావిచెట్టును రావిచెట్టు రూపంలో సృష్టించి, చివరకు దాన్ని తుఫానుచేతుల్లో వొప్పజెప్పేసి, గడ్డితోపాటు దాన్నీ పడుకోబెట్టి నిద్రపుచ్చేస్తావు. అదిగో అందులో వుంది,నీగుండె బండరాయి అన్న విషయం' అలాగ అన్నాడు కవి."

ఆ మాటలకు వసంతరాయ్ హృదయం ఉల్లసితమైంది. "ఆహాహా! ఎంతబాగాచెప్పాడోయ్ కవి! ఖాన్‌సాహెబ్! కవి చెప్పిన ఆ రెండు పద్యాలూ నాకు రాసి యివ్వాలిసుమీ!"

ఇంకేం, తనరొట్టె నేతిలో పడిందనుకున్నాడు పఠాన్. ముసలాయన చాలామంచివాడే. ఏనాటికైనా తనకు బాగా సాయపడకపోతాడా! వసంతరాయ్‌కూడా ఆలోచనలోపడ్డాడు. ఒకప్పుడీ పఠాన్ శ్రీమంతుడే. కాని పాపం ఇప్పుడీస్థితిలో

వున్నాడు. లక్ష్మి చంచలురాలుకదా!– ఇలా అనుకుంటూ మనస్సులో చాలానే వ్యథితుడైనాడు. "నీకు నుంచి సౌష్ఠవమైన శరీరంఉంది. హాయిగా సైన్యంలో చేరావంటె బాగుండిపోనే" అన్నాడు.

వెంటనే ఆ మాట అందిపుచ్చుకుని పఠాన్ అన్నాడు. "ఎందుకు బాగుండదండీ దొరా! మా పనే అదాయెను. మా తండ్రులు, తాతలు అంతా కత్తిపుచ్చుకుని యుద్ధభూమిలో ప్రాణాలు విడిచినవాళ్ళే. నా కోరికకూడా అదే – కవి అంటాడుకదా:–"

వసంతరాయ్‌కి నవ్వొచ్చింది. "సరే, కవి ఏమన్నా అననీ, నువ్వు నా దగ్గర పనికి కుదిరితే నీ కోరిక నెరవేరితే నెరవేరనూవచ్చు. కాని బహుశా ఒరలోనుంచి కత్తితీయవలసిన అవసరం రాదనుకుంటాను. నేను ముసలివాడనైనాను. ప్రజలు సుఖంగా, స్వతంత్రంగా, హాయిగా బ్రతుకుతున్నారు. భగవంతుడు చల్లచూపు చూస్తే యుద్ధాలు చెయ్యవలసిన అవసరం రాకనేపోవచ్చు. వయసు మళ్ళింది, కత్తి మూల పడేశాను. దానిస్థానం యిపుడు ఇది ఆక్రమించింది" అంటూ ఓ పక్కనుంచి సితార్ తీసిచూపించాడు. తీగలమీద అలా వేళ్ళుమీటి ఒక మధురనాదం లేపాడు. పటాన్ పత్తికాయల్లా గుడ్లుపెట్టి "ఆహాహా ! మహా బాగా చెప్పారు బాబూ ? 'కత్తితో శత్రువును జయించగలం; కాని సంగీతంతో శత్రువును మిత్రునిగా చేసుకోగలం' అని కవి చెప్పాడు కదండీ!"

వసంతరాయ్‌కి సంతోషమైంది. "ఏమన్నావు పఠాన్ సాహెబ్! సంగీతంతో శత్రువునుకూడా మిత్రునిగా చేసుకో

గలమా! ఎంత గొప్పమాట!" అని పలికి కాసేపు మౌనంగా ఆలోచనలో పడ్డాడు. ఆలోచించినకొద్దీ అతనికి ఆశ్చర్యం గలుగసాగింది. కాసేపాగి కవి వాక్యాన్ని వ్యాఖ్యానపూర్వకంగా ఇలా అన్నాడు: "కత్తి నిజంగా చాల భయంకరమైన వస్తువే. కాని దానివల్ల శత్రుత్వం నశించిపోదు. నశించిపోతుందని ఎలా చెప్పగలం? రోగిని చంపితే రోగం నశించి ఆరోగ్యం చేకూరుతుందా? సంగీతం అత్యంత మధురమైన వస్తువు. దాని సాయంతో శత్రువును చంపకుండానే శత్రుత్వాన్ని నిర్మూలించవచ్చు. ఆహా! నిజంగా అది అసాధారణమైన కవిత్వం సుమా!" వృద్ధ వసంతరాయ్ చాల ఉత్సాహితుడైనాడు. కాళ్ళు పల్లకీ బైటికి చాచి కూచున్నాడు. పఠాన్‌ను ఇంకా తనకు దగ్గరగా వచ్చి కూచోమన్నాడు. "కత్తితో శత్రువును జయించగలం. కాని సంగీతంతో శత్రువునుకూడా మిత్రునిగా చేసుకోగలం. ఔనుకదూ ఖాన్‌సాహెబ్!"

"చిత్తం – హుజూర్!"

"నువ్వు ఒకసారి రాయగడ్ రావోయ్. నేనిప్పుడు యశోహార్‌కు వెడుతున్నాను. తిరిగి వచ్చాక నీకేదైనా మంచి యేర్పాడు చూస్తాను."

పఠాన్ ముఖం వికసించింది. "మీకు దయ గలిగితే ఎంతైనా చెయ్యగలరు మహాప్రభూ!" ఇంకేముంది, తన పంట యించుమించు పండినట్టే అనుకున్నాడు పఠాన్. "తమకు సితార్ వాయించటం వచ్చునా?" అని అడిగాడు. 'ఆఁ' అంటూనే వసంతరాయి తీగగోళ్ళు తగిలించుకుని తీగలు మీటటం ఆరంభించాడు. మధ్యమధ్య పఠాన్ తల ఊపుతూ

'వారెవా, చాలా బాగుంది' అంటున్నాడు. కళావేశం హెచ్చుతూన్నకొద్దీ వసంతరాయ్ పల్లకీలో కూచుని వుండలేక పోయాడు. లేచి నిలుచున్నాడు. నిల్చునే వాయిస్తున్నాడు. అభిమానం, గౌరవం, గాంభీర్యం, నా-నీ అన్నభేదం – సర్వం మరిచిపోయి, వాయిస్తూ, వాయిస్తూ పాడ్డంకూడా ఆరంభించాడు: రాత్రి యెటుల గడుచునో! ప్రియురాలు లేకనూ..."

పాట ముగిసింది, "వారెవా! ఏం గొంతు? ఏం మధుర వ్యథ!" అన్నాడు పఠాన్.

"అర్ధరాత్రివేళ నిశ్శబ్ద వాతావరణంలో ఇటువంటి విశాలమైదానంలో ఎటువంటిగొంతైనా అందరికీ బాగానే వుంటుంది. మధురంగానే వినిపిస్తుంది. ఇంతవరదాకా నా గొంతు బాగుంటుందని పొగడినవాళ్ళు లేరనేచెప్పవచ్చు. కాని ఒక్కవిషయం ఉంది: భగవంతుడు లోకంలో ఎన్ని రోగాల్ని సృజించాడో, అన్నింటికీ, ఏనోమొత్తానికి మందులు కూడా కల్పించాడు. అలాగే ఎన్నిగొంతులుపెట్టాడో అన్నింటికీ, ఎవరినో మొత్తానికి శ్రోతల్నికూడా ప్రసాదించాడు. నా గొంతుకూడా మెచ్చుకునేవాళ్ళు ఇద్దరుఉన్నారు. లేకపోతే ఈ నా దుకాణం ఎప్పుడో మూసివేసేవాడిని. ఆ యిద్దరు కొనుగోలుదారులూ వట్టి అమాయకులు. సరుకు నాణ్యం తెలిసిన వాళ్ళు కాదు. 'షేష్, షేష్,వారెవా' అని ప్రశంసావాక్యాలు వెచ్చించటంలో పీనాసి తనంపోరు. చాలరోజులైంది నేను ఆ యిద్దర్నీ చూడక. ఇన్నాళ్ళనించీ పాడ్డంకూడా లేదు. ఇప్పుడు వాళ్ళవద్దకే ఆదరాబాదరా పోతున్నాను. మనసారా పాటలు వినిపించి, ప్రాణాలమీాది బరువు దించుకుని తిరిగివచ్చేస్తాను".

ఇలా పలుకుతూన్న వసంతరాయ్ కన్నుల్లో వాత్సల్యం, ఆనందం మెరిశాయి.

పఠాన్ తనలో తాను ఇలా అనుకోసాగాడు. "మీ కోరిక ఇప్పుడొకటి నెరవేరింది. గానం వినిపించారు. ఇక ప్రాణాలభారం నేనే దింపేస్తాను...అయ్యయ్యో! అటువంటి పని చెయ్యవచ్చునా అసలు ఏ సందర్భంలోనైనా? కాఫిర్లను చంపటంలో పుణ్యమైతే ఉంది. అటువంటి పుణ్యం చాలానే సంపాదించాను, ఈవరకే. ఇక పరలోకసుఖం దక్కదన్న భయం లేనేలేదు. కాని ఈ ప్రపంచపు తల్లకిందు వ్యవహారాలు చూస్తూఉంటే... ఈ కాఫిర్లను చంపటం అన్న ఉద్యోగం మానేసి మరేదన్నా ఇంకోపనిలో కాలక్షేపంచేయటమే శ్రేష్ఠ మని తోస్తున్నది...

వసంతరాయ్ కాసేపటిదాకా ఏమీ మాటాడలేదు. ఇక ఉండబట్టలేక పోయాడు. ఉత్తేజితములైన భావాలు లోలోపల సందడిచేయసాగాయి. పఠాన్‌కు చాలదగ్గరగావచ్చి నిల్చుని "నేనిందాక చెప్పింది ఎవరిసంగతో తెలుసా? ఆయిద్దరూ నా మనమడూ, మనమరాలూను" అన్నాడు. ఇంతలో వర్త మానపరిస్థితులు గుర్తుకువచ్చి అధీరుడైనాడు. 'ఇంతవరకూ నా అనుచరులు ఒక్కడుకూడా తిరిగి రానేలేదే! ఇంకా ఎప్పుడువస్తారు?' అనుకున్నాడు మనసులో. మళ్ళీ సితార్ అందుకొని గానం ఆరంభించాడు.

ఇంతలో ఒక అశ్వారూఢుడు అక్కడికి వచ్చాడు, "అమ్మయ్యా, ఇప్పటికి ప్రాణాలు కుదుటపడ్డాయి. తాతయ్యా

గారూ! మధ్యదారిలో కూచుని ఎవరికండీ సంగీతం వినిపిస్తున్నారూ?" అంటూ.

ఆనందంలో ఆశ్చర్యంలో తలమునకలై వసంతరాయ్ చేతిలోని సితార్ పల్లకీలో పెట్టేశాడు. గబగబావచ్చి చేయి ఊత యిచ్చి ఉదయాదిత్యుని గుర్రమీదనుంచి దింపాడు. అమాంతం కావిలించుకున్నాడు. "సంగతులేమిటి నాయనా! అమ్మాయి కులాసాగా వుందా?"

"ఆఁ, అందరూ క్షేమమే."

వృద్ధుడు ఆనందపడుతూ సితార్ అందుకుని మళ్ళీ గానం ప్రారంభించాడు.

గానం ముగిసినతర్వాత ఉదయాదిత్యుడు పఠాన్ వైపు చూస్తూ మెల్లగా- "ఈ పఠాన్ ఎవరు? ఎక్కడివాడు? మీకెలా తారసిల్లాడు" అని అడిగాడు.

"ఖాన్‌సాహేబ్ చాలా మంచివాడు. బుద్ధిమంతుడు. అతను ఉండబట్టే ఈ రాత్రి ఆనందంగా గడిచింది" అన్నాడు వసంతరాయ్.

ఉదయాదిత్యుడు వచ్చినప్పటినుంచి పఠాన్ హృదయంలో రైళ్ళు పరుగెత్తుతున్నట్టుగా ఉంది. ఏం చెయ్యటానికీ పాలుపోక విచలితుడై కూర్చున్నాడు.

"సత్రంలో బస చెయ్యకుండా ఇక్కడ ఆగిపోయారేం తాతయ్యా!" ఉదయాదిత్యు డడిగాడు.

అందుకు సమాధానం ఖాన్‌సాహెబ్ అందుకుని ఇలా చెప్పాడు: "హుజూరువారు క్షమిస్తామంటే ఒక సంగతి మనవి చేస్తాను. మేము ప్రతాపాదిత్య మహారాజులుంగారి పౌరులం.

వారు నాకూ, నా సోదరుడికి ఒక హుకుం జారీ చేశారు. మీరు యశోహార్‌కు బయలుదేరి వస్తూన్నప్పుడు దారిలో పట్టుకుని వధించమని వారి ఆజ్ఞ.”

వసంతరాయ్ ఆ మాటకు ఉలికిపడ్డాడు: “రామ రామ రామ!”

పఠాన్ ఇంకా ఇలా చెప్పాడు: “మేము అటువంటి పనులు ఎన్నడూ చేసినవాళ్ళం కాదండీ! అందుచేత మొదట మేము ఒప్పుకోలేదు. మహారాజావారు రకరకాలుగా బెదిరించారు, భయపెట్టారు. ఇక గత్యంతరం లేక మేము సిద్ధపడి ఇలా రావలసి వచ్చింది. తమరు దారిలోనే కలిశారు మాకు. నా సోదరుడేమో ఊళ్ళో బందిపోటు వచ్చిపడ్డదని పడ్చి, మీ కాళ్ళా వేళ్ళా పడి మీ మనుషులను తీసుకువెళ్ళాడు. ఇక మిగతా భారం నాదైంది. కాని అది మహారాజావారి ఆజ్ఞ. అయినా అలాంటి పనికి నా మనస్సు సుతరాం అంగీకరించలేక పోయింది. ఎందువల్లనంటే కవి వాక్యం ఉన్నదిగా: ‘రాజాజ్ఞ పురస్కరించుకుని గాని, యజమాని హుకుం కదా అనిగాని యావత్తు ప్రపంచాన్నీ నాశనం చెయ్యాలంటే చేయగలవేమో గాని స్వర్గంలో ఓ మూల శాస్త చోటు నీకు లేకుండా చేసుకోకు సుమీ!’ అని. బీదవాడిని ఇక నాకు తమరే శరణ్యం. తిరిగి ఇంటికి పోయానంటే మృత్యువును కావిలించుకోవట మన్నమాటే. మీరే నాకు బ్రతుకు చూపించాలి; లేదా ఇక నాకు నిలువ నీడలేదు” అంటూ చేతులుజోడించి నిల్చున్నాడు.

వసంతరాయ్ చాలాసేపటివరకూ అలాగే విస్తుపోయి చూస్తూ నిల్చున్నాడు. చివరకిలా అన్నాడు పఠాన్‌తో: “ఓ

చీటీ రాసి ఇస్తాను. అది పుచ్చుకుని నువు రాయగడ్ వెళ్ళిపో. నేను తిరిగి వచ్చాక నీకేదైనా మంచి యేర్పాటు చూస్తాను"

"తాతయ్యగారూ! ఇంకా యశోహర్‌కు వెళ్ళాలనేనా మీా ఉద్దేశం?"

"ఔను నాయనా?"

ఆ సమాధానానికి ఉదయాదిత్యుడు ఆశ్చర్యపోయాడు. "అదేమిటి తాతయ్యగారూ? వెళ్ళి ఏం లాభం?"

"ప్రతాప్ నాకేం శత్రువా నాయనా? వెయ్యి తప్పులు చెయ్యనీగాక అతడు నాకు స్నేహపాత్రుడు కాకండాపోతాడా? నాకేమన్నా హాని జరుగుతుందేమో నన్న భయం నాకేంలేదు. నేను ఈ సంసార సముద్రం ఈది ఈది చివరకు వచ్చేశాను. ఇంకొక్క అల వచ్చి తోసేసిందంటే ఈ ఆట ముగిసిపోతుంది. కాని ఇలాంటి పాపకార్యానికి ఒడిగట్టిన ప్రతాప్‌కు ఇహపరాలు లేకుండా పోతాయే! అదే నాబాధ. ఆ బాధతో నేను నిశ్చింతగా ఎలా ఉండగలను చెప్పు. వెళ్ళి, మనిషిని గుండెకు హత్తుకుని, ఒక్కసారి మంచి చెడ్డలు తెలియజెబుతాను". వసంతరాయ్ కన్నులు చెమ్మగిల్లాయి. ఉదయాదిత్యుడు దోసిటలో ముఖం వాల్చుకున్నాడు.

ఇంతలో గలగలా మాటాడుకుంటూ వసంతరాయ్ అనుచరులు వచ్చేశారు - "ఏరీ! మహారాజావారు! ఉన్నారా? ఏరీ" అని ఆతృతగా అందరూ అడగసాగారు.

"ఇదిగో ఇక్కడే ఉన్నానర్రా! ఎక్కడికి పోతానూ?"

"ఆ పఠాన్ ఏడీ! ఎక్కడికి పోయాడూ?" అందరూ ఏకగ్రీవంగా అడిగారు.

వసంతరాయ్ అడ్డు వచ్చి "ఆగండి. ఖాన్‌సాహెబ్‌ను ఎవరూ ఒక్కమాటకూడా అనటానికి వీల్లేదు" అన్నాడు.

"మహారాజా! ఇవాళ మాకు అనవసరంగా చాల శ్రమ అయింది. అతగాడు—" అంటూ ఆరంభించాడు ఒకడు.

వాడిమాట పూర్తి కాకుండా ఇంకొకడు అందుకున్నాడు. "నువ్వు ఊరుకో. జరిగినదంతా పూసగుచ్చినట్లు నేను చెబుతాను. ఆ పఠాన్‌గాడు మమ్మల్ని సూటిగా ఒక మైలుదూరం తీసుకుపోయాడు. అక్కడినుంచి ఎడమవైపు తిరిగి చివరకు ఒక మామిడితోటలోకి తీసుకుపోయి —"

"మామిడితోటకాదోయ్. తుమ్మలతోపు-" అన్నాడు మూడో అతను కల్పించుకుని.

"సరే, తుమ్మలతోపేలే. తరువాత?" అంటూ ఉదయాదిత్యుడు అడిగాడు.

రెండవవాడు అందుకుని చెప్పసాగాడు; "అక్కడినుంచి ఒక మైదానంలోకి తీసుకుపోయాడు. మా అందరికీ విసుగెత్తిపోయింది. అలసిపోయాం. ఎంతదూరం నడిచినా ఊరూ పాడూ ఏమీ కనిపించదాయెను. అలా హైరానుపడుతూ మూడుగంటలు నడిచాక ఒక ఊరు చేరాం. కాని చూద్దుముకదా! ఏదీ పఠాన్! పత్తాలేకుండా మాయమైపోయాడు."

ఈ జరిగిన సంఘటన గురించి తర్జన భర్జనలు జరిగాయి. ఆ యీ విషయాలపై అభిప్రాయభేదాలు ఉన్నా 'ఇందులో ఏదో గూడుపుఠాణీ ఉన్నది' అన్నవిషయంలో మాత్రం అందరూ ఏకాభిప్రాయులుగానే ఉండిపోయారు.

# 5

"చూచావామనె, మంత్రీజీ! ఆ పఠాను లిద్దరూ ఇంత వరకూ తిరిగి రానేలేదు." అన్నాడు ప్రతాపాదిత్యమహారాజు.

"అందులో నా దోషం ఏముంది మహారాజా!"

రాజు కంఠస్వరంలో తీవ్రత వచ్చింది. "దోషం గురించిన ప్రసక్తికాదు. వాళ్ళు తిరిగి రావటానికి ఇంత ఆలస్యం ఔతుందే; అందుకేదో కారణం ఉండి వుండాలికదా! మీ ఉద్దేశ్యం ఏమిటి అని అడుగుతున్నాను."

"శిములతలిసత్రం ఇక్కడికి చాలాదూరం. వెళ్ళాలి, పని పూర్తికావాలి; తిరిగి రావాలి. ఆలస్యం కాకుండా వుంటుందామరి!"

అటువంటి సమాధానంతో రాజుకు సంతృప్తి కలుగలేదు. తన హృదయంలో తొలుస్తున్న అనుమానమే మంత్రి హృదయంలోకూడా కెలకవేస్తూ ఉండాలని ఆయన కోరిక. కాని మంత్రిమనస్సు ఆ దిశలో వెళ్ళడమేలేదు. "ఉదయాదిత్యుడు నిన్నరాత్రికదూ బయలుదేరి వెళ్ళాడన్నారు?"

"చిత్తం. ఆ సంగతి మీకు మొదటే మనవిచేశాను."

"మొదటేమనవిచేశారు! సరిగ్గా సమయానికి చెప్పారా? ఎప్పుడో ఒకప్పుడు చెబితేసరి – మీ కర్తవ్యం పూర్తి అయిపోతుందన్నమాట! అంతేనా? ఉదయాదిత్యుని వ్యవహారం ఇదివరకు ఇలా ఉండేది కాదు. శ్రీపురం జమీందారుకూతుర్ని వివాహమాడిన తరువాతే యిలా మారిపోయాడు! వాడిని ఆ

దుష్టురాలి సహచర్యమే ఇంతకు తెచ్చింది. ఔనంటారా? మీ ఉద్దేశ మేమిటి?"

"నే నెలా చెప్పరు మహారాజా!"

"మీ రొక వేదవాక్యం చెప్పాలనీ, నేను వినాలనీ కాదు నా కుతూహలం. ఆ విషయమై మీ అనుమానం ఎలావుందీ? అదీ అడుగుతున్నాను."

"మీకు రాణీగారివల్ల కోడలి సంగతి సందర్భాలు తెలుస్తూఉంటాయి. కనుక మీ కేవో అనుమానాలు కలుగుతూవుండవచ్చు ఏ అనుమానంగాని నా కెలాకలుగుతుందీ?"

ఇంతలో ఒక పఠాన్ లోనికివచ్చాడు. "ఏమైంది? పని పూర్తిఅయిందా?" అడిగాడురాజు.

"చిత్తం మహారాజా! ఈ పాటికి అంతా పూర్తిఅయి పోయే వుంటుంది."

"అదేంమాట! నీకు తెలియదా?"

"చిత్తం. తెలియకేం, పని అయిపోందండి. సందేహం ఏమీలేదు. కాని ఆ సమయ మప్పుడు నే నక్కడలేను"

"మరి పనైపోయినట్టు నువ్వు ఎలా చెప్పగలవు?"

"తమ ఆజ్ఞానుసారం వారి అనుచరుల్నిదూరంచేసి నే నిలా ఎకాయికి వచ్చేశాను. ఖాన్‌సాహెబ్ ఆ మిగిలినపని పూర్తిచేసే వుంటాడు."

"చేసి వుండకపోతే?"

"ఉన్నదికదా మహారాజా! నాతల మీదగ్గర తాకట్టు!"

"సరే, గుమ్మందగ్గర వేచివుండు. మీ సోదరుడు రావటంతోనే మీ బహుమానం ఇప్పించేస్తాను"

పఠాన్ వెళ్ళి గుమ్మం ఆవల పహారా కాసేచోట నిల్చున్నాడు.

రాజు కాసేపు ఆలోచనా నిమగ్నుడై వున్నాడు. చివరకు మంత్రివైపు తిరిగి అన్నాడు, "మంత్రీజీ, ఈ విషయం ప్రజల కేమాత్రమూ తెలియనీకుండా జాగ్రత వహించాలి."

"క్షోప్పడకండి మహారాజా! ఇది బయటపడకండా మాత్రం ఉండదు."

"ముందే చెప్పేస్తున్నారే. మీ కెలా తెలుసూ?"

"ఇంతకుముందే మీ రొక సందర్భంలో పెత్తండ్రిగారి మీది ద్వేషం ప్రకటించుకునే వున్నారు. మీ అమ్మాయి గారి పెండ్లప్పుడు మీరు బుద్ధిపూర్వకంగా వారిని పిలవటం మానేశారు. పిలవకపోయినా వారు వచ్చారనుకోండి. ఇవాళ మీరు ఆకస్మికంగా వారిని రావలసిందని ఆహ్వానం పంపారు. దారిలో ఎవరోవారిని హత్యచేశారు. ఆ దుర్ఘటనకు కారణం మీ రేనని పరిస్థితులెరిగిన వారి ఊహకు అందదంటారా?"

రాజుకు బాగా కోపం వచ్చేసింది. "మీ మనసులోని భావమేమిటో నా కసలు బోధపడటంలేదు మంత్రీజీ! అది బయటపడటమే మీకు సంతోషదాయకమన్నమాట! ప్రజలు నన్ను నిందిస్తూంటే మీకామ్యం ఫలించినట్లన్నమాట! అంతేనా? నా కలాగే అర్థమౌతున్నది మీ వ్యవహారం. రాత్రింబగళ్ళు మీరు ఒకటేపాటపాడుతున్నారు 'అది దాగదు; బయటపడుతుంది' అని. ఎందుకు బైటపడాలో నాకేం కారణం కనిపించటంలేదు. ఇంతకూ నాకు తోస్తున్నవిషయం ఏమంటే

అది దానంతట అదే బయట పడకపోతే తమరే ఇంటింటికీ పనిగట్టుకు వెళ్ళి చాటించి వస్తారు. అంతేనా?"

"క్షమించండి మహారాజా! అన్నివిషయాలూ నా కంటే మీకే ఎక్కువగా తెలుసు. నావంటి అల్పజ్ఞుడు తమకు సలహా చెప్పటమనేది మిక్కిలి అసంభావ్యం. కాని మీరే నన్ను మంత్రినిగా ఎన్నుకున్నారు. అందుచేత అప్పుడప్పుడు నా బుద్ధికి తోచిన దేదో చెబుదామన్న సాహసానికి దిగుతున్నాను. నా సలహాలు మీకు కోపం కలిగిస్తున్నవైతే ఈ దాసుడిని మీ సేవలోనుంచి సెలవిచ్చి పంపివెయ్యండి"

దారికివచ్చాడు రాజు. మంత్రి రెండుమూడు మాటలు గట్టిగా విసిరినప్పుడెల్లా రాజుకు తృప్తికరంగా వుంటుంది. అన్నాడు: "ఈ యిద్దరుపఠానులనూ రూపుమాపితే ఇక భయపడవలసిన అవసరమే ఉండదు."

"ఒక్కహత్యను దాచిపెట్టటమే చాలకష్టం. అటువంటి ప్పుడు మూడుహత్యలను దాచిపెట్టటం పూర్తిగా అసంభవం." మంత్రి ఒకేమాటమీద నిలబడ్డాడు.

"కాబట్టి నేను భయపడి గడగడ వొణికిపోతాను. అంతేనా? ప్రజలకు తెలిస్తే తెలుస్తుంది ఇది యశోహారరాజ్యం; రాయగడ్ కాదు. ఇక్కడ ప్రజలదికాదు రాజ్యం. ఇక్కడ ఒకడే రాజు. ఆ ఒక్కడికీ తప్పితే మరెవరికీ రాచరికంలేదు. కాబట్టి ప్రజల్ని చూపించి నన్ను భయపెడతారా మీరు? వ్యర్థప్రయత్నం. ఎవడైనాసరే. ఈ విషయమై నాకు వ్యతిరేకంగా వ్రేలుడు సాగించాడంటే, ఎర్రగా కాల్చిన యినుపకడ్డీ పెట్టి వాడినాలుక దగ్ధంచేసిపారేస్తాను. తెలిసిందా?"

మంత్రి తనలో తాను నవ్వుకున్నాడు. తనలో తాను మనసులో అనుకున్నాడు : 'ప్రజల నాలుక అంటే ఎంత భయమో! అయినాకూడా ప్రజలకు ఏమాత్రం భయపడనట్టు తన మనసుకు తానే నచ్చచెప్పుకుంటూ ఉంటాడు!'

ఇంతలో మెల్లిగా అడుగులు వేసుకుంటూ వసంతరాయ్ లోపల ప్రవేశించాడు. ప్రతాపాదిత్యుడు ఉలికిపడి, వెనక్కు తూలాడు. వచ్చింది మనిషి అనుకోలేదు, భూతం అనుకున్నాడేమో! నిర్ఘాంతపోయాడు. నోటివెంట మాటరాలేదు. వసంతరాయ్ దగ్గరకు వచ్చాడు. వీపుమీద చేయివేసి దువ్వాడు. "నేనంటే నీకు భయమెందుకు ప్రతాప్! నేను నీకు పెత్తండ్రిని కదూ! పెత్తండ్రినన్న నమ్మకం నీకు కుదరకపోయినా – ముసలివాడినికదా! నీకు హానిచెయ్యగలిగిన శక్తి యేమీ లేదే నాలో!" అన్నాడు స్నేహపూర్వకమైన మృదులకంఠస్వరాన.

ప్రతిపాదిత్యునికి కొద్దిగా చైతన్యంవచ్చింది. కాని ఇంకా పెదవివిప్పి మాటాడగలశక్తి రాలేదు. మాటా పలుకు లేకండా నిల్చున్నవాడు నిల్చున్నట్టేఉండిపోయాడు. పెత్తండ్రికి పాదాభివందనం చెయ్యటంకూడా గుర్తుకురాలేదు. "ప్రతాప్! ఏదీ ఒక్క మాట మాటాడు. నన్ను చూస్తే అంతగా లజ్జపడటానికై, చిన్నబుచ్చుకోటానికి కారణం ఉన్నదా? అటువంటి అనుచితమైన పని నువ్వు ఏదైనా చేసివుంటే ఏ మాత్రం విచారపడబోకు. నేనెవ్వరితోనూ కించిత్తుకూడా పైకిచెప్పను. రా, నాయనా! ఏదీ ఒక్కసారి నా కంఠం కావలించుకో. చాలరోజులైంది మనం కలిసి. ముసలివాడి నైనాను. మళ్ళీ వచ్చి కలుసుకో గలుగుతానో లేదో!"

ఇంతసేపటికి ప్రతాపాదిత్యుడు పెత్తండ్రికి ప్రణామం చేశాడు. దగ్గరకువచ్చి కౌగిలించుకున్నాడు. మంత్రి ఈలోగా తిన్నగా బయటికివెళ్ళిపోయాడు. వసంతరాయ్ మృదుమధుర మందహాసంచేస్తూ, అతని వీపు నిమురుతూ ఇలా అన్నాడు. "వసంతరాయ్! ఇంకా ఇలా చాలరోజులు బ్రతికివున్నాడు కదూ! ఔనా? ఈ పాటికంతా అయిపోవలసిందే. కాని భగవంతు డెందుకోమరి దబ్బున తీసుకుపోకుండా ఆలస్యం చేస్తున్నాడు. అయినా యింకా ఎన్నాళ్ళో గడవవులే" అంటూ కాసేపు ఆగాడు. ప్రతాపాదిత్యుడేమీ సమాధానం చెప్పలేదు. వసంతరాయ్ మళ్ళీ ఇలా చెప్పసాగాడు: "విషయం నేనే విడమరచిచెప్పనా? నువు నా మీద కత్తి కట్టావన్న సమాచారమే కత్తికన్నా ఎక్కువగా నన్ను గాయ పెట్టింది. మర్మభేదియైన గాయం!" వసంతరాయ్ నేత్రాలు అశ్రుసిక్తము లైనాయి. "ఏమైనా నీమీద నాకేం కోపం లేదు. నీ మీద నాకున్న ప్రేమ ఏమాత్రం తగ్గలేదు. కేవలం రెండుమాటలు చెప్పిపోదామని వచ్చాను. నువు నన్ను హత్య చెయ్యబోకు ప్రతాప్. అందువల్ల నీకు ఇహపరాలు రెండూ చెడిపోతాయి. నేను ఎప్పుడు చచ్చిపోతానా అని ఇంతవరకూ ఎదురుచూచావు; ఇంకో నాలుగైదురోజులు ఓపిక పట్టలేవూ? ఇంతమాత్రానికే పాపం ఒడిగట్టుకుంటావా?"

ప్రతాపాదిత్యుడు మాటే మాటాడకుండా కూచున్నాడు. చేసిన తప్పు అంగీకరించలేదు; పశ్చాత్తాపం కనబరచనూలేదు. అప్పుడు వసంతరాయ్ ఆ ప్రసక్తి మానేశాడు. "ప్రతాప్! నువు ఒకసారి రాయగడ్ రా; చాలకాలం అయింది నువు

అక్కడికి రాక - వచ్చి చూద్దువుగాని: అక్కడ చాల సంస్కరణలు వచ్చాయి. సైనికులు ఇప్పుడు కత్తులూ మూలపడేసి నాగళ్ళు పట్టారు. సైన్యశిబిరాలు అతిథిశాలలైనాయి..."

గుమ్మం ఆవల నిల్చుండి యుండవలసిన ఆ పఠాను చల్లగా జారుకోటానికి ఉద్యుక్తుడౌతున్నాడు. ప్రతాపాదిత్యుడు కనిపెట్టా డాసంగతి - తన్ను తాను సంబాళించుకోలేకపోయాడు. హృదయనిబద్ధమై యుండిన రోషాగ్ని లోలోపల రాజుకుని ఒక్కసారిగా జ్వాలాయుతంగా పైకిలేచింది. "జాగ్రత! వాడిని పారిపోనీకండి - పట్టుకుని బంధించండి" అంటూ గర్జించాడు. మరుక్షణమే అక్కడినించి లేచి దూకుడుగా వెళ్ళిపోయాడు.

రాజు మంత్రిని పిలిపించాడు. "మంత్రీ! రాజకార్యాల్లో నువు చాల ఏమరుపాటుగా వుంటున్నావు; కనిపిస్తూనేఉంది."

"మహారాజా! ఆ విషయంలో నా దోషం లేశమాత్రమూ లేదు" అన్నాడు మంత్రి మెల్లిగా. రాజు మాటల్లో దూకుడు హెచ్చింది. "నేను ప్రత్యేకంగా ఏ విషయాన్ని గురించీ మాటాడ్డంలేదే. తమకు రాజకార్యాల్లో ఏమరుపాటు హెచ్చింది అని మాత్రమే చెబుతున్నాను. ఆ నాడు మీకొక ఉత్తరం అట్టిపెట్టమని ఇచ్చాను. దాన్ని కాస్తా మీరు పారేశారు ఎక్కడో" (రెండు నెలల్రకితం అటువంటి సంఘటన ఒకటి జరిగినమాట వాస్తవమే. కాని అప్పుడు రాజు ఏమీ మాటాడలేదు; ఊరుకున్నాడు.) మరొకసారి ఉమేశరాయ్ దగ్గరకు వెళ్ళిరావలసిందని కోరాను. మీరు వెళ్ళకుండా ఇంకెవరినో పంపించారు - ఊరికే వాగబోకండి. చేసిన తప్పులు

కప్పిపుచ్చుకోటానికి అబద్ధాలకు దిగకండి. ఏమన్నా అనండి — రాజకార్యాల్లో మీరు చాల ఏమరుపాటుగా ఉంటున్నారు చెప్పొద్దూ."

తరువాత రాజు పహరావాళ్ళను పిలిపించాడు. ఇదివర కే వాళ్ళ జీతం తగ్గించటమైంది. ఇప్పుడు వాళ్ళకు కారాగార శిక్ష విధించి పంపించాడు.

అంతఃపురంలోకి వెళ్ళి రాణికి కబురుచేశాడు. "చూస్తున్నావా, రాణీ! మన దేవిడీలో ఎవర్నిచూచినా విశృంఖలంగా సంచరిస్తూ ఉన్నారు. ఎవడియిష్టం వాడిదిగా ఉంది. ఉదయాదిత్యుడు ఇదివరకెప్పుడూ ఇలా కాదు; ఎప్పుడుపడితే అప్పుడు ఇష్టం వచ్చినట్లు బైటికి వెడుతూ ఉన్నాడు. ప్రజలతో వెళ్ళి కలిసి తిరుగుతున్నాడు. నాకు వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నాడు. ఏమిటివంతా? దీని అర్థం ఏమిటి?"

రాణికి భయంవేసింది. "వాడిదేమీతప్పులేదు మహారాజా! ఈ అనర్థం అంతటికీ మూలం ఆ కోడలే. నా కొడుకెన్నడూ ఇలా ప్రవర్తించలేదు ఇదివరకు. శ్రీపురం జమీందారు కూతురు మనయింట్లో అడుగు పెట్టిననాటినుంచే ఇలా మారిపోతున్నాడు మరి. ఏం మాయో యేమో! నాకూ అయోమయంగానే ఉంది."

"కోడల్ని బాగా అదుపాజ్ఞల్లో వుంచు, జాగ్రత్త" అంటూ రాజు అక్కడినుంచి వెళ్ళిపోయాడు. రాణి ఉదయాదిత్యునికి కబురుచేసింది, అతడు వచ్చాడు. తల్లి అతని ముఖంలోకిచూస్తూ "బాబూ! ఇలా మారిపోయావేం నాయనా! ఒళ్ళంతా చిక్కిపోయింది. ముఖమంతా నల్లబడిపోయింది.

ఎవరి మూలానరా పాపం నీకీ దశవచ్చింది!—పెండ్లికిపూర్వం
ఎలావుండేవాడివి? ఆరంగూ, ఆ చక్కదనం, ఆ బలం ఏమైపోయి
నాయి? పెళ్ళాంమాటలువిని ఎలాఅయిపోయావురా! అయ్యో!
దానిమాటలిక పట్టించుకోకు" సురమా దేవి అక్కడే ఓ మూల
మేలి ముసుగులోనుంచి మౌనంగా చూస్తూ నిల్చిఉంది. రాణి
ఇంకా ఇలాచెప్పసాగింది కుమారునితో: "దానివంశమే అలాం
టిది. మనలాగొప్పవంశంకాదు, అటువంటివంశంలో పుట్టినపిల్ల
నీకేమాత్రం తగిన వధువు కాదు. నీవంటి వాడికి సలహా చెప్ప
దగిన యోగ్యత దానికి వున్నదా అసలు? నిజం చెబుతున్నా
నురా అబ్బాయి. అది నీకు మంచిసలహా ఇవ్వదు; ఇవ్వలేదు.
నీవుఎలా పాడైపోతావా అనేదే నిరంతరం దాని ఆలోచన.
అలాంటి దయ్యాన్ని తెచ్చి నీ మెడకు కట్టారు మీ నాన్న"
అంటూ రాణి కన్నులొత్తుకుంది.

ప్రశాంతంగావున్న ఉదయాదిత్యుని నొసలపై చెమట
బిందువులు తళుకు మంటున్నవి. మనసులోని కలవరపాటు పైకి
ఏమాత్రం కనిపించకుండా చూపులు ప్రక్కకు తిప్పుకున్నాడు.

ఒకముసలిదాసి ఆ పక్కనే కూచునివుంది. అది
చేతులు త్రిప్పుకుంటూ ఆరంభించింది; "శ్రీపురంజమిందారు
కూతుళ్ళంటే మాయలు మంత్రాలు తెలిసిన జాణలు. కోడలు
గారు కుమారరాజాగారికి యేదో మందుపెట్టే వుంటుంది
నిజంగా." అంటూలేచి ఉదయాదిత్యునికి దగ్గరగా వచ్చింది.
"యువరాజుబాబూ! నిజంగా మీకు మందుపెట్టేవుంటుంది
కోడలమ్మగారు. శ్రీపురం ఆడపిల్లలంటే ఏమిటనుకున్నా
రేమిటి? దయ్యాలన్నమాట, దయ్యాలు! చూడండి పాపం!

మీ శరీరం, ముఖం ఎలా అయిపోయాయోను!" అంటూ బాణాల్లాంటి చూపులు సురమాదేవివైపు విసరి, పైట కొంగుతో... అసలే ఎర్రగావున్న కన్నుల్ని నలుపుకుని ఇంకా ఎర్రగా చేసుకుంది. అదిచూంచి రాణి హృదయంలోనించి దుఃఖం పొర్లివచ్చింది. ఒకవ్యాధిలా ఈ ఏడుపురోగం అంతః పురపరిచారికలందరికీ వ్యాపించిపోయింది. తాము కూడా ఏడ్చి రాణిగారికి సానుభూతిచూపించేనిమిత్తం దాసీజనమంతా చుట్టూ మూగారు.

ఉదయాదిత్యుని కరుణార్ద్రదృష్టి సురమాదేవివైపు పరుగెత్తింది. ఆమె తన మేలిముసుగులోనుంచి మగనినేత్రాల్ని అవలోకించింది. కన్నీళ్ళు తుడుచుకుని, ఒక్కమాటకూడా అనకుండా అక్కడినుంచి వెళ్ళిపోయింది.

ఆ రాత్రి రాణీగారు రాజుతో అన్నది: "ఉదయుడికి అన్నిసంగతులు బోధించాలెండి. పాపం, వట్టి అమాయకపు పిల్లాడు. కాని చెబితే తెలుసుకోగలడు. ఇవాళ వాడికి కళ్ళు తెరువు ళ్ళయాయిలెండి."

## 6

విభాదేవి మ్లానవదనం చూస్తుంటే సురమ ఉండబట్ట లేకపోయింది. "విభా! ఒక్కసారైనా మనసులోనిమాట పైకి చెప్పవేమమ్మా! లో లోపల అలా ఇదైపోతున్నావు మరీను" అన్నది సురమాదేవి మరదల్ని ప్రేమగా కావిలించుకుని.

"ఏముంది వదినా చెప్పటానికి?" అన్నది విభ మెల్లిగా.

"నువ్వు మీ ఆయన్ను చూడక చాలరోజులైంది. అందు చేత మనస్సులో విచారంగా ఉండటం సహజమే. రమ్మని ఒక్క ఉత్తరం రాయకూడదూ? మీ అన్నయ్యగారితో చెప్పి వుత్తరం పంపించేయేర్పాటు నేను చేస్తాగా!"

రామచంద్రరాయ్ చంద్రద్వీపమునకు రాజు. అతడే విభాదేవిభర్త. విభాదేవి తలవంచుకునే ఇలా చెప్పసాగింది: "ఇక్కడ వారినెవరూ మర్యాదచేసేవారే లేనప్పుడు... వారిని ఇక్కడికి ఆహ్వానించవలసిన ఆవశ్యకతను ఎవరూ గుర్తించనప్పుడు... వారు రాకుండా వుండటమే మంచిది. ఆహ్వానం లేకండా వారిక్కడికి రాదలుచుకున్నప్పటికీ నేను వద్దనే చెబుతాను. వారుకూడా ఒక రాజు. గౌరవం జరగనిచోటుకు వారెందుకు రావాలి? దేంట్లో వారు మనకంటే తక్కువనీ? నాన్నగారికి వారిమీద ఎందుకంత చిన్నచూపు?" విభాదేవి తన్నుతాను నిగ్రహించుకోలేకపోయింది. ముఖంలో నెత్తురు చుక్క లేకండా అయిపోయింది. ఏడుపుకూడా వచ్చేసింది.

ఒకచేత్తో మరదలితల తనగుండెకు అదుముకుని, మరో చేత్తో ఆమెకన్నీళ్ళు తుడుస్తూ సురమాదేవి అడిగింది: "సరే గాని విభా! నువ్వే మగవాడివైతే ఏంచేస్తావు చెప్పు. పిలవకపోతేమాత్రం నువ్వు అత్తగారింటికి వెళ్ళవూ?"

"నా సంగతి వేరు. నేనే మగవాడినైతే తక్షణం బయలుదేరి వెళ్ళిపోతాను. అభిమానం - అవన్నీ ఏమాలోచించను. కాని ఆయన సంగతి అలా కాదుగా! పిలవని పేరంటంగా... ఇక్కడ అగౌరవ పడటానికీ అవమానపడటానికీ ఆయనెందుకు వస్తారు? ఎందుకురావాలి?"

విభాదేవి ఈ ధోరణిలో ఇదివరకెన్నడూ మాటాడ లేదు. ఇప్పుడు హృదయావేగం తట్టుకోలేక చెప్పేసింది. కాని లోలోపల సిగ్గుతో నలిగిపోతూనే ఉంది. 'ఇప్పటికే చాల మాటాడేశాను; అలా వాగెయ్యటం సముచితంగా లేదు '- అనుకుంది తనలో తాను. క్రమేణా భావోద్వేగం శాంతిం చింది. విషాదభారం వచ్చి మనస్సును కప్పేసింది. రెండు చేతుల్లో ముఖంవాల్చుకుని సురమాదేవివడిలో వాలిపోయింది. సురమాదేవి ఆమె సోగ వెంట్రుకలలో వేళ్ళు పోనిచ్చి మెల్లిగా నిమురుతూ కూచుంది. ఇలా చాలాసేపు గడచింది. ఇద్దరిలో ఎవరుగాని పెదవి విప్పి పలుకలేదు. విభాదేవి కన్నుల వెంట అశ్రుబిందువులు జారి వస్తూనే ఉన్నాయి. సురమ వాటిని మెల్లిగా పైటచెంగుతో అద్దుతూ ఉంది

ఇలా చాలాసేపు గడిచింది. సాయంత్రం కావచ్చింది. విభాదేవి మెల్లిగా లేచి కూచుంది. చీరకొంగుతో కన్నీళ్ళు తుడుచుకుంది. 'పసిపిల్లలా ప్రవర్తించానేమిటి?' అన్నట్టుగా ఒక చిన్న మందహాసం చేసింది. ముఖం తిప్పుకుంది. తప్పిం చుకు పారిపోవాలని ఉద్యుక్తురాలైంది. సురమ ఏమీ మాటా డలేదు. చేయిమాత్రం గట్టిగాపట్టుకుంది. "వదినా! తాతయ్య గారు వచ్చారటగా!" అన్నది విభాదేవి. గత సందర్భాన్ని తడవకండా. 'ఔను' అన్నది సురమ: "ఎప్పుడు? ఎప్పుడొ చ్చారూ?" పట్టుదలగా అడిగింది విభ.

"ఇందాకే, మూడుగంటలప్పుడు"

"ఇక్కడికి రాలేదేంమరి! ఇంతసేపయినా?" విభాదేవికి కొంచెం కోపం వచ్చినట్టు కనిపించింది. తాతగారిపై తనకున్న

అధికారం విషయమై ఆమె యెప్పుడూ పట్టుదలగా ఉంటుంది. ఒక పర్యాయం వసంతరాయ్ ఉదయాదిత్యునితో మాటా డుతూ చాలాసేపు గడిపాడు. అంతఃపురంలో విభాదేవి తాత గారి కోసం గంటలకొద్దీ ప్రతీక్షిస్తూ కూచోవలసి వచ్చింది. చివరకు తాతయ్య తన్ను వచ్చి కలవనే లేదు. కోపం రాదు మరి! ఆ తరువాత ఆమె చాలసేపటివరకూ బుద్ధమూర్తి పెట్టుకుని ఎవరితోనూ నవ్వుతూ పేలుతూ మాటాడనే లేదు.

ఇప్పుడు తాతయ్య వచ్చాడంటే తన్ను చూడ్డానికి ఎప్పుడు వస్తాడా అని మనసులో ఉత్కంఠగానే ఉంది విభా దేవికి, అనుకుంటూండగానే రానే వచ్చాడు తాతయ్య నవ్వుతూ పాడుతూ—

'దుర్బలకాయం మోచికొని
చూచిపోదమని వచ్చితిని—
చాలకాలమాయె, ఎప్పుడు
మీరే తలపుకు వస్తారూ.
మీ నగుమోములు చూస్తాను
తేనె పలుకులూ వింటాను
దేశాంతరమే పోతాను...'

గానంవింటూ విభాదేవి తల వంచుకొని నవ్వుకో సాగింది. ఇప్పుడామె కెంతో ఆనందమైంది. లోపలి ఈ ఆనందం ఎక్కడ బైటపడుతుందోనని ఆమెకు ఆందోళనగానూ ఉంది. కాని సురమాదేవి ఆమె చుబుకం పుచ్చుకుని ముఖం యెత్తిచూపిస్తూ "చూడండి–చూడండి తాతగారూ! నవ్వు పట్టలేక ఎలా వగలపడి పోతోందో పిల్ల!" అన్నది.

"గెలిచేసి నవ్వితేగాని ఈ ముసలివాడు వెళ్ళిపోడేమో ననుకుంది కామోలు! ఈ దయ్యంపిల్ల ఎత్తులు నాకు తెలుసు. నన్ను వచ్చినవాడిని వచ్చినట్టుగా వెళ్ళగొట్టెయ్యాలని దాని ఉద్దేశ్యం. అయినా నేను వెడతానా దబ్బున? వచ్చినవాడిని బాగా ఉడికెత్తెంచిమరీ వెడతాను... మళ్ళీ ఇంకోసారి నేను వచ్చేవరకూ జ్ఞాపకం వుండేలాగ."

సురమ నవ్వుతూ అన్నది."చూడండి తాతయ్యగారూ! విభ నా చెవిలో రహస్యంగా ఏం చెప్పిందో తెలుసా? 'ఇంత వరకూ ఉడికెత్తించిందేచాలు జ్ఞాపకం ఉండటానికి-ఇంకా ఉడికెత్తించ నవసరంలేదు' అంటోంది"

ఆ మాటతో వసంతరాయ్‌కి చాల ఆనందం కలిగింది. పకపకా నవ్వసాగాడు. విభ చాల సిగ్గుపడిపోయింది. "నేనలాగ అనలేదు. నేనేం అనలేదు" అన్నది.

"తాతయ్యగారూ! మీ కోరిక నెరవేరిందిగా! నవ్వు ముఖం చూడాలనుకున్నారు, చూచారు. తేనె పలుకులు వినాలనుకున్నారు; విన్నారు. ఇంకా ఆలస్యం ఎందుకూ? వెళ్ళండిమరి దేశాంతరం."అన్నది సురమ.

"ఉహుం. ఎలా వెడతానమ్మాయి! పదిపది హేను పాటలు, పండినతలమీద వెంట్రుకలు...ఇవి అన్నీ తెచ్చాను మరి! పూర్తిగా చెల్లించేసి ఋణవిముక్తి పత్రం పుచ్చుకునిగాని వెళ్ళను"

విభాదేవి పక్కున నవ్వింది. మీకు సగం తలమీద వెంట్రుకలే లేవుకదా తాతయ్యగారూ!"

అమ్మయ్య! తాతయ్యవన్నాగం ఫలించింది. చాల రోజులతరువాతవస్తే విభాదేవిచేత పెదవులువిప్పి మాట్లాడించవలెనంటే చాలానే కష్టపడాలి. కాని తాతయ్య సమక్షంలో ఆమె ఒకసారి పెదవులువిప్పి మాటాడిందంటే మళ్ళీ నోరు ఆపుచేయించటం చాలకష్టం. తాతయ్యగాక మరింకెవరి సమక్షంలోనూ ఆమెఅసలు నోరే విప్పదు. అదీ ఆమెతత్వం.

తాతయ్య తన బట్టతల తడువుకుంటూ "ఆ రోజులు పోయాయి దీదీరాణీ! ఒకప్పుడు వసంతరాయ్ తలమీద నల్ల కలువతోటలాగ జుట్టుఉండేది. అప్పుడు మిమ్మల్ని బుజ్జగించేందుకని ఇలా ఇంతదూరం శ్రమచేసి వచ్చేవాడినా? అప్పుడు నా తలమీద ఒక్కవెంట్రుక గనక తెల్లబడిందీ అంటే నీవంటి సుందరాంగులు ఐదారుగురు దాన్నితీసి అవతలపారేసేందుకు వంతులువేసుకుని వచ్చేవాళ్ళు. ఆ తొందరలో తెల్ల వెంట్రుక బదులు పది నల్లవెంట్రుకలు లాగిపారేసేవాళ్ళు" అన్నాడు.

"అయితే తాతయ్యగారూ! ఇప్పటికంటే మీరు ఆ రోజుల్లో చాల అందంగా ఉండేవారా?" కొంచెం గంభీర స్వరాన అడిగింది విభాదేవి.

అసలు ఈ విషయమై విభాదేవికి పెద్దసందేహమేఉంది. ఇప్పుడువున్న ఆ బట్టతల; మీసం, గడ్డంలేకండా ఆ పెదవులపై ప్రశాంతమైన చిరునవ్వు; పక్వానికివచ్చిన మామిడిపండులాంటి ముఖంలోని మధురభావం... ఈ అన్నింటినీ తన మనస్సులో మార్పులుచేసుకుంటూ ఆయనగారి పడుచుతనపురూపాన్ని ఊహించుకోటానికి ప్రయత్నించింది విభ. ఎంతప్రయత్నించినా ఆ కల్పితరూపం ఏమాత్రం బాగుండటంలేదు. తళతళమెరిసే

ఆ బట్టతలవుంటేనే తాతయ్యరూపు అందంగా వుంటుంది. మీసాలుపెట్టామంటే వికృతంగానే తయారౌతుంది. ఊహి స్తేనే నవ్వొచ్చేంత వికృతంగా తయారౌతుంది. తాతయ్యకు మీసాలా?

వసంతరాయ్ అన్నాడు: "ఆ విషయమై అభిప్రాయ భేదముంది. నా మనుమరాళ్ళు నా బట్టతలచూచే మోహపడు తున్నారు, వాళ్ళు నా కేశపాశం చూచివుండలేదు. నా దాదులు నాజుట్టు చూచి మోహపడేవాళ్ళు. వాళ్ళు నా యీ బట్టతల ఎరగరు. ఈ రెండూ చూచినవాళ్ళుమాత్రం ఇంతవరకూ ఒక స్థిరనిర్ణయానికి రాలేకుండా వున్నారు.

"కాని ఒకసంగతి వుంది తాతయ్యాగారు! మీ బట్ట తల ఇప్పు డున్నదానికన్నా అధికం అయిందంటే మాత్రం అందంగా వుండదు" అన్నది విభ.

"బట్టతల విషయం తరువాత చర్చిద్దాం గాని ... తాతయ్యగారు! మన విభాదేవి విషయంలో మీరొక ఉపా యం చెప్పాలి" అన్నది సురమ.

విభాదేవి మునుకుణమే కల్పించుకుని తాతయ్యకు చేరు వగా వెళ్ళి "తాతయ్యగారు! మీతలమీది తెల్ల వెండ్రుకలు ఏరి తీసివెయ్యనా?" అన్నది.

"నేననేది ఏమిటంటే—" సురమ తిరిగి ఆరంభించింది.

విభ అర్థోక్తిలో అడ్డువచ్చింది: "విన్నారా తాతయ్యా గారూ! నేను మీ..."

"నువ్వు మాటాటబోకు విభా! నేను చెప్పేదేమిటంటే తాతయ్యగారూ! మీరు స్వయంగా ఒకసారి వెళ్ళి..." అన్నది సురమ.

మళ్ళీ విభాదేవి అడ్డం తగిలింది: "ఓ తాతయ్యగారూ! మీ తలమీద అన్నీ తెల్ల వెంట్రుకలే తప్ప నల్లదాటూ లేనే లేదు. నేను పీకటం మొదలుపెడితే మొత్తమంతా బట్టతల అయిపోయేట్టుందే!"

"నువ్వు నన్ను మాటాడనిచ్చేట్టే లేదే దీదీరాణీ! హిందోళ్ రాగం ఆలాపించనా యేమిటి?" అంటూనే వసంతరాయ్ సితార్ అందుకుని చెవి మెలేసితిప్పటం ఆరంభించాడు. హిందోళ్ రాగమంటే విభాదేవికి మహా చెడ్డ అసహ్యం. ఆ పేరు వినటంతోనే చీత్కారంచేసి "అమ్మబాబోయ్! ఇక ఇక్కడ ఉండకూడదు; పారిపోవలసిందే" అంటూ వెంటనే బయటికి వెళ్ళిపోయింది.

సురమ గంభీరస్వరాన చెప్పసాగింది: "తాతయ్యగారూ! మన విభాదేవి రాత్రింబగళ్ళూ విచారంగానే కాలం వెళ్ళబుచ్చుతోంది. ఎవరితోనూ చెప్పదు, పెట్టదు. తనే లోలోపల బాధపడుతూ ఉంటుంది. ఆమె ఎంత కుమిలిపోతున్నదో తెలిస్తే మహారాజావారికైనా గుండె నీరై కరిగి తీరుతుందని నా ఉద్దేశం"

"ఏమిటేమిటీ? ఏమైందిపాపం దానికి!" అంటూ అసలు విషయమేమిటో తెలుసుకోవాలన్న శ్రద్ధతో సురమా చెవికి దగ్గరగా జరిగాడు.

"సంవత్సరం మొత్తంమీద ఒక్కరోజునైనా ఇంటి అల్లుడిని పిలుద్దాం – పెడదాం అన్న ఊహే రాదాయెను ఇంట్లో ఎవరికీ కూడా."

వసంతరాయ్ సాలోచనగా ముఖంపెట్టాడు. "ఔనమ్మాయి! అది మంచిపద్ధతి కాదు."

"తండ్రి చేసే ఇటువంటి అవజ్ఞతను ఆడపిల్లలూ సహిస్తారా? విభ చాల బుద్ధిమంతురాలు. ఎవరితోనూ ఏమీ చెప్పుకోదు. తనలో తానే కుమిలి కుమిలి ఏడుస్తూ ఉంది."

వసంతరాయ్ చాల వ్యాకులుడైనాడు: "కుమిలి కుమిలి ఏడుస్తోందా ?"

"ఔను. ఇవాళ మధ్యాహ్నం రెండుగంటలప్పటినుంచీ నా దగ్గర కూచుని పాపం కన్నీళ్ళు కారుస్తూనే ఉంది."

"విభకు, నా దీదీరాణికి కన్నీళ్ళా?"

"ఔను"

వసంతరాయ్ హృదయంలో చాల బాధపడ్డాడు "పిలు పిలు, నా తల్లిని ఇలా పిలు! వెళ్ళి తీసుకురా దాన్ని నా దగ్గరికి."

సురమ వెళ్ళి విభాదేవిని తీసుకువచ్చింది. వసంతరాయ్ ఆమె గడ్డంపుచ్చుకుని పుణుకుతూ "నువ్వు ఏడుస్తున్నావా తల్లీ! నీ కెప్పుడైనా ఏమి కష్టంవచ్చినా నీ తాతయ్యకు చెప్పుతల్లీ! నా చేతనైనంతవరకు నీకు సుఖం చేకూర్చి తీస్తాను. ఇదిగో, ఇప్పుడే వెళ్ళి ప్రతాప్‌తో మాటాడతానుండు."

"వద్దు – వద్దు. తాతయ్యగారూ! నీ పాదాలు పట్టుకుంటాను – నా విషయమై నాన్నగారితో ఏమీ చెప్పద్దు. మీ

పాదాలు పట్టుకుంటాను. తాతయ్యగారూ! వెళ్ళకండి మీ రక్కడికి."

కాని వసంతరాయ్ ఆగలేదు. తక్షణమే ప్రతాపాదిత్యుని దగ్గరకు వెళ్ళాడు. వెళ్ళి "నువ్వు చాల రోజులనుంచీ అల్లుడిని రమ్మని పిలవలేదు. అది అతనికి ఎంతో అవమానం కాదూ! యశోహరరాజుగారి అల్లుడంటే ఎంత సన్మానం, ఆదరం జరగాలో తెలుసునా? అటువంటి సముచిత గౌరవం అతనికి జరక్కపోతే నీకే అగౌరవం" అని కచ్చితంగా నొక్కి చెప్పాడు.

ప్రతాపాదిత్యుడు పెత్తండ్రి మాటకు ఏ విధమైన అభ్యంతరమూ చెప్పలేదు. వెంటనే ఒక దూతను రప్పించి అల్లుడికి ఆహ్వానపత్రం రాసి చంద్రద్వీపానికి ప్రయాణం చేసి పంపించాడు.

వసంతరాయ్ తిరిగి అంతఃపురం ప్రవేశించాడు. సురమా, విభ ఉన్నచోటికి సితార్ వాయిస్తూ తారసిల్లాడు. "మలినవదనమున గులాబి చిన్నెలు, మనోహరుడు తా చనుదెంచెన్"

విభ చాల సిగ్గుపడిపోయింది. "తాతయ్యగారూ! నా సంగతి పోయి నాన్నగారితో చెప్పకూడదూ! ఎందుకు చెప్పారు, చెప్పండి" వసంతరాయ్ పాటలో మునిగివున్నాడు:-

"మలినవదనమున గులాబిచిన్నెలు
మనోహరుడు తా చనుదెంచెన్
మనుమరాలి యానందము చూచి
తాత కనులు సంతృప్తి గనెన్."

విభాదేవి సితార్ తీగలమీద చేతులు అడ్డంపెట్టింది. "నా సంగతి నాన్నగారితో ఎందుకు చెప్పావు? అవి చెప్పండి నాకు ముందర!"

ఆ సమయాన ఉదయాదిత్యుని తమ్ముడు ఎనిమిదేళ్ళ వాడు – సమరాదిత్యుడతని పేరు – కిటికీలోనించి తొంగిచూస్తూ "చూశాలే అక్కయ్యా! తాతగారూ నువ్వూ గుడుగుడు లాడుతున్నారుకదూ! అమ్మతో చెబుతానుండు" అన్నాడు.

"దా–దా–అబ్బాయి. ఇలా నా దగ్గరకొకసారి రా" అంటూ వసంతరాయ్ లేచి వెళ్ళి కుర్రవాడిని పట్టుకుని లోపలికి తీసుకువచ్చాడు.

వసంతరాయ్, సురమాదేవీ ఇద్దరూ కలిసి ఉదయాదిత్యుని అధోగతికి తీసుకుపోతున్నారు–అని ఒకభావం రాజపరివారంలో అందరిలోనూ వ్యాపించిపోయింది. అందుచేత వసంతరాయ్ వచ్చాడూ అంటేసరి అందరూ ముఖావంగా, ఒళ్ళంతా చెవులుగా మసలుతూ ఉంటారు. సమరాదిత్యుడు తాతగారి చేతుల్లోనించి తప్పించుకు పారిపోదామని పెనగులాడుతూనే ఉన్నాడు. వసంతరాయ్ తన సితార్ వాడిచేతిలో పెట్టాడు. తన కళ్ళజోడుతీసి వాడికి తగిలించాడు. భుజంమీద ఎక్కించుకుని తిప్పాడు. ఇలా రెండునిమిషాల్లో వశంచేసుకున్నాడు వాడిని. ఇక ఆ రోజల్లా వాడు తాతయ్యవెనకాలే తిరిగాడు సితార్ వాయించుకుంటూ; తీగలన్నీ తెగ్గొట్టి పెట్టాడు; వేళ్ళకు తగిలించుకునే తీగగోళ్ళు కాజేసి మళ్ళీ ఇవ్వనేలేదు.

# 7

రామచంద్రరాయ్ చంద్రద్వీపానికిరాజు. రాజ ప్రాసాదంలో ఒకగదిలో సుఖాసీనుడైయున్నాడు. అదొక అష్టకోణమందిరం. పైన పాదరసపు బుడ్లు వేలాడుతూ చాందినీ వుంది. గోడలకు చిన్నచిన్న అందమైన గూళ్ళు ఉన్నాయి. వాటిలో వినాయకుడు, శ్రీకృష్ణుడు మొదలైన దేవతా విగ్రహాలు అమర్చి ఉన్నాయి. నేలంతా తివాచీ పరచివుంది. మధ్యన మెత్త, బాలీసు ఉన్నాయి. మెత్తమీాద బాలీసు ఆనుకుని రాజుకూచున్నాడు. చాందినీ నాలుగువైపులా జాలర్లు వేలాడుతున్నవి. గోడలకు పెద్దపెద్ద అద్దాలు వేలాడుతున్నవి. వాటిల్లో చూచుకుంటే ముఖం సరిగా కనిపించదు. రాజుకు చుట్టూ మానవాకృతి దర్పణాలు ఉన్నాయి. కాని వాటిలో ఆయనకు తన నిజస్వరూపం కన్పించదు. వాస్తవంగా ఉన్న దానికన్నా పెద్దరూపం కనిపిస్తూ ఉంటుంది. రాజుకు ఎడమ వైపున పెద్దహుక్కాగొట్టం ఉంది. మంత్రి హరిశంకర్ కూచుని వున్నాడు. కుడివైపున రమేశభట్టు, కళ్ళజోడుధరించి సేనాపతి ఫర్నాండిస్ ఉన్నారు.

"ఏం? రమేశభట్టూ!" అన్నాడు రాజు.

"చిత్తం ప్రభూ!"

పకపకానవ్వాడు రాజు. రాజుకన్నా ఎక్కువగా నవ్వాడు మంత్రి. కడుపుబ్బేలాగ పగలబడి నవ్వాడు ఫర్నాండిస్. ఉల్లాసంతో కన్నులు తళతళ మెరిసిపోతూాయి

రమేశభట్టుకు. రమేశభట్టు పలికే ప్రతిమాటకూ నవ్వకపోతే రసికత కాదని రాజుగారి అభిప్రాయం. రాజు నవ్వితే తాను కూడా నవ్వటమే కర్తవ్యంగా మంత్రి భావిస్తాడు. అంతా నవ్వుతూన్నప్పుడు తానూ నవ్వవలసిందే ననుకుంటాడు ఫర్నాండీస్. తనమాటలకు ఎవరైతే నవ్వరో ఆ అభాగ్యుడిని రమేశభట్టు నానాయేడుపులు ఏడిపించి వొదిలిపెడతాడు. అందుకనిగాని, లేకపోతే మాంధాతకాలంనాటి అతగాడి హాస్యరసానికి నవ్వే దెవరు? భయంపడీ, కర్తవ్యమనుకునీ అంతా నవ్వుతూ ఉంటారు—రాజుదగ్గరినించి చౌకీదారువరకూ అందరూ అదేవరస.

"ఏమిటి కబుర్లు?" రాజుగారి ప్రశ్న.

తన రసికత చూపించవలసిన అవసరం వచ్చిందను కున్నాడు రమేశభట్టు. అన్నాడు వెంటనే "ఆనోట ఆనోట చెప్పుకుంటూంటే విన్నాను; మన సేనాపతిగారింట్లో రోజూ దొంగలు పడుతున్నారట."

ఫర్నాండిస్ గుండెలో రాయిపడ్డది. తనమీాద ఒక కథ కల్పితం కాబోతున్నదని తెలుసుకున్నాడు. రమేశభట్టు హాస్యానికి ఫర్నాండిస్ ఎంతభయపడుతూ వుంటాడో అంతగా అతన్నే ఏడిపిస్తూ ఉంటాడు ఇక రాజుగారి సంతోషానికి పట్టపగ్గాలు వుండవు. రమేశభట్టు వచ్చాడంటే సరి ఫర్నాండిస్ నుకూడా కబురుచేసి పిలిపిస్తాడు రాజు. ఆయ నకు రెండే రెండు సరదాలు ఉన్నాయి. పొట్టేళ్ళ పోట్లాట చూడ్డం; రమేశభట్టుముందు ఫర్నాండిస్ ను నిలబెట్టటం. రాజ సంస్థానంలో ఉద్యోగానికి కుదురుకున్నతర్వాత ఫర్నాండిస్ కు

వొంటిమీద తుపాకిగుండుగాని, బాణంగాని గుచ్చుకున్నదిలేదు. అస్తమానం రమేశభట్టు పరిహాసానికిమాత్రం గురిపోతూ చాలానే డస్సిపోయాడుపాపం—పాఠకులు క్షమించాలి. రమేశ భట్టు హాస్యాలన్నీ ఇక్కడ ఉల్లేఖించడం పడదు. సభ్యత పాటించి చాలవరకు విడిచిపెట్టక తప్పదు.

"ఊం. అయితే?" అన్నాడురాజు కళ్ళతో నవ్వుతూ.

"చెబుతాను వుండండి మహారాజా!" అన్నాడు రమేశభట్టు.

ఫర్నాండిస్ కోటు బొత్తాములు విప్పుతూ, మళ్ళీ పెట్టుకుంటూ కూచున్నాడు.

రమేశభట్టు ఆరంభించాడు; "ఈ మధ్య మూడు నాలుగు రోజులనుంచీ మన సేనాపతిగారింట్లో దొంగలు పడు తూనే ఉన్నారు. భార్యకు తెలిసి పాపం ఆయనన్న తట్టి, కొట్టి లేపేది లేపితేమాత్రం అయ్యగారికి కళ్ళు తెరుపుస్తే పడితేనా!"

"హాహా హా హా" అంటూ రాజు'
"హోహో హో హో" అంటూ మంత్రి,
"హి – హి" అంటూ సేనాపతి.

మళ్ళీ రమేశభట్టు ధోరణి: "పగటిపూట అమ్మగారి మందలింపులు, చీవాట్లు తిని తిని అయ్యగారు చేతులు జోడించి 'నీకు పుణ్యం ఉంటుంది గాని ఊరుకో ఇవాళ రాత్రి, ఆ దొంగల్ని తప్పకుండా పట్టేస్తాగా?' అన్నాడు. అర్ధరాత్ర ప్పుడు దొంగవాడు రానే వచ్చాడు. 'ఏమండోయ్ – వింటు న్నారా! దొంగ దూరాడండీ' అంటూ లేపింది భార్య.

అప్పుడు మన అయ్యగారు 'ఊం - ఇంట్లో దీపం వెలుగు తూనే ఉందిగా! ఈ వెలుగులో వాడికి మనం కనిపించకుండా ఎలా ఉంటాం? కనిపించగానే వాడే పారిపోతాడు. ఉంటాడా?' అంటూ దొంగవాడిని పిలిచి 'ఒరేయ్ నువ్వు ఇవ్వాళ బ్రతికి పోయావులేరా! ఇంట్లో దీపం వెలుగుతోందిలే. చటుక్కున పారిపోగలవు. కాని రేపు మళ్ళీరా. అప్పుడు చూస్తాను నీపని. రేపు దీపం ఉంచం చీకట్లో ఎలా పారిపోతావో చూస్తాను. రేపు నిన్ను పట్టుకోకపోయానంటే నన్ను మారు పేరున పిలు.' అన్నాడు."

ఇదివరకులాగానే రాజు నవ్వాడు, మంత్రి నవ్వాడు, సేనాపతీ నవ్వాడు.

"ఊం - తరువాత?" హెచ్చరించాడు మళ్ళీ రాజు.

ఇప్పటికీ రాజుకు బాగా తృప్తికలుగలేదని రమేశభట్టు గుర్తించాడు. మళ్ళీ ఆరంభించాడు: "దొంగవాడికేమాత్రం బెదురు కలిగినట్టులేదు. ఎందుచేతనో మరి! మర్నాడు అర్థ రాత్రపుడు మళ్ళీ వచ్చాడు. 'ఏమండోయ్, కొంప గుండమై పోతోంది, లేవరేం?' అంటూ గొడవచేసింది భార్య. 'నువ్వు లేవరాదూ!' అన్నాడు మన సేనాపతి మహాశయుడు. 'నేను లేచి ఏం చేయగలను?' అన్నదావిడ. 'లేచి దీపం వెలిగించు. కళ్ళు కనిపించని చీకటిలో నేను మాత్రం ఏం చేస్తాను?' అని అయ్యగారి జవాబు. అమ్మగారు చివాట్లకు లంకించుకుంది. అయ్యగారికి కోపం వచ్చింది. 'నీ మూలాన్నే కొంప గుండం అయిపోతుంది ఇవాళ. లేవవేం? లేచి దీపం వెలిగించు. నా తుపాకి ఇలా పట్టుకురా!' 'అన్నాడు. ఇంతలో ఆ దొంగ తన

పని అంతా కానిచ్చుకుని 'బాబయ్యా' కాస్త పుగాకో, తను చిలుముగొట్టం యిప్పిస్తారూ! చాల శ్రమపడిపోయాను. అలసట తీర్చుకుంటాను' అన్నాడు. అప్పుడు సేనాపతి మహాశయుడు కోపం తెచ్చుకుని 'ఆగవోయ్ ఆగు. చిలుముగొట్టం ఇస్తా ఉండు. హాయిగా కూచుని పీలుద్దువుగాని. కాని ఒక సంగతి గుర్తుంచుకో. నా దగ్గరకు వచ్చావంటే తుపాకి పేల్చి నీ తల ఎగరగొట్టేస్తాను. తెలిసిందా?' అన్నాడు. చిలుము గొట్టం వెలిగించి, పీల్చి ఆ దొంగవాడు 'బాబూజీ! కాస్త దీపం వెలిగించారంటే చాల ఉపకారం చేసిన వారౌతారు. కన్నం వెయ్యటానికి గడ్డపలుగు కనిపించటంలేదు' అన్నాడు. అప్పుడు మన అయ్యగారికి బాగా భయం పుట్టింది కామాలు 'ఏయ్, దూరంగా ఉండుసుమీ! నా దగ్గరికి వచ్చావంటే జాగ్రత్త!' అని గర్జిస్తూ దీపం వెలిగించాడు. దొంగవాడు తీరిగ్గా అన్నీ మూట గట్టుకుని దారిపట్టాడు. "చూచావా, భయపడి యెలా పారిపోయాడో వెధవ!' అన్నాడు సేనాపతి మహాశయుడు సగర్వంగా భార్యతో. మళ్ళీ హాయిగా పడుకుని నిద్రపోయాడు." రాజు, మంత్రి పొట్టచెక్కలయ్యేటట్టు నవ్వారు. ఫర్నాండీస్ కూడా హా-హీ అంటూ నవ్వుతున్నట్టు నటిస్తూనే ఉన్నాడు.

"నీకు తెలిసిందా రమేశభట్టూ! నేను అత్తగారింటికి వెడుతున్నాను" అన్నాడు రాజు.

"అసారం ఖలు సంసారం, సారం శ్వశుర మందిరం" అంటూ నవ్వాడు రమేశభట్టు. రాజు పక్కున నవ్వాడు-మంత్రి నవ్వాడు. సేనాపతీ నవ్వాడు. రమేశభట్టు ఒక పెద్ద నిట్టూర్పు

విడుస్తూ "ఆ మాట పదహారణాలా సత్యమే. అత్తగారింట్లో అంతా సారమే, ఆదరసత్కారాలు, భోజనాదికాలు, పెరుగు, పాలు, మీగడ, హల్వా, పూరీ, లడ్డూ, అన్నీ సారం గ్రక్కుతూ ఉంటాయి. ఇకపోతే నిస్సారమైనవస్తువు ఒక్క భార్య. అంతే–" అన్నాడు.

"అలాగంటావేం రమేశ్! నీ అర్ధాంగి మరి..."

రమేశ్ భట్టు చేతులు రెండూ జోడిస్తూ "ఆవిడను అర్ధాంగి అనకండి మహాప్రభూ! ఇంకా మూడు నాలుగు జన్మలెత్తి బాగా తపస్సుచేస్తే బహుశా ఆమెకు అర్ధాంగుడను కాగలుగుతానేమో. ప్రస్తుతానికి మాత్రం నావంటివాళ్ళను అయిదుగురిని కట్టగాకట్టినా ఆవిడకున్న కాయంలో సగానికైనా సరిపోలను." అని పలికేసరికి రాజు, మంత్రి, సేనాపతి మామూలు వరుసప్రకారం నవ్వారు. మాటలోని రసం అందరూ గ్రహించారు. ఒక్క మంత్రికే సరిగా అవగాహనకాలేదు. అందుచేత ఆయన అందరికన్నా ఎక్కువగా నవ్వాడు.

"మీ ఆవిడ చాల శాంతస్వభావంగల మనిషి అనీ, శ్రద్ధగా నేర్పుగా ఇంటివ్యవహారాలు చేసుకుంటూ వుంటుందనీ విన్నానే" అన్నాడు రాజు రమేశభట్టును ఉద్దేశించి.

"ఏం చెప్పమంటారు మహారాజా! అందరికీ, ఇల్లు, వాకిలి, సంసారం మోజుగానే ఉంటుంది, ఒక్క నాకు తప్ప. నా కర్మంగాలి తెల్లవారేసరికి నామీదికి చీపురుపుచ్చుకుని వెంటబడుతుంది; నేను పరుగెత్తుకుంటూవచ్చి ఇక్కడ మీ సమక్షంలో దాక్కుంటూ ఉంటాను."

ఇక్కడ కొంచెం రమేశభట్టు భార్యనుగురించి రెండు వాక్యాలుచెప్పటం అవసరం. ఆమె పాపం చాల బక్కగా, సన్నగా ఉంటుంది. రోజురోజుకూ బక్కచిక్కిపోతూ ఉన్నది. భర్తృగృహానికివచ్చినప్పటినించీ క్షణంతీరిక, విశ్రాంతిలేకుండా ఉన్నదామెకు. శాంతిలేదు. ఎందువల్లనంటే – రమేశభట్టు రాజసభలో ఏరకంగా నవ్వుతూ పేలుతూఉంటాడో, ఇంటి దగ్గర అలావుండడు. రుసరుసలాడుతూ తిట్టిపోస్తూ ధూంధాం లాడుతూవుంటాడు. ఆమెనుగురించిన వాస్తవికవిషయాలు చెబితే హాస్యరసంకాదు, కరుణరసం చిందుతుంది. అందుచేత రమేశభట్టు రాజసభలో ఆమె స్థూలకాయురాలనీ, గయ్యాళి గంప అనీ వర్ణిస్తూ ఉంటాడు. తత్ఫలితంగా హాస్యరసతరంగాలు వెల్లివిరుస్తూ ఉంటాయి.

"విన్నావా రమేశ్ భాయీ! నువ్వు నాతోకూడా బయలుదేరిరావాలి. మన సేనాపతికూడా వస్తాడు" అన్నాడు రాజు.

తనమీద ఇంకోదెబ్బ విసురుతాడు రమేశభట్టు – అను కున్నాడు సేనాపతి. ముక్కుమీద కళ్ళజోడు సర్దుకున్నాడు. కోటు బొత్తాములు విప్పుతూ, మళ్ళీ పెట్టుకుంటూ సిద్ధంగా ఉన్నాడు.

"ఉత్సవమూ, ఆనందమూ తొణికిసలాడే రంగాల్లో మన సేనాపతి సముల్లాసంగానే వస్తానంటాడు. యుద్ధరంగం కాదుగా!" అంటూ ఒక విసురు విసిరాడు రమేశభట్టు.

మళ్ళీ ఇంకో హాస్యరస తుంగ తరంగం రాబోతున్న దని రాజు, మంత్రి గమనించారు. దానికోసంగాను "అలాగా!

ఏం? ఎందుకనీ?" అంటూ పుల్లలు ఎగసం తోశారు. రమేశ భట్టు ధోరణి సాగించాడు—

"మన సేనాపతి మహాశయునికి రాత్రింబగళ్ళు కంటికి జోడు అతుక్కుపోయి వుండవలసిందే. నిద్రపోతున్నా సరే-కళ్ళజోడు తీసివేశాడంటే స్వప్నం చూచేదెలాగ? వారు యుద్ధరంగంలోకి నిరాఘాటంగానే వెడతారు. ఒక్కటే భయం పాపం! అందుమూలాన్నే వెళ్ళరు. వెడితే తుపాకిగుండువచ్చి కళ్ళజోడుకి తగిలి అద్దాలు ఎక్కడ పగిలిపోతాయోనని వారి భీతాహం. అవి పగిలితే లోకమంతా అంధకారమేగా! ... అంతేకదూ మహాశయా!"

"ఔనౌను కాకపోతేయేమిటిమరి!" అన్నాడు ఫర్నాండిస్ గుడ్లు తేలవేస్తూ. మరుక్షణమే రాజువైపుతిరిగి, కూచున్న చోటునుంచి లేచి "మహారాజా! తమరు సెలవిప్పిస్తే..." అన్నాడు.

"ఔను నువు వెళ్ళి మన ప్రయాణానికి అన్నీ సిద్ధం చేయించు. ముందర హంసముఖం, పక్కన నంది మువ్వలు గల మన నావను తయారుగా ఉంచమని చెప్పండి" అన్నాడు రామచంద్రరాయ్.

మంత్రి, సేనాపతి వెళ్ళిపోయారు.

"రమేశ్ భాయీ! నీకు అంతా తెలిసిందేకదా! నిరుడు వెళ్ళినప్పుడు అత్తగారింటో నాకు చాలా పరాభవమే జరిగింది."

"ఔనౌను. మహారాజును కోతినిలా ఆడించేశారు."

ఆ మాటకు రాజు పైకైతే నవ్వాడు. కాని హృదయం మేఘాచ్ఛాదితమే అయింది. అత్తగారింట తనకు జరిగిన పరాభవం విషయం ఒక్క రమేశభట్టుకు మాత్రమే తెలుసు. మరింకెవ్వరికీ, తెలియదు. అయినా రాజు మనస్సుకు శాంతి లేకుండా వుంది. ఇతర్లకు తెలియడం వేరు; రమేశ్ భట్టుకు తెలియటమనేది వేరు. ఆ సంగతి రాజుకు బాగా తెలుసు. గుడగుడా హుక్కా పీలుస్తూ కూర్చున్నాడు.

"ఆనాడు మీ బావమరది వరస ఔతాడు కామాలు ఒకాయన వచ్చి నాతో 'చూచావా' మీ రాజుగారికి అంతఃపురంలో తోక బైటకివచ్చేసింది. ఆయన మరి రామచంద్రుడో, రామదాసో నాకు అర్థం కావటంలేదు' అన్నాడు. నేను తక్షణమే చక్కని జవాబు చెప్పేశాను: 'మా రాజుగారు పూర్వం ఇలా కాదు మరి. మీ సంబంధం చేసుకున్న తరువాతనే ఇలా మారారు. దేశం ఎలాటిదో వేషభాషలు కూడా అలాగే వుండాలి కదా అన్న ఉద్దేశంతో స్టైలు ఫిరాయించారు కామాలు' అని!"

ఆ మాటవిని రాజు చాల సంతోషించాడు. అటువంటి సమాధానం చెప్పగలిగిన రమేశభట్టు వల్లనే తన గౌరవప్రతిష్ఠలు నిల్చాయక్కడ. తన ప్రతిభ ఉజ్జ్వలంగానే ఉండింది. ప్రతాపాదిత్యుని ఆదిత్యుడు రాహుగ్రస్తుడైనాడు. ఇన్నాళ్ళనించీ తన కప్పుడు అత్తగారింట్లో జరిగిన పరాభవం తలుచుకుంటూ రాత్రింబగళ్ళు విచారంగా ఉండేవాడు. అది తలచుకున్నప్పుడల్లా సిగ్గు ముంచుకువచ్చేది. భూమి బీటలువారి పగిలిపోతే తానందులో దూకి అంతర్హితుడై పోవాలనిపిస్తూ ఉండేది. కాని

ఇప్పుడు తన సేనాపతి రమేశ్‌భట్టు యుద్ధంలో గెల్చి, విజయం
తెచ్చాడని వినేసరికి కాస్త మనస్సు కుదుటపడింది. అయినా
మనస్సులోనించి గ్లాని పూర్తిగా పోలేదు. "రమేశ్ భాయీ!
ఈసారి మనంవాళ్ళను పూర్తిగా ఓడించిరావాలిసుమీ!
సంపూర్ణవిజయం పొంది తిరిగి వచ్చావంటే నీకీ ఉంగరం
బహుమతి ఇచ్చేస్తాను."

"మహారాజా! మీకేం విచారం అక్కర్లేదు. విజయం
మనకి కాకపోతే ఇంకెవరికి? ఏవిధంగానైనా సరే నన్నుకూడా
అంతఃపురంలోకి తీసుకెళ్ళారంటే చాలు ... మీ అత్తగార్ని
కూడా ఎగతాళిపాలుచేసి ... పరిపూర్ణవిజయం సాధించమూ?
ఏమనుకున్నారేమిటి?"

"ఏం పరవాలేదు. నిన్ను తప్పకుండా అంతఃపురంలోకి
తీసుకుపోతాను ఎలాగైనాసరే."

"మీరు చెయ్యలేనిదేముంది మహారాజా!"

రాజుకుకూడా అదే నమ్మకం. తనేం చెయ్యలేడుగనక!
ఆశ్రితుడెవడేనాసరే 'మహారాజుగారూ, సేవకునికోరిక నెర
వేరాలి' అని పలికాడంటే... వెంటనే రామచంద్రమహారాజ
'తథాస్తు' అనేస్తాడు... మహారాజు చెయ్యజాలని పని అంటూ
ఒక్కటి ఉంటుందని అనుకోకూడదు. ఎలాగైనాసరే రమేశ్
భట్టును ప్రతాపాదిత్యుని అతఃపురంలోకి తీసుకువెళ్ళాలిసిందే.
శ్వశ్రుమహారాణికి రమేశ్‌భట్టు వాగ్బాణాలరుచి చూపించవల
సిందే. అని వెంటనే నిర్ణయించుకున్నాడు రాజు. అంత మహా
త్కార్యం చెయ్యలేకపోతే తానూ ఒక రాజనిపించుకో
గలడా?... వెంటనే రామమోహన్‌కు కబురుచేశాడు. రామ

మోహనుడు భీముడంత పరాక్రమంగల మనిషి. మంచి అజానుబాహువు. శరీరం కండలు దేలి బలిష్ఠంగా వుంటుంది. మనిషినిచూస్తేనే భయంవేస్తుంది. చనిపోయిన పెద్దరాజాగారి కాలంవాడు. రామచంద్రుని అతడు చిన్నప్పుడు ఎత్తుకొని మోశాడు; ఆడించాడు. అందరికీ రమేశభట్టు అంటే భయం. అటువంటి రమేశభట్టుకు రామమోహనుడంటే హడల్. రమేశ భట్టంటే రామమోహనునికి అసహ్యం. అతడు తనవేపు చూస్తు న్నాడంటే సరి రమేశభట్టు తలవంచుకుని సంకుచితుడై పోతాడు. అతని పప్పులేమీ రామమోహనుడి దగ్గర ఉడకవు.

వచ్చాడు రామమోహన్ దర్బారులోకి. అతన్ని చూడ్డంతోనే "నేను అత్తగారింటికి వెడుతున్నాను. నాతో పాటు పాతికమంది నౌకర్లుకూడా వస్తున్నారు. వాళ్ళందరిమీద నువు సర్దారువు, ఏం?" అన్నాడు రాజు.

"చిత్తం – అలాగే మహారాజా! రమేశభట్టుగారుకూడా వస్తున్నారా?"

ఆ మాట వింటూంటేనే రమేశభట్టుకు వొళ్ళంతా భయంతో గడ్డగట్టినట్టయింది.

# 8

యశోహర మహారాజు భవనంలో ఉద్యోగులు, పని వాళ్ళు తీరుబాటు లేకండా ఉన్నారు. అల్లుడుగారు రాబోతు న్నారని ఆయా యేర్పాట్లన్నీ జోరుగా సాగుతున్నాయి. తమ వంశంతో పోల్చిచూస్తే చంద్రద్వీపరాజ వంశం చాల నికృ ష్టమైనదేనన్న విషయంలో ప్రతాపాదిత్యునికీ, రాణీగారికీ

అభిప్రాయభేదమేమీ లేదు. అయినా అల్లుడు వస్తున్నాడనే సరికి రాణిగారికే ఎక్కువ సంతోషంగా ఉంది. ఉదయంనించీ కూడా విభాదేవికి ముస్తాబు చేయటంతోనే సరిపోయిందామెకునే విభాదేవికి చాలానే అలసట ఐంది. ఎందువల్లనంటే — ఏ చీర సింగారించాలి, ఏ నగలు అలంకరించుకోవాలి అను విషయమై ప్రౌఢవయస్కురాలైన తల్లికి, తరుణవయస్కురాలైన కూతురికీ పొత్తు కుదరకండా వచ్చింది. అభిప్రాయభేదాలు వచ్చాయి. ఇద్దరి అభిరుచుల్లో తేడా ఉంది. ఉంటేనేం? మంచి, మేలు ఎందులో వుందో పిల్లకన్న తల్లికే ఎక్కువ తెలుస్తుంది. పసిమి వన్నె కులుకుతూన్న తన చేతులకు మూడేసి సన్నని చాక్లెట్ రంగు గాజులు పెట్టుకుంటే అందంగా వుంటుందని విభాదేవి ఉద్దేశం. కాని ఎనిమిదేసి మందపాటి బంగారు గాజులు తెచ్చి తొడిగింది తల్లి. మెడలో రత్నాలపేర్లు వేసింది. వెడల్పాటి పట్టెడ పెట్టింది. చేయవలసిన అలంకారమంతా చేసి, తనలో తాను పొంగిపోతూ, ఇంకా అంతఃపురంలోని పరిచారికలను, వృద్ధవనితలను, ఇతర అమ్మలక్కలను పిలిపించి చూపించింది. అతిసుకుమారకోమలమైన తన ముఖానికి బులాకి ఏమాత్రమూ అందంగా వుండదని విభాదేవికి తెలుసు. కాని రాణి ఒక పెద్ద బులాకి తెచ్చి ఆమెకు తగిలించింది. ఒకసారి కుడివైపుకు, మరొకసారి ఎడమవైపుకు ఒరిగి తలవంచి కూతురి ముఖసౌందర్యాన్ని సగర్వంగా పరికించింది. ఏం చేసినా విభాదేవి కిమ్మన లేదు. కాని తల వెంట్రుకలను తల్లి ముడిచిన తీరుమాత్రం పరమాసహ్యంగా తోచింది. ఎవరికీ చెప్పకండా సురమాదేవి వద్దకు పోయి తనకు నచ్చిన తీరులో ముడిపించుకుని వచ్చింది.

రాణి చూచింది. ఆ తల ముడిచిన తీరువల్లనే మిగతా ముస్తా బంతా మట్టిపాలైందని కేకలు వేసింది. తన కూతురు అందం చూచి సహించలేక సురమ అలా పాడుచేసిపెట్టిందని మండి పడ్డది. సురమాదేవి బుద్ధి మంచిదికాదనీ, ఆమెకు ఓర్వలేని తనం బాగా ఉందనీ కూతురికి నచ్చజెప్పసాగింది. చాలాసేపటి వరకూ చీవాట్లు, మందలింపులు అయ్యాక...ఆ వేయించుకు వచ్చిన ముడి విప్పించి మళ్ళీ దువ్వి తన యిష్టానుసారం కేశ బంధనం ముగించింది. ఈ విధంగా బులాకి, మందపాటి పసిడి గాజులు, వడ్డాణ... ఈ నగలబరువుతోపాటు, హృదయంలోని ఆనందపు బరువుకూడా కలిసి...విభాదేవి చాలానే అలసి పోయింది. హృదయంలోని ఆనంద తరంగాల్ని హృదయం లోనే దాచియుంచుకోవటం తనకు చేతకావటంలేదు. అవి ముఖంలోనుంచి, కళ్ళలోనించి క్రొక్కారు మెరుగు తీగలవలె బయలువెడలుతూనే ఉన్నాయి. ఇంట్లో గోడలదగ్గరనుంచీ కూడా తన్ను పరిహాసిస్తున్నట్లుగా ఉంది విభాదేవికి. యువ రాజు ఉదయాదిత్యుడు వచ్చి చెల్లెలిలినిచూచాడు. గంభీరమైన సౌఖ్యము, ప్రశాంతమైన ఆనందము తొణికిపోతున్న దామె ముఖంలో. చూచి చాల ఆనందమైంది అతనికి – వెంటనే సురమాదేవి దగ్గరకు వెళ్ళాడు. ప్రేమలొలుకుతున్న చిరు నవ్వుతో సమీపించి ఆమె లలాటం ముద్దు పెట్టుకున్నాడు.

"ఏమిటి కథ?" అన్నదామె.

"ఏం లేదు." అన్నాడు ఉదయాదిత్యుడు.

ఈ లోగా వసంతరాయ్ విభాదేవిని పట్టుకుని బలవం తాన గదిలోకి తీసుకువచ్చాడు. ఆమెగడ్డం పుచ్చుకుని పుణు

తుతూ ఉదయాదిత్యునితో ఇలా చెప్పసాగాడు: "మన దీదీ రాణీముఖం ఎలావుందో చూచావా ఇవాళ, దాదాభాయి! సుగమా! ఓ సురమా! ఒక్కసారి చూచిపోదువుగాని దబ్బున రా!"– తాతయ్య ఆనందానికి పారంలేకుండా ఉంది. విభాదేవి ముఖంలోకి ఆప్యాయంగా అవలోకిస్తూ గద్గదకంఠాన ఇలా అన్నాడు: "ఇంత ఆనందం లోలోపల పొంగులు వారుతోంది. కిలకిలానవ్వావేం? ఏదీ, కానీ–నేనూ కాస్త చూస్తాను" అంటూ నవ్వి మళ్ళీ అన్నాడు: "వయసు దాటిపోయింది, లేకపోతేనా, ముఖంచూచి అలా ప్రాణం విడిచిపెట్టేవాడిని. అయ్యయ్యో, చచ్చిపోదగిన వయసుకూడా దాటిపోతూనేవుంది. యౌవ్వన కాలంలో గడియగడియకూ చనిపోగలం. ఈ ముసలితనంలో రోగం లేకుండా చచ్చిపోవటమే పెద్ద అదృష్టం కాజాలదు."

ప్రతాపాదిత్యుని దగ్గరకు బావమరది వచ్చి అడిగాడు: "అల్లుడిగారికి స్వాగతంచెప్పి తీసుకురావటానికి ఎవరేనా వెళ్ళారామరి?"

"నాకేం తెలుసు?"

"ఇవాళ వీధుల్లో తోరణాలంకారాలూ, దీపమాలికలు ఉంటాయికదూ!"

"ఉండాలని ఆజ్ఞాపించినట్టేం లేదే!" అన్నాడు ప్రతిపాదిత్యుడు పత్తికాయల్లా గుడ్లుపెట్టి చూస్తూ.

ఆ జవాబుకు బావమరిది చాల చిన్నపుచ్చుకున్నాడు. "నౌబత్ వాయింపిస్తారా?"

"ఆ సంగతులన్నీ ఆలోచించేందుకు నా కిక్కడ తీరిక లేదు. మేళతాళాలతో అల్లుడిని ఇంటికి తీసుకురావటం ప్రతాపాదిత్యుని పని కాదు."

రామచంద్రరాయ్‌కి బాగా అసహ్యం వేసింది. బుద్ధిపూర్వకంగా తన్ను వాళ్ళు అవమానించదలచినట్టు భావించాడు. ఇదివరకు ఒకటిరెండుసార్లు ఇంకా రెండు మూడు గ్రామాల ఇవతలే వచ్చి స్వాగతంచెప్పి తీసుకుపోయారు. ఈ సారి పూర్తిగా ఊళ్లో రేవుదగ్గర దిగినతరువాతనే దివాన్‌జీ కనిపించాడు. రామచంద్రరాయ్‌కి స్వాగతం చెప్పేందుకు దివాన్‌జీతో కూడా రెండువందల యాభైమంది జనంవచ్చారు. అదేం కర్మం. ఇంత యశోహర్‌పట్నంలో ఇంకో పాతికమంది దొరక్కపోయారు? అల్లుడిగారిని ఎక్కించుకుపోవటానికి ఒక ఏనుగువచ్చింది. రమేశభట్టుభాషలో అది చాల స్థూలకాయం గలది. దివాన్‌జీయే దానికంటే పెద్దగా కనిపిస్తాడు. "మహాశయా! ఇది మీకు తమ్ముడులా ఉందే?" అన్నాడు రమేశభట్టు దివాన్‌జీ ముఖంమీదే.

పెద్దమనిషి దివాన్‌జీ పాపం! ఆ ప్రశ్నకు ఆశ్చర్యపోతూ "కాదండీ! అది ఏనుగు?" అని సమాధానంచెప్పాడు.

రాజు కడుపులో తొక్కులాటగానే ఉంది. 'మీ మంత్రిగారు ఎక్కే ఏనుగు దీనికన్నా పెద్దదేనా?"

"పెద్ద ఏనుగు ఉందిగాని...దాన్ని ఒకానొక పనిమీద గ్రామాంతరం పంపించాం. అంతేగాని వేరే కారణమేంలేదండీ".

రాజాధిరాజు రామచంద్రదరాయ్ ముఖం రోషంతో కందగడ్డ అయిపోయింది. "మీ ప్రతాపాదిత్యునికి నేనెందులో తీసిపోతాననీ మీ అభిప్రాయం?"

"వయసులోనూ, బాంధవ్యంలోనూ - మరింకెందులో? ఆయనకూతురిని మీరు వివాహం చేసుకున్నారు. అందు చేతనే—" అన్నాడు రమేశభట్టు కల్పించుకుని.

రామమోహన్ అక్కడేవున్నాడు. ఇక సహించలేక పోయాడు. అతనికి చాల కోపంవచ్చింది. "ఇలాచూడు రమేశ భట్టూ! నువు హద్దుమీరి మాటాడేస్తున్నావు. మన మహా రాణీగారివిషయమై నువు అంత తేలిగ్గా ఎప్పుడూ మాటాడకు సుమా - చెబుతున్నాను. జాగ్రత!" అన్నాడు.

ప్రతాపాదిత్యుని దృష్టిలోపెట్టుకుని రమేశభట్టు ఇలా చెప్పసాగాడు :"చాలమందినిచూచాం ఇటువంటి ఆదిత్యుల్ని. మీకు తెలుసుగా మహారాజా! ఆదిత్యుడిని చంకలో యిరికించుకుని నలిపివేయగలిగిన వ్యక్తి ఎవరూ? రామచంద్రుని సేవకుడు."

రాజు మందహాసం చేశాడు. రామమోహన్ మెల్లిగా వినయపూర్వకంగా అడుగులు వేసుకుంటూ రాజుదగ్గరకు వచ్చాడు: "మహారాజా! ఈ బ్రాహ్మణుడు మీ మామయ్య గారిని గురించి నోటికివచ్చినట్లల్లా వాగటం నేనుమాత్ర సహించ లేకుండా ఉన్నాను."

"రామమోహన్! నీ కెందుకు? నువు మాటాడబోకు, వెళ్ళిపో." అన్నాడు రాజు.

రామమోహన్ వెంటనే అచ్చోటు వీడి వెళ్ళిపోయాడు.

రామచంద్రరాయ్ యెంత ఆలోచించినా అతనికి ఒక్క-టేవిషయం విస్పష్టంగా స్ఫురిస్తూ ఉన్నది. నిజంగా తన్ను అవమానించేందుకే ప్రతాపాదిత్యుడు ఏం జేసినా చేస్తున్నాడు- అని. ఆత్మాభిమానం దెబ్బతిన్నట్టయింది. లోలోపల నుండిపో య్యాడు. చివరకు ఒక స్థిరనిర్ణయానికి వచ్చాడు: ప్రతాపాది త్యుని సముఖంలో ఒకరకంగా ఠీవిగా, గాంభీర్యంగా తాను నిలవాలి? ప్రతాపాదిత్యునికన్నా తా నెంతగొప్పవా డైందీ అతనికి స్ఫురించేటట్టుగా మెలగాలి.

ప్రతాపాదిత్యుని కలుసుకోవటానికి వెళ్ళాడు రామచం ద్రరాయ్. అప్పుడు ప్రతాపాదిత్యుడు సింహాసనాసీనుడై మంత్రితో ఏమో ప్రసంగిస్తున్నాడు. మామగారిని చూడ్డం తోనే అల్లుడు వినమిత శిరస్కు-డై నమస్కా-రం చేశాడు.

ప్రతాపాదిత్యుడు ఏ విధమైన సముల్లాసంగాని, వ్యస్త భావంగాని కనబరచలేదు. "రా - కూచో, కులాసాగా ఉన్నావా?" అన్నాడు మామూలు శాంతస్వరాన.

"చిత్తం" - మృదుస్వరాన రామచంద్రరాయ్ జవాబు.

ప్రతాపాదిత్యుడు మంత్రివైపు తిరిగాడు. " 'భాంగామాఢీ' పరగణా తాశీల్దారుమీద నేరారోపణ చేస్తూ ఏదో అర్జీవచ్చింది కదూ! దానివిషయమై విచారణజరిపించారా మరి!"

మంత్రి పొడుగాటి కాగితం ఒకటితీసి రాజుకు అందిం చాడు. ఆయన దాన్ని చదువుకుంటూ కూచున్నాడు. కొంత సేపు అయాక అల్లుడివైపు తిరిగి "నియుడులాగ ఈ సంవత్సరం మీకు వరదబాధ లేదనుకుంటాను" అన్నాడు.

"లేదండి - భాద్రపదమాసంలో నదికి నీరైతేవచ్చింది-"

ప్రతాపాదిత్యుడు మంత్రివైపు తిరిగి – "మంత్రిజీ! ఈ అర్జీకి నకలు రాయించి అట్టిపెట్టివుంచు." అని పలికి తిరిగి అది చదువుకోటంలో పడ్డాడు. అంతా చదవటం అయిపో యాక అల్లుడివైపుతిరిగి "వెళ్ళు అంతఃపురంలోకి" అన్నాడు.

రామచంద్రరాయ్ మెల్లిగాలేచి వెళ్ళిపోయాడు. ఇప్పు డర్థమైంది అతనికి: తనకన్నా ప్రతాపాదిత్యుడు ఏ అంశంలో అధికుడో

# 9

"దొరసానమ్మగారూ! మీ దర్శనం చేసుకుపోదామని వచ్చాను" అన్నాడు రాముమోహన్ అంతఃపురంలోకి వెళ్ళి విభాదేవికి ప్రణామం చేసి.

విభాదేవికి చాల సంతోషం అయింది. ఆమెకు రామ మోహనుడంటే చాల అపేక్ష. చుట్టాలపనులు, స్నేహితుల పనులు మీదవేసుకుని రాముమోహన్ చంద్రద్వీపంనించి యశోహర్ పట్నానికి వస్తూనేఉంటాడు తరచు. అప్పుడప్పుడు అవకాశం దొరకతేసరి ... పనిపాటలేం లేకపోయినీ ... కేవలం విభాదేవిని చూదిపోదామనే వస్తూఉంటాడుకూడా. రాముమోహన్ ముందు మాటాడేందు కామె భయపడను. ఘోషా పాటించదు. వృద్ధుడు, ఆజానుబాహు, బలిష్ఠుడు రాముమోహన్ తనసమక్షంలోకివచ్చి "దొరసానమ్మగారూ!" అని పిల్చేసరికి ఆమెలో ఒక విశుద్ధ–సరళ – అలంకారశూన్య– స్నేహభావము తరళితమై తానొక పసిబాలికవలె అయిపో

తుంది. "ఇన్నాళ్ళనించీ నువు రావటమే మానేశావేం? మోహన్" అన్నది విభ.

"అమ్మా! కొడుకు చెడ్డవాడైపోతే అయిపోవచ్చు. కాని తల్లి ఎప్పుడూ చెడ్డదనిపించుకోదు. మీరు మాత్రం నన్నెప్పుడు కబురుచేశారమ్మా చెప్పండి! మా అమ్మ కబురు చేసి పిలిస్తేనేగాని వెళ్ళకూడదు - అని నిశ్చయం చేసుకున్నాను. యెన్నాళ్ళదాకా నాకు కబురు చెయ్యకుండా ఉంటుందో చూడా లనుకున్నాను. ఈ కొడుకును ఒక్కసారైనా తలచుకున్నారు కాదు కదమ్మా మీరైనా!"

విభాదేవి అసమంజసమైన పరిస్థితిలోనే పడింది. నిజానికి ఒక్కసారికూడా తానతన్ని పిలువనంపలేదు. ఎందుకనీ? ఏమో! తనకే తెలీదు. కబురు చెయ్యనంతమాత్రాన తానతన్ని మరచి పోయిందా? లేదు - లేదు. ప్రస్తుతం ఏం జవాబు చెప్పటానికీ ఆమెకు స్ఫురించలేదు. ఆమె అవస్థను రామమోహన్ కనిపెట్టాడు. నవ్వుతూ అన్నాడు: "అది కాదమ్మా దొరసాని గారూ! సెలవు దొరికిందికాదు. అందుచేతే రాలేకపోయాను."

"నువు కూచోవేం? కూచో. మీవూరి కబుర్లన్నీ చెప్పు."

రామమోహన్ కూచున్నాడు. చంద్రద్వీపం, దాని శోభ వర్ణించటం మొదలుపెట్టాడు. చెంపన చెయిపెట్టుకుని విభాదేవి చాల శ్రద్ధగా విన్నది. చంద్రద్వీపవర్ణన వింటూంటే ఆమె చిన్న హృదయంలో ఎటువంటి ఊహాలు, భావాలు చిగిరించాయో! మనోవీథిలో ఎన్నెన్ని ఆకాశసౌధాలు నిర్మించుకుందో! ... ఆ తరువాత లోగడ సంవత్సరం చంద్ర

ద్వీపంలో ఎంతో నష్టం కలిగించిన వరదలు గురించి వర్ణించాడు రామమోహన్. 'నా యిల్లు, వాకిలి అన్నీ కొట్టుకు పోయాయి. సామ్రాంతం అయిపోయింది. నా ముసలితల్లిని వీపుమీద వేసుకుని వరదలో ఈదుకుంటూపోయి మందిర శిఖరంమీదికెక్కి కూచున్నాం. అక్కడే ఇద్దరం ఆరాత్రి గడిపాం' అని అతడు చెబుతూంటే ఆమె హృదయం తప తప కొట్టుకు లాడింది; శరీరమంతా కంపించిపోయింది.

అంతా చెప్పాక రామమోహన్ "దొరసానమ్మగారూ! నేను మీ కోసంగాను నాలుగు శంఖపు గాజులు తెచ్చాను. అవి మీరు ధరించాలి; నేను చూడాలి" అన్నాడు.

విభాదేవి నాలుగు బంగారపుగాజులు తీసి వేసి, రామ మోహన్ ఇచ్చిన నాలుగు శంఖపుగాజులు తొడుక్కుంది. నవ్వుతూ తల్లివద్దకు వెళ్ళి "అమ్మా! నువు తొడిగిన బంగారు గాజులు తీసివేసి రామమోహన్ ఈ శంఖపుగాజులు తొడుక్కో మన్నాడు" అని చూపించింది. రాణీగారికి ఏమాత్రం కోపం గాని, అసంతృప్తిగాని కలగలేదు. నవ్వింది, అంతే "మంచిదే, అవి చేతికి చాల అందంగానే ఉన్నాయమ్మా!" అన్నది.

రామమోహనుడికి ఉత్సాహం, ఆనందం కలిగాయి. రాణి అతన్ని లోపలికి పిలిపించింది. తనచేతిమీదిగా అవీ ఇవీ ఫలహారాలు తినిపించింది. అతడు అన్నీ కడుపునిండా తిన్నాడు. రాణిగారిముఖంలో సంతృప్తి తాండవించింది "ఏదీ! ఆ పాట! నువు పాడుతుంటావే! కాస్త వినిపించు మోహన్!" అన్నది. రామమోహన్ విభాదేవిని చూస్తూ పాటపాడాడు. పాడు

తోంటే అతనికన్నుల్లో అశ్రువులు తిరిగాయి. రాణీకూడా కూతురిముఖంచూస్తూ కన్నీళ్ళు ఒత్తుకుంది.

సాయంత్రం అయింది. పుగస్త్రీలు గుంపులుగుంపులుగా రాసాగారు. ఇరుగుపొరుగు వారంతా అల్లుడినిచూద్దామనీ, బంధుత్వాన్నిపాటించి సరసాలు, వేళాకోళాలు ఆనందించి పోదామనీ వచ్చారు. ఆనందం, లజ్జ, ఆశంక, ఏమో, ఏమి కానున్నదో అన్న ఒకభావం, విభాదేవిహృదయంలో సందడింపసాగాయి. ముఖం పాలిపోయింది; కాళ్ళుచేతులు చల్లబడ్డాయి. అదంతా సుఖమో, కష్టమో, ఎవరు చెప్పగలరు?

అల్లుడుగారువచ్చారు అంతఃపురంలోకి. రానటనే తలుపు వాయి. రమణీమణులంతా తేళ్ళు, కందిరీగల్లా చుట్టూ మూగారు. పరిహాసకాల రణరంగం ఆరంభమైంది. ఎకచకలు, పకపకలు—చాల కోలాహలంగా పరిణమించింది. కోకిలకంఠాలు పరిహాసవాక్యాలు విసిరాయి; మృణాలబాహువుల తాడనలు ప్రయోగాయి; చంద్రఖండాలవంటి నఖాలు గిచ్చాయి. రామచంద్రరాయ్‌స్థితి చాల దయనీయంగా తయారైంది. అప్పుడు వచ్చిందక్కడికి కొక ప్రౌఢయువతి. వచ్చి రాజును ఆదుకుంది. ఆవిడ తన కర్కశకంఠస్వరాన అవాకులు, చవాకులు ప్రేలింది. ఆవిడ మాటల్లోని కటుత్వం, రసహీనతచూచి వచ్చిన రమణీమణులనోళ్ళకు తాళంపడిపోయింది. సవితాదేవి ఓడిపోయింది. విమలాదేవి అక్కడినించి లేచిపోయింది. ఎవరో ఒక్కతే మాత్రం మాటకుమాట అప్పగిస్తూ చాలసేపు వాదించింది. చివరకు అందరూ చల్లగా జారుకున్నారు. అమ్మయ్య! రామచంద్రరాయ్‌కి కాస్త విశ్రాంతి చేకూరింది.

అంతట ఆ ప్రౌఢయువతి అక్కడినించి లేచి రాణీగారి దగ్గరకు వెళ్ళింది. ఆ సమయాన రాణి నౌకర్లకు, పరిచారికలకూ భోజనాలు వడ్డిస్తోంది. రామమోహన్ కూడా ఒక మూల కూచుని భోజనం చేస్తున్నాడు. ప్రౌఢయువతి రాణిదగ్గరకు వచ్చింది; ఆమెను ఎగాదిగా చూచింది. "ఓహో, తమరేనా అండీ నికషాజనని!" అంటూ ఒక వాగ్బాణం విడిచింది. నికషాజనని అంటే రావణాసురుని తల్లి అన్నమాట. రామమోహన్ ఆ నిందావాక్యం విన్నాడు. ఉలికిపడ్డాడు మొదట. వజ్రయువతిముఖంలోకి పరీక్షగా చూచాడు. మరుక్షణమే విస్తరిముందునుంచి లేచాడు. పెద్దపులిలా వెళ్ళిపడ్డాడు ఆవిడమీద. వజ్రసదృశాలైన తన రెండుపిడికిళ్ళతో ఆవిడభుజాలు రెండూ కరచిపట్టి "నేను నిన్ను గుర్తుపట్టలేదనుకున్నావా? రమేశభట్టూ" అంటూ ఆవిడతలమీది వస్త్రం తీసిపారేశాడు. నిజంగా రమేశభట్టే! క్రోధావేశంతో కంపించిపోతున్నాడు రామమోహన్. పైనున్న ఉత్తరీయంతీసి అవతల పారేశాడు. అమాంతం రమేశభట్టును రెండుచేతులతో అవలీలగా ఎత్తి, ఆకాశంలో గిర్రున తిప్పుతూ "ఇవాళ నాచేతుల్లో నీవు చచ్చావన్నమాటే" అంటున్నాడు ఆవేశంగా. రాణి గాభరాపడుతూ అక్కడికి పరుగెత్తుకు వచ్చింది – "అదేమిటి రామమోహన్! అలాంటిపనా?" అంటూ. "నీకు పుణ్యంవుంటుందిలే బాబూ! బ్రాహ్మణుడిని చంపబోకు" అని మొత్తుకున్నాడు రమేశభట్టు. అంతఃపురమంతా గోడనైపోయింది. రామమోహన్ రమేశభట్టును నేలమీదపడేసి "దౌర్భాగ్యపు బ్రాహ్మణుడా! చచ్చి

పోవటానికి నీ కింకెక్కడా చోటు దొరక్కపోయిందా?"
అన్నాడు.

"నన్నేం చెయ్యమంటావు? మహారాజాగారి ఆజ్ఞ పాలించనక్కర్లేదా?" అన్నాడు రమేశభట్టు.

"ఏమిటి? మళ్ళీ ఆ మాట అన్నావంటే నాలుక పీకేస్తాను. జాగ్రత!" అని గుడ్లురజేసి, పళ్ళుకొరుకుతూ పలికి, ముందుకుదూకి అతని గొంతు పట్టుకున్నాడు. రమేశభట్టు గొల్లుమన్నాడు. రామమోహన్ అతన్ని ఒక దుప్పటిలో మూటలా కట్టుకుని అంతఃపురంలోనించి బైటికి తీసుకుపోయాడు.

చూస్తూండగానే ఈ సమాచారమంతా నలువైపులా ప్రాకిపోయింది. రాత్రి పన్నెండు దాటివుంటుంది. బావమరది రమాపతి వచ్చి ప్రతాపాదిత్యునికి కబురు చెప్పాడు. అల్లుడుగారు రమేశభట్టుకు స్త్రీవేషం వేసి అంతఃపురంలోకి తీసుకువెళ్ళాడు – అని; అక్కడ అతను ఊరిముత్తయిదులతో పరియాచకాల్లో పాల్గొన్నాడు – అని; అంతేకాదు, మహారాణీనికూడా వ్యంగ్యవాక్యాలు విసరి పరిహాసించేందుకు సాహసించాడు – అని. ఆ మాటలు వింటూంటేనే ప్రతాపాదిత్యుని ముఖం భయంకరంగా మారిపోయింది. క్రోధావేశంతో అతని శరీరమంతా కంపించింది. కేసరాలు పులకించి లేచిన కేసరివలె ప్రతాపాదిత్యుడు పక్కమీదినించి లేచాడు. "పిలు, లక్ష్మణసర్దార్‌ను" అని గర్జించాడు. లక్ష్మణసర్దార్ రావటంతోనే "ఇవాళరాత్రే మొండెంనించి వేరైన రామచంద్రరాయ్ తల నేను చూడాలి" అన్నాడు రాజు.

"చిత్తం మహారాజా!" అన్నాడు సర్దార్ సలాం చేస్తూ.

మరుక్షణమే రమాపతి బావగారి కాళ్ళమీద పడ్డాడు'

"క్షమించండి మహారాజా! మన విభాదేవిని చూచైనా కాస్త శాంతించండి మహారాజా! మీరలా ఆగ్రహిస్తే ఆమె గతేం కావాలి?" అంటూ.

"ఈ రాత్రికే రామచంద్రరాయ్ తలకాయ తీసుకువచ్చి నాకు చూపించవలసిందే" అన్నాడు నిక్కచ్చిగా ప్రతాపాదిత్యుడు.

రమాపతి బావగారిపాదాలు విడిచిపెట్టలేదు. కాళ్ళా, వేళ్ళాపడుతూ ఇంకా బతిమాలాడు: "మహారాజా! ఇవాళ అతడు అంతఃపురంలో నిద్రిస్తున్నాడు పాపం! క్షమించండి మహారాజా! క్షమించండి"

ప్రతాపాదిత్యుడు కాసేపు స్తబ్ధచిత్తుడై సాలోచనగా వున్నట్టు కనిపించాడు. చివరకన్నాడు: "ఇదిగో లక్ష్మన్! రేపు ఉదయం రామచంద్రరాయ్ అంతఃపురంలోనించి బైటికి వచ్చాడనగానే అతన్ని కడదేర్చిపారేయవలసిందే. ఆబాధ్యత నీది - తెలిసిందా?"

రమాపతి చాల ఖిన్నుడైనాడు. వ్యవహారం ఇంతగా ముదురుతుందని అతడనుకోలేదు. అనుకున్నదానికంటే మిక్కిలిగా విషమించింది. అప్పటికప్పుడే విభాదేవి గదిదగ్గరకుపోయి తలుపుకొట్టాడు.

ఆ సమయాన దూరంనించి రెండోద్వారందగ్గర నౌబత్ మోగుతూవినిపించింది. ఆనీరవనిస్తబ్ధనిశాసమయాన ఆనౌబత్ మ్రోత, దక్షిణానిలం నిద్రితప్రపంచానికి సుఖస్వప్నాల్ని

కల్పిస్తున్నవి. విభాదేవిగదిలో కిటికీలన్నీ తెరచేవున్నాయి. వాటిల్లోనించి వెన్నెలకాంతులు వచ్చి పక్కమీద పడు తున్నాయి. రామచంద్రరాయ్ మాత్రం పడుకొని గాఢంగా నిద్రపోతున్నాడు. విభాదేవి పట్టెమీద, చెంపకు చెయ్యిపెట్టు కుని ఏమాలోచిస్తూకూచున్నదో మరి! వెన్నెల్లోకి తదేకంగా చూస్తోంది. కన్నుల్లోనించి అశ్రులు ప్రవహిస్తున్నవి. ఆమె ఆశలన్నీ కూలిపోయాయా? లోపలనించి ఆమెప్రాణం రోదిస్తోంది. తాను ఎన్నాళ్ళుగానో ప్రతీక్షిస్తున్నరోజు ఇనాళ్టికి వచ్చింది. కాని...

రామచంద్రరాయ్ పక్కమీద పడుకున్నాడు. నిద్ర పట్టించుకున్నాడు. విభాదేవితో ఒక్కమాటకూడా మాటాడ లేదు. ప్రతాపాదిత్యుడు తన్ను అవమానించాడు. అందుకు ప్రతీకారం తా నేవిధంగా చూపించాలి? విభాదేవిపట్ల అవజ్ఞ చూపటమే ఆమె తండ్రియెడల తానుచేయగల ప్రతీకారం. 'నువు యశోహరరాజైన ప్రతిపాదిత్యుని కుమారివి. చంద్ర ద్వీపాధిపతి రామచంద్రరాయ్ ప్రక్కన నువ్వెలాగ శోభించ గలవు?' అని ఆవిడ మొఖంమీద అనాలని అతని ఉద్దేశం. ఇటువంటి తలపులతో ఆమెవైపు వీపుపెట్టి పడుకున్నాడు; నిద్రపోయాడు. మళ్ళీ ఇటు వైపంటూ తిరగనేలేదు. విభాదేవి అలాగే ఆలోచిస్తూ కూచుంది. ఒకసారి బైట వెన్నెలకేసి చూస్తోంది; మళ్ళీ ఇక్కడ పడుకున్న భర్తవైపు చూస్తోంది. ఏదో అంతర్వేదనతో గుండె కంపించిపోతున్నది. మాటిమాటికీ ఆమె నిట్టూర్పులు విడుస్తూ ఉన్నది. ఇంతలో రామచంద్ర రాయ్కి మెలకువవచ్చింది. విభాదేవి అలా మౌనంగాకూచుని

ఏడుస్తూఉండటం చూశాడు. అప్పుడే బాగా నిద్రపోయి లేచాడేమో,... అవమానం, ప్రతీకారం అనేవి వెంటనే గుర్తుకు రాలేదు. అవి విస్మృతిలో పడిపోయాయి గాఢ నిద్రానంతరం సహజంగా స్వాస్థ్యం భాసించింది రోషమనేది చిన్నముక్క కూడా లేకుండాపోయింది. సుకుమారసుందరమైన విభావరి ముఖం కన్నీళ్ళతో తడిసివుండటం చూసేటికి, అతనికి జాలి కలిగింది. మృదువుగా ఆమె చెయ్యిపుచ్చుకుని "విభా! నువ్వు ఏడుస్తున్నావేమిటి?" అని అడిగాడు. ఆమె వ్యాకులపడిపోయింది. నోటివెంట ఒక్కమాటకూడా రాలేదు. ఆమెను చుట్టూ చీకటి క్రమ్మినట్టనిపించింది. అలాగే క్రమానుగా కూచుండిపోయింది. రామచంద్రరాయ్ లేచికూచున్నాడు. ఆమెను పొదువుకుని వొడిలో కూచోబెట్టుకున్నాడు. ఉత్తరీయపు కొంగుతో ఆమె కన్నీళ్ళు తుడిచాడు.

సరిగ్గా ఆ సమయాన బైట ఎవరో తలుపుకొడుతూన్న చప్పుడు వినిపించింది. "ఎవరదీ?" అన్నాడు రామచంద్రరాయ్ గాభరాపడుతూ. "దబ్బున తలుపుతీయండి" అని బైటి నించి జవాబు.

## 10

రామచంద్రరాయ్ తలుపుతీసి బైటికివచ్చాడు. రమాపతి గాభరాపడుతూ "కుమారబాబూ! మీరు వెంటనే ఇక్కడ ఉండకండా పారిపోండి. ఆలస్యం చెయ్యొద్దు. తొందరగా..." అన్నాడు.

అర్ధరాత్రి సమయాన అటువంటి మాటలు వింటూంటే రామచంద్రరాయ్‌కి గుండె తటతట కొట్టుకోసాగింది. ముఖమంతా పాలిపోయింది. నెత్తురుచుక్క లేదు "ఏం? ఏం? ఎందుకూ? ఏం జరిగింది?" అన గలిగాడు అతికష్టంమీద.

ఏం జరిగిందో నే నిప్పుడు చెప్పలేను. మీరుమాత్రం వెంటనే ఇక్కడినించి పారిపోయే యేర్పాటుచూచుకోండి."

"ఏమిటి మామా!" అంటూ విభాదేవికూడా బైటికి వచ్చింది.

"నువ్వు వినవలసినమాట కాదులే అమ్మాయి!"

విభాదేవి ప్రాణాల్లో ఆక్రందనం! వెంటనే తాతయ్య తలుపుకొచ్చాడు; ఆ తరువాత ఉదయాదిత్యుడు. "అసలు ఏం జరిగిందో చెప్పు మామయ్యా!"

రమాపతి ఆమెమాటకు సమాధానం చెప్పకండా రామచంద్రరాయ్‌వైపు తిరిగి "నాయనా! అనవసరంగా ఆలస్యం చేస్తున్నావోయి తండ్రీ! వెంటనే ఎవరికీ తెలియకండా దాటిపోయే ఏర్పాటు చూచుకో" అన్నాడు.

ఏమి అశుభమో! ఏమిఆపదో! విభాదేవిహృదయం భయంతో గిలగిల కొట్టుకోసాగింది. వెళ్ళిపోబోతున్న మామయ్యకు అడ్డుతగిలి "నీకాళ్ళుపట్టుకుంటానుమామయ్యా! అసలుసంగతేమిటో చెప్పి పో" అంటూ బ్రతిమాలింది.

రమాపతి భయం భయంగా నాలుగువైపులా చూచాడు: "ఊరికే అఘాయిత్యం చెయ్యకు విభా! నేను అంతా చెబుతా నుండు"

రమాపతి సర్వంచెప్పాడు. అంతా విని గొల్లుమనబోయింది విభ. రమాపతి ఆమెను ఏడవనీకుండా నోరుమూస్తూ "ఊరుకో విభా! అల్లరిచేశావంటేమాత్రం వ్యవహారం పూర్తిగా చెడిపోతుంది. జాగ్రత!" అన్నాడు.

విభాదేవి నోరునొక్కుకుని నేలమీద కూలబడ్డది.

"ఇప్పుడు నా కేమిటి ఉపాయం? ఎలా పారిపోను? ఎటుపారిపోను? నా కేం తెలియదే!" అన్నాడు రామచంద్రరాయ్ భయపడుతూ.

"ఇవాళ రాత్రి అన్నిద్వారాలదగ్గరా పహారావాళ్ళు నిద్రపోరు. అప్రమత్తులైవుంటారు. నేను నాలుగువైపులా తిరిగి ఒకసారి చూచివస్తాను - దారి తెన్ను కనిపిస్తుందేమో!" అంటూ పోబోతున్న మామయ్యకు అడ్డంగా జరిగి విభాదేవి "మామయ్యా! నువుకూడా వెళ్ళిపోతావా? వెళ్ళబోకు. నువు మా దగ్గరే ఉండు" అన్నది.

"విభా! నీ కేమన్నా పిచ్చా! నే నిక్కడే పడివుంటే ఎలాగ? ఏదైనా ఉపాయం చూడద్దూ మరి! అలాపోయి, నాలుగుమూలలా చూచి సందేమైనా దొరుకుతుందేమో చూచివస్తాను మరి!"

విభ చాలకష్టంమీద లేచి నిల్చుంది. చేతులు కాళ్ళు వణికిపోతున్నవి. "నువు ఇక్కడే కొంచెంసేపు ఉండు మామయ్యా! నేను అన్నయ్యదగ్గరకు ఒకసారి వెళ్ళివస్తాను." అంటూ గబగబా వెళ్ళిపోయింది.

చంద్రుడు అస్తమించబోతున్నాడు. నాలుగువైపులా చీకట్లు క్రమ్ముకొస్తున్నాయి. అంతా నిశ్శబ్దంగావుంది కోటంతా

వరణం. రామచంద్రరాయ్ తన పడకగది గుమ్మంముందు నిల్చుని చూస్తున్నాడు. అంతఃపురంలో ఇటువైపుగా శ్రేణిగా వున్న గదులన్నీ తలుపులు మూసేవున్నవి. ఎక్కడివాళ్ళక్కడ నిశ్చింతగా నిద్రపోతున్నారు. ముందు ప్రాంగణంలో గోడల నీడలు పడుతున్నాయి. ఒక్కవైపునించిమాత్రం కాస్తవెన్నెల ప్రసరిస్తూఉంది. మరి కాసేపటికి అదికూడా విలుప్తంఅయింది. ఒకొక్క అడుగే వేసుకుంటూ వచ్చి చీకటితల్లి జగత్తునంతా కౌగిలిలో పొదువుకుంది. రామచంద్రరాయ్ సాలోచనగా నిల్చునివున్నాడు. నలువైపులా దట్టంగా కమ్ముకుంటూన్న ఈ కారుచీకటిలో ఎక్కడదాగివుంది తనకోసం ప్రతీక్షిస్తూ ఒక కత్తి? ఎవడికి తెలుసు? లోపల, గదిలోనే ఓ మూల దాగి వున్నదేమో! ఇలాంటి ఆలోచనలతో అతనిశరీరమంతా వణికిపోతోంది. నుదుటిమీద చెమటబిందువులు ధారలు కడుతున్నాయి. ఈ మామయ్య (తనకు బాబాయి వరుస ఔతాడు)... ఈయనలోనే ఉందేమో మోసం అంతా! ఇతడే ఏంచెయ్యనున్నాడో! మెల్లిగా ఒక అడుగు వెనక్కు వేశాడు రామచంద్రరాయ్. ఇంతలో ఒక గాలితెర లోపలికి వచ్చింది. గదిలో దీపం ఆరిపోయింది. లోపలే ఎవడేనా దాగి వున్నాడేమో కొంపదీసి. రఘుపతికి దగ్గరగావచ్చాడు.! “బాబాయిగారూ” అని పిలుస్తూ.

“ఏమిటి కుమారబాబూ!,,

ఈ సమయంలో విభాదేవి దగ్గరవుంటే బాగుండిపోనే - అనుకున్నాడు రామచంద్రరాయ్. బాబాయిమీద అతనికేమాత్రం విశ్వాసం లేకుండాఉంది.

విభ ఉదయాదిత్యుని దగ్గరకు వెళ్ళింది. కుప్పకూలి ఏడుపు సాగించింది. ఆమె నోటివెంట ఒక్కమాటకూడా బైటికి రాలేదు. సురమ వచ్చి లేవదీసి సరిగా కూచోబెట్టింది. "ఏమిటి విభా! ఏమైంది?"

విభ మాటాడలేదు. వదినగారిని కావిలించుకుని భోరున ఏడవసాగింది. ఉదయాదిత్యుడు ఆమె తల నిమురుతూ "ఏమిటి విభా! ఎందుకూ? ఏమైందీ?" అని ప్రేమగా అడిగాడు.

విభ ఉదయాదిత్యుని చేతులు పుచ్చుకుని "నువ్వు అక్కడికి రా అన్నయ్యా! అంతా తెలుస్తుంది" అని మాత్రం పలికింది అతి కష్టంమీద.

ముగ్గురూ విభాదేవి పడకగది దగ్గరకు వచ్చారు. చీకటిలో కూచునివున్నాడు రామచంద్రరాయ్. చేరువనే రమాపతి నిల్చునివున్నాడు. "ఏమిటిదంతా మామయ్యా! ఏం జరిగింది?" అన్నాడు ఉదయాదిత్యుడు.

విషయమంతా చెప్పాడు రమాపతి. ఉదయాదిత్యుని కన్ను చెరడంతలుగా విప్పారి భార్యతో అన్నాడు :"సురమా! నేనిప్పుడే నాన్నగారి దగ్గరకు వెడతాను. ఇలాంటి పని నేను జరగనీను - ఉహుఁ.ఒక్కనాటికీ జరగనీను"

"మీ నాన్నగారి దగ్గరకు మీరు వెడితేమాత్రం ఏం ప్రయోజనం? అంతకన్నా తాతయ్యగార్ని పంపించండి. ఏమన్నా లాభం ఉంటే ఉండవచ్చు" అన్నది సురమ.

"ఔనౌను - నిజమే"

వసంతరాయ్ అప్పుడు మంచి గాఢ నిద్రలో ఉన్నాడు. అయినా లేచాడు. లేవగానే ఎదుట ఉదయాదిత్యుడు కనిపిం

చాడు. తెల్లవారింది కామాలనుకున్నాడు సితార్ అందుకుని భైరవి రాగం ఆలాపించేందుకు ఉద్యుక్తుడైనాడు. సితార్ మెల్లిగా చేతుల్లోనించి లాక్కుంటూ "తాతయ్యగారూ! శృతి తప్పిపోయింది వ్యవహారం! పెద్ద ఆపద! ఎలాగ?" అన్నాడు.

ఆ మాట వింటూనే సితార్ పట్టుకున్న వేళ్ళు సళ్ళిచ్చాయి. గాభరాపడుతూ "ఏం? ఏమైందీ? ఆపదేమిటీ?" అన్నాడు.

ఉదయాదిత్యుడంతా చెప్పాడు. వసంతరాయ్ నిర్విణ్ణుడై పక్కమీద కూచుని అంతా విన్నాడు. "అదేమిటి దాదాభాయీ! ఇలా ఎక్కడైనా జరుగుతుందా? అది సంభవమేనా?"

"ఇక ఏమాత్రం ఆలస్యం చెయ్యటానికి వీల్లేదు తాతయ్యగారూ! మీరిప్పుడే నాన్నగారి దగ్గరకు వెళ్ళి మాటాడి రండి."

వసంతరాయ్ లేచి వెళ్ళాడు - "ఇదెక్కడైనా వుందా? ఇలా ఎవరైనా చేస్తారా?" అనుకుంటూ.

ప్రతాపాదిత్యుని సమీపించాడు. "నాయనా! ప్రతాప్! ఏమిటిదంతా? అటువంటి పనా?" అన్నాడు.

ప్రతాపాదిత్యుడింకా పడుకోనేలేదు. తన ఆలోచనా మందిరంలో కూచునివున్నాడు. లక్ష్మణసర్దారుని పిల్చి 'వద్దులే - ఆ పనినుండి విరమించు' అని చెబుదామన్న ఆలోచన క్షణమాత్రంగా అతనిమనసులో మెరిసింది. కాని మరుక్షణమే అంతర్హితమైపోయింది. ప్రతాపాదిత్యుడు రెండుసార్లు జారీ

చేస్తాడా ఆజ్ఞ! ఒకసారి ఫలానా పని చెయ్యమని నిర్దేశించటం; మళ్ళీ అదే నాలుకతో 'వద్దులే మానెయ్యి' అని నిషేధించట మూనా? పిల్లల్లాగా ఆజ్ఞలతో ఆటలాడతాడా తాను? మరి విభసంగతి? ఆ పిల్ల విధవరాలు కావలసిందే? రామచంద్ర రాయ్ కోరి నిప్పుల్లో దూకితే ఆమె విధవరాలు కాకేపోతుంది. అతడిప్పుడు ప్రతాపాదిత్యుని క్రోధాగ్నిలో కోరి దూకాడు. తత్ఫలితంగా తప్పనిసరిగా విభ విధవరాలు కావలసిందే. అందులో ప్రతాపాదిత్యుని జోక్యం ఏముందీ?... ఇన్ని ఆలోచనలు కూడా అతనిమనస్సులో పొటమరించట మేమిటి, అంతరించటమేమిటి! క్షణంలో జరిగిపోయింది. మధ్యమధ్య ఆ సంఘటన యాదవత్తూ మనస్సులో మెరుస్తూ ఉంటుంది. అప్పు డధీరుడై పోతాడు. ఈ రేయి గడిచి, ఎప్పుడు తెల్లవారుతుందా అని ఆలోచిస్తూ ఉంటాడు. ఇటువంటి సమయంలో వచ్చాడు వసంతరాయ్, వచ్చి అతని రెండుచేతులూ పుచ్చుకుని – "ఇటువంటిపనా నాయనా ప్రతాప్! ఎక్కడేనా వుందా?" అన్నాడు.

ప్రతాపాదిత్యునికి వొళ్ళంతా కారం రాచిన ట్టయింది. "ఏం ఎక్కడా ఎందు కుండదూ?"

"అతనింకా కుర్రవాడు. ఏంచేస్తే ఎలాపరిణమిస్తుందో గుర్తించలేనిపసివాడు–నువ్వు అంతగా కోపగించుకోతగినవాడా?"

"కుర్రవాడేం? నిప్పులో చెయి పెడితే కాలుతుందని కూడా తెలియని అంత చిన్నవయస్సన్నమాట! కుర్రవాడు! ఎవడో దౌర్భాగ్యపు బ్రాహ్మణుడు, మూర్ఖుడు, మూర్ఖుల ముందు వండ్లికిలించి పొట్టపోసుకుంటూ ఉండేవాడు – అతడికి ఆడవేషం బనాయించి అంతఃపురంలోకి తీసుకువస్తాడా? రాణీని

వరణం. రామచంద్రరాయ్ తన పడకగది గుమ్మంముందు నిల్చుని చూస్తున్నాడు. అంతఃపురంలో ఇరువైపులా శ్రేణిగా వున్న గదులన్నీ తలుపులు మూసేవున్నవి. ఎక్కడివాళ్ళక్కడ నిశ్శబ్దంగా నిద్రపోతున్నారు. ముందు ప్రాంగణంలో గోడల నీడలు పడుతున్నాయి. ఒక్కవైపునించిమాత్రం కాస్తవెన్నెల ప్రసరిస్తూఉంది. మరి కాసేపటికి అదికూడా విలుప్తంఅయింది. ఒక్కొక్క అడుగే వేసుకుంటూ వచ్చి చీకటితల్లి జగత్తునంతా కౌగిలలో పొదువుకుంది. రామచంద్రరాయ్ సాలోచనగా నిల్చునివున్నాడు. నలువైపులా దట్టంగా కమ్ముకుంటూన్న ఈ కారుచీకటిలో ఎక్కడదాగివుంది తనకోసం ప్రతీక్షిస్తూ ఒక కత్తి? ఎవడికి తెలుసు? లోపల, గదిలోనే ఓ మూల దాగి వున్నదేమో! ఇలాంటి ఆలోచనలతో అతనిశరీరమంతా వణికిపోతోంది. నుదుటిమీద చెమటబిందువులు ధారలు కడుతున్నాయి. ఈ మామయ్య (తనకు బాబాయి వరుస ఔతాడు)... ఈయనలోనే ఉందేమో మోసం అంతా! ఇతడే ఏంచెయ్యనున్నాడో! మెల్లిగా ఒక అడుగు వెనక్కు వేశాడు రామచంద్రరాయ్. ఇంతలో ఒక గాలితెర లోపలికి వచ్చింది. గదిలో దీపం ఆరిపోయింది. లోపలే ఎవడేనా దాగి వున్నాడేమో కొంపదీసి. రమాపతికి దగ్గరగావచ్చాడు,! "బాబాయిగారూ" అని పిలుస్తూ.

"ఏమిటి కుమారబాబూ!,,

ఈ సమయంలో విభాదేవి దగ్గరవుంటే బాగుండిపోనే — అనుకున్నాడు రామచంద్రరాయ్. బాబాయిమీద అతని కేమాత్రం విశ్వాసం లేకుండాఉంది.

విభ ఉదయాదిత్యుని దగ్గరకు వెళ్ళింది. కుప్పగూలి పోయింది. ఏడుపు సాగించింది. ఆమె నోటివెంట ఒక్కమాటకూడా బైటికి రాలేదు. సురమ వచ్చి లేవదీసి సరిగా కూచోబెట్టింది. "ఏమిటి విభా! ఏమైంది?"

విభ మాటాడలేదు. వదినగారిని కావిలించుకుని భోరున ఏడవసాగింది. ఉదయాదిత్యుడు ఆమె తల నిమురుతూ "ఏమిటి విభా! ఎందుకూ? ఏమైందీ?" అని ప్రేమగా అడిగాడు.

విభ ఉదయాదిత్యుని చేతులు పుచ్చుకుని "నువ్వు అక్కడికి రా అన్నయ్యా! అంతా తెలుస్తుంది" అని మాత్రం పలికింది అతి కష్టంమీద.

ముగ్గురూ విభాదేవి పడకగది దగ్గరకు వచ్చారు. చీకటిలో కూచునివున్నాడు రామచంద్రరాయ్. చేరువనే రమాపతి నిల్చునివున్నాడు. "ఏమిటిదంతా మామయ్యా! ఏం జరిగింది?" అన్నాడు ఉదయాదిత్యుడు.

విషయమంతా చెప్పాడు రమాపతి. ఉదయాదిత్యుని కన్నుచేరడంతలుగా విప్పారి భార్యతో అన్నాడు: "సురమా! నేనిప్పుడే నాన్నగారి దగ్గరకు వెడతాను. ఇలాంటి పని నేను జరగనీను — ఉహు. ఒక్కనాటికీ జరగనీను"

"మీ నాన్నగారి దగ్గరకు మీరు వెడితేమాత్రం ఏం ప్రయోజనం? అంతకన్నా తాతయ్యగార్ని పంపించండి. ఏమన్నా లాభం ఉంటే ఉండవచ్చు" అన్నది సురమ.

"ఔనౌను — నిజమే"

వసంతరాయ్ అప్పుడు మంచి గాఢ నిద్రలో ఉన్నాడు. అయినా లేపారు. లేవగానే ఎదుట ఉదయాదిత్యుడు కనిపిం

చాడు. తెల్లవారింది కామాలనుకున్నాడు సితార్ అందుకుని భైరవిరాగం ఆలాపించేందుకు ఉద్యుక్తుడైనాడు. సితార్ మెల్లిగా చేతుల్లోనించి లాక్కుంటూ "తాతయ్యగారూ! శృతి తప్పిపోయింది వ్యవహారం! పెద్ద ఆపద! ఎలాగ?" అన్నాడు.

ఆ మాట వింటూనే సితార్ పట్టుకున్న వేళ్ళు సళ్ళిచ్చాయి. గాభరాపడుతూ "ఏం? ఏమైందీ? ఆపదేమిటీ?" అన్నాడు.

ఉదయాదిత్యుడంతా చెప్పాడు. వసంతరాయ్ నిర్విణ్ణుడై పక్కమీద కూచుని అంతా విన్నాడు. "అదేమిటి దాదాభాయీ! ఇలా ఎక్కడైనా జరుగుతుందా? అది సంభవమేనా?"

"ఇక ఏమాత్రం ఆలస్యం చెయ్యటానికి వీల్లేదు తాతయ్యగారూ! మీరిప్పుడే నాన్నగారి దగ్గరకు వెళ్ళి మాటాడి రండి."

వసంతరాయ్ లేచి వెళ్ళాడు - "ఇదెక్కడైనావుందా? ఇలా ఎవరైనా చేస్తారా?" అనుకుంటూ.

ప్రతాపాదిత్యుని సమీపించాడు. "నాయనా! ప్రతాప్! ఏమిటిదంతా? అటువంటి పనా?" అన్నాడు.

ప్రతాపాదిత్యుడింకా పడుకోనేలేదు. తన ఆలోచనా మందిరంలో కూచునివున్నాడు. లక్ష్మణసర్దారుని పిల్చి 'ఇప్పుడే - ఆ పనినుండి విరమించు' అని చెబుదామన్న ఆలోచన క్షణమాత్రంగా అతనిమనసులో మెరిసింది. కాని మరుక్షణమే అంతర్హితమైపోయింది. ప్రతాపాదిత్యుడు రెండుసార్లు జారీ

చేస్తాడా ఆజ్ఞ! ఒకసారి ఫలానా పని చెయ్యమని నిర్దేశించటం; మళ్ళీ అదే నాలుకతో 'వద్దులే మానెయ్యి' అని నిషేధించటమూనా? పిల్లల్లాగా ఆజ్ఞలతో ఆటలాడతాడా తాను? మరి విభసంగతి? ఆ పిల్ల విధవరాలు కావలసిందే? రామచంద్రరాయ్ కోరి నిప్పుల్లోదూకితే ఆమె విధవరాలు కాకేపూతుంది. అతడిప్పుడు ప్రతాపాదిత్యుని క్రోధాగ్నిలో కోరి దూకాడు. తత్ఫలితంగా తప్పనిసరిగా విభ విధవరాలు కావలసిందే. అందులో ప్రతాపాదిత్యుని జోక్యం ఏముందీ?... ఇన్ని ఆలోచనలుకూడా అతనిమనస్సులో పొటమరించటమేమిటి, అంతరించటమేమిటి! క్షణాలలో జరిగిపోయింది. మధ్యమధ్య ఆ సంఘటన యావత్తూ మనస్సులో మెరుస్తూ ఉంటుంది. అప్పు డధీరుడై పోతాడు. ఈ రేయి గడిచి, ఎప్పుడు తెల్లవారుతుందా అని ఆలోచిస్తూ ఉంటాడు. ఇటువంటి సమయంలో వచ్చాడు వసంతరాయ్, వచ్చి అతని రెండుచేతులూపుచ్చుకుని - "ఇటువంటిపనా నాయనా ప్రతాప్! ఎక్కడేనా వుందా?"అన్నాడు.

ప్రతాపాదిత్యునికి వొళ్ళంతా కారం రాచినట్టయింది. "ఏం ఎక్కడా ఎందు కుండదూ?"

"అతనింకా కుర్రవాడు. ఏంచేస్తే ఎలాపరిణమిస్తుందో గుర్తించలేనిపసివాడు-నువ్వు అంతగా కోపగించుకోతగినవాడా?"

"కుర్రవాడేం? నిప్పులో చెయిపెడితే కాలుతుందని కూడా తెలియని అంత చిన్నవయస్సన్నమాట! కుర్రవాడు! ఎవడో దౌర్భాగ్యపు బ్రాహ్మణుడు, మూర్ఖుడు, మూర్ఖుల ముందు వండ్లికిలించి పొట్టపోసుకుంటూ ఉండేవాడు - అతడికి ఆడవేషం బనాయించి అంతఃపురంలోకి తీసుకువస్తాడా? రాణీని

అవమానించేందుకు ప్రయత్నిస్తాడా? ఇంతపనీ చేయగలిగిన వాడికి...దీని పరిణామం ఏమౌతుందో ఊహించుకోగలిగినంత బుద్ధిమాత్రం ఉండదేం? ఆ బుద్ధి మెదడుకు కలిగేలోపుగానే ఆ మెదడుకాస్తా శరీరంనించి వేరైపోతుంది. అదొక్కటే శాస్త్ర విచారణీయం" – ఇలా మాటాడుతూంటే ప్రతిపాదిత్యుని ప్రతి అంగమూ కంపించిపోయింది; మనోనిశ్చయం దృఢతరం అయింది; జుగుప్స అనేది లేశమాత్రమూ కనిపించలేదు ఆయనలో.

వసంతరాయ్ తలఊపుతూ "ఔనౌను, అయినా కుర్ర వాడు. అతనికేం తెలుసుపాపం!" అన్నాడు.

వసంతరాయ్ ఈవిధంగా ఇంకా తన్ను అనుసయిస్తూ ఉండడం ప్రతిపాదిత్యునికి అసహ్యమనిపించింది. "ఇదిగో, పెద నాన్నా! మన రాయ్ వంశ గౌరవమర్యాదల్ని గురించిన జ్ఞానం లేశమాత్రమైనా నీకుఉన్నదా అసలు? ఉంటే మొగల్ పాదుషా పాదధూళి అలా నెరిసినతలకు పులుముకుని తిరుగుతావా? పాదుషా దయ సంపాదించుకున్నావని సగర్వంగా తలకాయ ఎత్తుకుని సంచరిస్తున్నావు. నీ వ్యవహారమంతా చూస్తోంటే ప్రతాపాదిత్యునికి తలగొట్టినట్టుగాఉంది తెలుసునా? యవనుల పాదాలకింది మట్టి తీసుకుని తిలకం దిద్దుకుంటున్నావు యవనుల పాదధూళితో, కళంకితమైయున్న నీ తలకాయ తీయించి మట్టిలో కలిపిపారేద్దామనే అనుకున్నాను. కాని దైవమాయ వల్ల అది సాధ్యం కాకపోయింది. ఇంతకన్నా ఇంకా స్పష్టంగా నన్నేం చెప్పమంటావు? మన రాయ్‌వంశానికి ఎంతఅవమానం జరుగుతుందో గమనించలేకండాఉన్నది కేవలం నువ్వొక్కడివే.

మనరాయ్‌వంశానికి అవమానం చేకూర్చినవాడిని క్షమించ మంటూ యాచించటానికి నువ్వు కాబట్టే వచ్చావు."

వసంతరాయ్ ముఖంలో ఎక్కడలేని గాంభీర్యం వచ్చేసింది. మెల్లిగా ఇలా చెప్పసాగాడు: "ఇప్పుడు తెలిసింది నాకు ప్రతాప్! నువ్వు ఖడ్గం ఎత్తావంటే ఎవరిదో ఒకరిమీద పడి దాహం తీర్చుకోవలసిందే; వృథాపోయేందుకు వీల్లేదు. నేను దాని త్రోవలోనించి తప్పుకున్నాను. ఇంకొకడు దానికి ఎరకాబోతున్నాడు. సరే, ప్రతాప్ నీకు దయఅనేది కలక్కపోతే... నీ కోసం ఎవరినో ఒకర్ని తప్పనిసరిగా హతమార్చవలసేవుంటే... ఎవరినో ఎందుకు? నన్నే కానీ." వసంతరాయ్ తలవంచి నిల్చాడు. "ఈ తల బలిగొని, నీకు తృప్తిచేకూరే పక్షంలో... ఊఁ – కానీ – తీసుకో; పట్టుకో ఖడ్గం. ఈ తల మీద వెంట్రుకలు లేవు; ఈ ముఖంలో యౌవన చిహ్నాలు మిగిలి లేవు. యమధర్మరాజు ఆహ్వానిస్తున్నాడు; ఆయన సభలోకి వెళ్ళేందుకు కావలసిన సింగారమంతా అయిపోయి సిద్ధంగానేఉన్నాను." వసంతరాయ్ ముఖకవళికల్లో ఒక మృదు హాస్యరేఖ పొడసూపింది. "కాని బాగా ఆలోచించుకో ప్రతాప్! విభ మనచేతులమీద పెరిగిన బిడ్డ. ఆ పసిపాప కన్నుల్లోనించి అశ్రువులు కాలువలై ప్రవహిస్తూ ఉంటే –" వసంతరాయ్ అధీరుడై వెక్కి వెక్కి ఏడువసాగాడు. "నన్ను చంపివెయ్యి ప్రతాప్! ఇంకా బ్రతికివుండటం నాకేం సుఖకరంకాదు. విభాదేవి కన్నీళ్ళు చూడకండా, అంతకుముందుగానే నన్ను అంతమొందించు."

ప్రతాపాదిత్యుడు కిమ్మనకుండా అంతా విన్నాడు. వసంతరాయ్ చివరివాక్యం పూర్తిచెయ్యగానే ప్రతాపాది త్యుడు కీవిగా లేచివెళ్ళిపోయాడు అక్కడనుంచి. వసంతరాయ్. చెప్పదలచుకున్న దంతా చెప్పేశాడుకదా అనుకున్నాడు. క్రిందికి దిగివెళ్ళి పహారావాళ్ళనుపిల్చాడు: "మన రాజభవనానికి అంటుకునివున్న కాలువలోనుంచి నావలు వెళ్ళటానికి వీల్లే కుండా దుంగలు అవీ వేసి బందుచెయ్యండి." అని కఠినంగా ఆజ్ఞాపించాడు. రామచంద్రరాయ్ నావ ఆ కాలువలోనేఉంది. "అంతఃపురంలోనుంచి ఒక్కపురుగుకూడా బైటికి వెళ్ళటానికి వీలులేదు ఈ రాత్రి. అప్రమత్తులై వుండండి. జాగ్రత్త!" అని హెచ్చరిక చెప్పాడు.

# 11

వసంతరాయ్ తిరిగివచ్చాడు అంతఃపురంలోకి. అతన్ని చూడ్డంతోనే కార్యం విఫలమై పోయినట్టు కనుక్కుంది కామాలు—విభ. ఏడువసాగింది. వసంతరాయ్ కూడా కడుపులోని దుఃఖాన్ని ఆపుకోలేకపోయాడు. "ఇక నువ్వే ఏదైనా ఉపాయం ఆలోచించాలి దాదాబాయీ!" అన్నాడు ఉదయా దిత్యుని చేతులు పుచ్చుకుని. రామచంద్రరాయి దిగాలుపడి కూర్చున్నాడు. "రండి నా వెనకాలే రండి" అన్నాడు ఉద యాదిత్యుడు. చేతిలో కత్తిపుచ్చుకుని అందరూ బయలు దేరారు. "నువ్వెందుకు విభా! నువ్వు రాబోకు" అన్నాడు ఉదయాదిత్యుడు. కాని ఆమె రాకుండా మానలేదు. "పోనీ, రానీలే" అన్నాడు రామచంద్రరాయ్. అడుగులో అడుగు

వేసుకొంటూ ఆ నడిచవ్వాకులేని కటిక చీకటిలో బయలుదేరి పోతున్నారు వాళ్ళు. ఏదో కటికి మోసం ఆ కారుచీకటిలో భయంకరంగా వ్యాపించి యున్నట్లనిపిస్తోంది. రామచంద్ర రాయ్ చాలా జాగ్రత్తగా వెనక, ముందు పక్కలచూస్తూ నడుస్తున్నాడు. రమాపతిమీద అతనికి అనుమానం అప్పు డప్పుడు తల చూపుతూనే ఉంది. అంతఃపురందాటి బైటికి వెళ్ళేద్వారం వద్దకు చేరారు. అది మూసేవుంది. "అన్నయ్యా! కింది దరవాజా తీసే ఉండచ్చు అటు పోదాం" అన్నది విభ భయకంపిత కంఠస్వరాన. ఇక అందరూ అటువైపు బయలు దేరారు. అంతా గాఢాంధకారం. ఒక్కొక్క మెట్టే దిగుతూ వెడుతున్నారు. ఎక్కడికో అగాధంలోకి దిగిపోతున్నట్టుంది రామచంద్రరాయ్‌కి. ఈ మెట్లన్నీ దిగిపోయాక మళ్ళీ పైకి రావటమంటూ ఉంటుందా? ఒక పెద్ద వాసుకి బిలంలా ఉంది. పాతాళలోకానికి దారి ఇదేనేమో!... మెట్లన్నీ దిగారు. అక్కడి ద్వారంకూడా మూసేవుంది. మళ్ళీ అందరూ పైకి ఎక్కి వచ్చేశారు. అంతఃపురందాటి బైటికి వెళ్ళేందుకు ఎన్ని ద్వారాలైతే ఉన్నాయో అన్నీ మూసేవున్నాయి. అన్ని ద్వారాలదగ్గరకీ రెండేసిసార్లు, మూడేసిసార్లు తిరిగారు కాళ్ళు పడిపోయేట్టు. ఒక్కటికూడా తెరచిలేదు.

బైటికి పోవటం ఇక అసంభవమని తోచింది విభాదేవికి. ఆమె కన్నీళ్ళు తుడిచివేసుకుంది. భర్తను చేయి పుచ్చుకుని తన గదిలోకి తీసుకుపోయింది. తాను ధైర్యంగా వచ్చి గుమ్మంలో నిల్చుంది. "మిమ్మల్ని ఈ గదిలోనించి ఎవరు లాక్కుపోతారో నేను చూస్తాను. మీరు ఎక్కడెక్కడికి

వెళ్ళినా ముందు నేనే వెళ్తాను. నన్ను ఎవరు అడ్డగిస్తారో
చూస్తాను" అన్నదామె అకంపిత కంఠస్వరాన. ఉదయాది
త్యుడు వచ్చి గుమ్మం ఆవల నిల్చున్నాడు - "ముందు నన్ను
వధించిగాని ఎవరూ గదిలో జొరబడేందుకు వీల్లేదు" అంటూ.
సురమ ఏమీ మాటాడలేదు. మౌనంగా వచ్చి భర్తపక్కనే
నిల్చుంది. వీరందరికీ ముందుగా వచ్చి నిల్చున్నాడు వృద్ధ
వసంతరాయ్. రమాపతి మెల్లిగా అక్కడినించి కదిలి వెళ్ళిపో
యాడు. ఈ వ్యవహారం, వ్యవస్థ ఏమీ బాగున్నట్లు లేదు
రామచంద్రరాయ్‌కి. ప్రతాపాదిత్యుడు ఎటువంటి మనిషో
అతనికి తెలుసు. విభా దేవి, ఉదయాదిత్యుడు మధ్యలో నిల్చి
ఏం చెయ్యగలరు? ఎంత చెయ్యగలరు? ఏదో విధంగా ఇక్కడి
నించి దాటి బయటపడటమే శ్రేష్ఠమైన మార్గం.

కాసేపయాక సురమా దేవి ఉదయాదిత్యునితో మెల్లిగా
మృదువుగా ఇలా అన్నది: "ఇక్కడ ఈ విధంగా మనం ఎంత
దృఢంగా నిల్చివున్నా ప్రయోజనం ఉండదేమో అనుకుం
టాను. పైగా హాని కొనితెచ్చుకున్నట్లవుతుంది కూడాను.
మీ నాన్నగారికి ఎదురు నిల్చినందువల్ల వారి సంకల్పం మరింత
దృఢతరమే ఔతుంది. కనుక ఏ విధంగానైనా సరే వారిని ఈ
రాత్రే అవతలికి చేర్చి పంపించే ఉపాయం ఏదో అది ఆలో
చించండి".

ఉదయాదిత్యుడు భార్య ముఖంలోకి చూచాడు. ఆ
చూపులో విచారభావమేదో ద్యోతకం అయింది. "అయితే
వెళ్ళనా? బలప్రయోగంద్వారా నైనాసరే ఉపాయం సాధించి
రానా?"

"వెళ్ళండి" అన్నది సురమాదేవి సమ్మతిసూచకంగా తల ఊపుతూ, ధార్యం కోల్పోకండా.

ఉదయాదిత్యుడు వెంటనే పై ఉత్తరీయం అవతలపారేసి బయలుదేరాడు. కొంతదూరం అతని వెంటనే వెళ్ళింది సురమ. ఒక రహస్యస్థలంలో నిల్చి ఆమె భర్తను కౌగిలించు కుంది. ఉదయాదిత్యుడు వంగి ఆమె పెదవులమీద ఒక పెద్ద ముద్దు పెట్టుకుని...మరుక్షణమే అక్కడనించి గబగబ వెళ్ళి పోయాడు. సురమాదేవి తన గదిలోకి వెళ్ళింది. ఆమె కన్నుల వెంట అశ్రువులు ప్రవహిస్తున్నాయి. రెండు చేతులూ జోడించింది. "అమ్మా! భవానీ! నేనే ప్రతివతనైతే నా భర్తను వారి తండ్రిగారి కోపాగ్నినుండి రక్షించవమ్మా! నిన్ను నమ్ముకునే, నువ్వు కాపాడుతావన్న విశ్వాసంతోనే ఇవాళ మా వారిని ఒక పెద్ద సంకటావస్థలోకి విసరివేశాను. నన్ను సర్వనాశనం చేస్తావా? ఇక మళ్ళీ ఈ జీవితంలో నిన్ను విశ్వసించనుసుమా!" ఆమె వెక్కి వెక్కి ఏడవసాగింది. ఆ చీకట్లో కూచుని మాటి మాటికీ "అమ్మా, అమ్మా!" అని పిలుస్తోంది. కాని ఆమెకు లోపల అనుమానంగానే ఉంది: తన పిలుపు జగజ్జనని చెవుల దాకా వెళ్ళినట్టు లేదని...తాను మానసికంగా తల్లి పాదాలకు అర్పిస్తోన్న పుష్పాంజలిని ఆమె స్వీకరించటం లేదని...అది ఆమె చరణాలమీద నిల్చివుండక జారిపడిపోతున్నదని. "ఏం, తల్లీ! నేనేం తప్పుచేశానమ్మా!" అన్నదామె ఏడుస్తూ: కాని ఆమె కెట్టిజవాబూ వినిపించటంలేదు. చుట్టూ ప్రళయమూర్తి తాండవిస్తున్నట్టుగా ఉందామెకు. ఒక్కతే అక్కడ ఉండలేక విభాదేవి ఉన్నచోటికి వచ్చింది.

"దాదాభాయి ఇంకా తిరిగి రాలేదు. ఎలాగ? ఏం చేద్దాం?" అన్నాడు వసంతరాయ్. అతని కంఠం కంపించింది

'భగవంతుడి దయ!" అన్నది గోడకానుకుని నిల్చున్న సురమ.

ఆ సమయాన రామచంద్రరాయ్ తనలో తాను రామమోహన్ మీద మండిపడిపోతున్నాడు. అసలు వాడిమూలాన్నే ఈ కొండ విరిగి నెత్తిమీద పడింది ఇప్పుడు. వాడిని చాలా కఠినంగా, నిర్దాక్షిణ్యంగా శిక్షించవలసిందే. కాని ఈ గండం గడిచి బైటపడితేకద వాడిని శిక్షించగలగటం! – ఈ అనుమానం కూడా రామచంద్రరాయ్‌కి మధ్య మధ్య కెలక వేస్తూనే ఉంది.

చేతిలో కత్తి ధరించి ఉదయాదిత్యుడు బంధించివున్న ద్వారం దగ్గరకు వెళ్ళాడు. "ఎవరక్కడ!" తలుపు తట్టుతూ పిల్చాడు.

"నేనే, సీతారామ్‌ను" అని బైటనించి జవాబు.

"తొందరగా దరవాజా తెరు" అన్నాడు యువరాజు దృఢమైన కఠంస్వరాన.

వెంటనే తలుపు తెరవబడింది. యువరాజు గుమ్మం దాటి బైటికి వెడుతున్నాడు. సీతారామ్ చేతులు జోడించి "క్షమించాలి చిన్నబాబుగారూ! ఈ రాత్రి అంతఃపురంలో నుంచి ఎవర్నికూడా బయటికి పోనీయవద్దని మహారాజావారి ఆజ్ఞ" అన్నాడు.

"అయితే సీతారామ్! కత్తిపుచ్చుకుని నన్ను వెళ్ళనీ కుండా అటకాయిస్తావన్నమాట! సరేకాని, రా" అంటూ యువరాజు చేతిలో కత్తి ఝళిపించాడు.

సీతారామ్ వంగి దణ్ణం పెట్టాడు: "అదికాదు చిన్న బాబూ! మిమ్మల్ని ధిక్కరించి నేను కత్తి తీయగలనా? తమరు రెండుసార్లు నా ప్రాణాలు రక్షించారు." అంటూ యువరాజు పాదాలు స్పృశించిన చేతుల్ని తలపై రాసుకుని చూస్తూ నిలబడ్డాడు.

"ఇంతకూ ఏమంటావో చెప్పుమరి! నాకు తొందరపని ఉంది వేరే – వెళ్ళాలి."

"రెండుసార్లు తమరు రక్షించిన నా ప్రాణాల్ని ఇప్పుడు మీరే బలి చేయకండి బాబూ! అదే నా కోరిక. నా కత్తి లాక్కోండి, ఇదిగో నా శరీరమంతా కిందినించి పైదాకా బంధించి వెయ్యండి. లేకపోతే మహారాజావారు నన్ను రేపు బ్రతికివుండనీరు."

యువరాజు అతనికత్తి లాగేసుకున్నాడు. వాడి గుడ్డలతోనే వాడిని కట్టి, గట్టిగా బంధించివేశాడు. అక్కడ పడి వున్నాడు వాడు. యువరాజు ముందుకు దాటిపోయాడు. కొంతదూరం పోయాక ఒకగోడ తగిలింది. అంతమరీ ఎత్తయిన గోడకాదు. దానికి ఒక్కటే ద్వారం ఉంది. అదైనా మూసే ఉంది. అంతఃపురానికి పొలిమేర ద్వారం అది. యువరాజు వెళ్ళి తలుపు తట్టలేదు. గోడెక్కి బయటికి చూచాడు. కావలావాడు బయట గోడకానుకుని తీరిగ్గా నిద్రపోతున్నాడు. యువరాజు చప్పుడుకాకుండా గోడఅవతలికి దిగాడు. కావలా

వాడిచేతిలో ఉన్న కత్తిలాగి అవతల పారేశాడు. మెలకువ వచ్చి నిర్ఘాంతపడి, కర్తవ్యతా విమూఢుడైన కాపలావాడిని తాళ్ళుపెట్టి కట్టేశాడు. వాడి బొడ్డులోవున్న తాళంచెవి తీసుకున్నాడు. దానితో దరవాజా తాళంతీసి బార్లా తెరచాడు. అప్పటికి మామూలు ప్రపంచంలోకి వచ్చాడా కాపలావాడు. "ఏమిటిచిన్నబాబూ! ఇదేంగోల?' అన్నాడు.

"అంతఃపురం ద్వారం తెరుస్తున్నాను"

"రేపు మహారాజావారికి నేనేం సమాధానం చెప్పుకోను?"

"యువరాజు వచ్చి ఇంత ఆగడంచేసి, తాళంచెవి లాక్కొన్నాడని చెప్పు. నీకు విడుదల లభిస్తుంది."

యువరాజు అక్కడినుంచి బయలుదేరి ఇంకాముందుకు వెళ్ళాడు. రామచంద్రరాయ్ అనుచరులు బసచేస్తున్న చోటికి చేరుకున్నాడు అక్కడ రామమోహన్, రమేశభట్టు ఇద్దరు మాత్రమే పడుకున్నారు. మిగతావాళ్ళంతా తిని, తాగి నాచుమీద షికారు వెళ్ళినట్టున్నారు. యువరాజు మెల్లగా రామమోహన్‌ను లేపాడు. "ఏమిటి చిన్నబాబూ! ఎంకాలా!" అన్నాడు రామమోహన్ ఉలికిపాటుగా లేచి సాశ్చర్యంగా.

యువరాజు అతన్ని బైటికితీసుకువచ్చి అంతా చెప్పాడు

రామమోహన్ బుజానవున్న దుప్పటి తీసి తలకు చుట్టాడు. లాటీ చేతులో పుచ్చుకుని సిద్ధమైనాడు. "ఎవడో ఆ లక్ష్మణసర్దార్ ! వాడెంత పిండమో చూస్తాగా ! యువరాజు బాబూ! మా రాజాగార్ని ఎలాగైనా సరే ఇక్కడికి

తెచ్చి విడిచిపెట్టండి, చాలు. ఈ ఒకలాటీతో వందమంది వచ్చినా సరే, మడిచి పోగులు పెడతాను."

"నీ సాహసం నాకు తెలుసు. కాని యశోహర్ పట్నంలో వందలమందే కాదు. ఇంకా చాల ఎక్కువమందే ఉన్నారు. నువ్వు బలపూర్వకంగా ఏమో చేద్దామనుకోటం పొరపాటు. మరో ఉపాయం ఏదైనా చూడాలి."

"సరే. ముందు మా మహారాజావార్ని నా దగ్గర తెచ్చి వదిలిపెట్టండి. ఆయన దగ్గరుంటే ఏదో ఉపాయం చేస్తాను లెండి."

యువరాజు తిరిగి అంతః పురంలోకి వెళ్ళాడు.

రామచంద్రరాయ్‌ని వెంటబెట్టుకుని అందరూ వచ్చేశారు బైటికి.

రామమోహన్‌ను చూడగానే రామచంద్రరాయ్‌కి కోపం పొర్లి వచ్చేసింది. "ఈ తక్షణం నిన్ను నౌకరీలోనుంచి తీసివేస్తున్నాను. నా యెదుట ఇక కనిపించబోకు. వెళ్ళిపో దూరంగా. చాలకాలంనించీ పనిచేస్తున్నావు మా దగ్గర. అంత కన్నా కఠినమైన శిక్ష నీకు విధించలేక పోతున్నాను" అన్నాడు. అలా అంటూండగానే రామచంద్రరాయ్ కంఠం రుద్ధమై పోయింది. నిజానికి రామమోహన్ అంటే అతనికి అపేక్ష. అతడు తన్ను చిన్నప్పుడు ఎత్తుకుని పెంచాడు.

రామమోహన్ చేతులు రెండూ జోడించినిల్చున్నాడు. "నా నౌకరీ తీసివేయటానికి తమరెవరు మహారాజా! యమ ధర్మరాజు పిలుపువచ్చిననాడు ఈ నౌకరీనించి నన్ను భగవంతుడే తొలగిస్తాడు. మీరు నన్ను ఉంచుకోండి; ఉంచుకోక

పోండి; మీకు నేను చాకిరిచేస్తూనే ఉంటాను" అంటూ రామచంద్రరాయ్‌ని ఏ ఆపదనించైనాసరే రక్షించుకోటానికి సర్వసన్నద్ధుడై నిలబడ్డాడు

"మరి ఉపాయమేమన్నా ఆలోచించావా రామమోహన్ !" ఉదయాదిత్యుడు అడిగాడు.

"తను ఆశీర్వాదం వుండాలిగాని, ఇంకోటి - ఈ లాటీమే ఉపాయం. ఇకపై కాళీమాత దయ !"

ఉదయాదిత్యుడు తల అడ్డంగాఊపుతూ "లాభంలేదు, ఆ ఉపాయం ఎందుకూ పనికివచ్చేదికాదు... ఇంతకూ మీ నావ ఎక్కడుందీ?" అన్నాడు.

"రాజమహల్‌కు దక్షిణపువైపు కాలువలో."

"అయితే పదండి, మేడమీదికి ఎక్కిచూద్దాం" అన్నాడు ఉదయాదిత్యుడు.

ఆ క్షణాన రామమోహన్ మెదడులో ఒక్కఉపాయం తళుక్కుమన్నది. "ఔనౌను; మేడమీదికి పోదాం, పదండి" అన్నాడు.

రాజమహల్ పైఅంతస్తుకు చేరుకున్నారందరూ. అక్కడి నించి సుమారు 70 బారల కిందవున్నది కాలువ. అందులో రామచంద్రరాయ్‌ఓడ - ముందర హంసముఖం, ప్రక్కల నంది మువ్వలు కలది - కనిపిస్తూనే వుంది. "మా మహారాజావారిని వీపుమీద కట్టుకుని కాలువలోకి దూకేస్తాను" అన్నాడు రామమోహన్. ఆ మాట విని వసంతరాయ్ గాభరాపడ్డాడు. "వద్దు-వద్దు. అలాంటిపనా? రామమోహన్ నువు అలాటిఘోరం చెయ్యబోకు" అన్నాడు. విభకూడా

ఉలికిపడది "వద్దు మోహన్! నువ్వు అలా మాట్లాడుతున్నా వేమిటి?" అన్నది. "ఊహుం - అదికాదు మోహన్ సరైన పద్ధతి" అన్నాడు రామచంద్రరాయ్.

ఉదయాదిత్యుడు కిందికి వెళ్ళి లావుపాటి దువ్వట్లుకొన్ని సంగ్రహించి తెచ్చాడు. అవన్నీ పీలుగా చించి, మెలిచి ఒక పొడుగాటి వగ్గం తయారుచేశాడు రామమోహన్. ఓడ ఏటు వైపువున్నదో ఆవైపున వున్న ఒకస్తంభానికి ఆ వగ్గంకొస బాగా బిగించి ముడివేశారు. రామమోహన్ రామచంద్ర రాయ్‌వైపు తిరిగి "మహారాజా! మీరు నా వీపు గట్టిగా కరచి పట్టుకోండి. ఈ వగ్గం సాయంతో నేను తిన్నగా కిందికి దిగుతాను" అన్నాడు. అంతకన్నా గత్యంతరంలేకపోవటంవల్ల రామచంద్రరాయ్ అందుకు అంగీకరించాడు. రామమోహన్ అందరికీ పాదాభివందనం చేశాడు. అందరి పాదధూళీ శిరసున అలంకరించుకున్నాడు. 'జై కాళీమాతకూ' అని పలికి రామ చంద్రరాయ్‌ని వీపుమీద ఎక్కించుకున్నాడు. రామచంద్ర రాయ్ కళ్ళు మూసుకుని, అతని వీపుకరచుకుని ఉండిపోయాడు. రామమోహన్ విభాదేవివైపు తిరిగి "అమ్మా! దొరసానమ్మ గారూ! ఈ మీ కొడుకు బ్రతికి వున్నన్నాళ్ళూ మీ కేం భయం లేదు లెంపమ్మా?" అన్నాడు.

రామమోహన్ వగ్గం సహాయంతో కిందికి దిగసాగాడు. విభాదేవి స్తంభాన్ని గట్టిగా పట్టుకుని నిల్చొంది. వసంత రాయ్‌కి కాళ్ళు కంపిస్తున్నాయి. అయినా అలాగే తన్ని పట్టి నిల్చుని 'దుర్గాదేవి' నామం జపం చేస్తున్నాడు. రామమో హన్ మెల్లిమెల్లిగా కిందికిదిగుతున్నాడు వగ్గంమీదుగా. వగ్గం

చివరదాకా వచ్చేశాడు, పగ్గాన్ని వళ్ళంతో కరచివట్టుకున్నాడు. రెండుచేతులతో రామచంద్రరాయ్‌ని వీపుమీదనించి నెమ్మదిగా తీసి నావలోకి దింపాడు. చివరకు తానూ నావలోకి దూకాడు. నావలోకి దిగటంతోనే రామచంద్రరాయ్ మూర్ఛపోయాడు. ఇక్కడ విభాదేవికికూడా అదేఅవస్థ సంభవించింది. భర్త నావలో దిగటం చూచింది; ఒక్క దీర్ఘనిశ్వాసం విడిచింది; మూర్ఛపడిపోయింది. వసంతరాయ్ ఒళ్ళంతా కంపిస్తూ "ఇదేమిటి? ఇలాజరిగిందేం దాదాభాయీ!" అన్నాడు. ఉదయాదిత్యుడు విభాదేవిని ఎత్తుకుని క్రిందికి తీసుకుపోయాడు. "ఇక మీ విషయం ఏమిటో ఆలోచించుకోండి" అన్నది సురమ ఉదయాదిత్యుని చేయిపుచ్చుకుని. "నా విషయమై నాకేం విచారంలేదు" అన్నాడు ఉదయాదిత్యుడు.

నావ కొంతదూరం పోయి ఆగింది. పెద్దపెద్ద దుంగలూ అవీ అడ్డంపెట్టి వున్నాయి. ఈ లోగా నావ వెళ్ళిపోతుందని కాపలావాళ్ళకు తెలియవచ్చింది. వాళ్ళు రాళ్ళు, రప్పలు విసరటం మొదలుపెట్టారు. కాని అవి నావదాకా రాలేక పోయాయి; వాళ్ల చేతుల్లో కత్తులైతే వున్నాయి. తుపాకులు లేవు. ఒక తుపాకి తీసుకువద్దామని పరుగెత్తా డొకడు. వెతగ్గా వెతగ్గా ఒక తుపాకి కనిపించింది. కాని తుపాకి మందేదీ? తుపాకి మందుకోసం వెదకనారంభించారు వాళ్ళు. ఈ లోగా రామమోహన్, ఇంకా ఇతర అనుచరులు కలిసి నావను దుంగలమీదిగా అవతలకు లాగివేశారు. దాన్ని అనుసరించి వెళ్ళి పట్టుకోవాలంటే కాపలావాళ్ళకు ఒక నావ కావాలి. ఒక నావను తీసుకురావడానికి ఒకడు పరిగెత్తి

వెళ్ళాడు. వాడు దారిలో ఒక దుకాణందగ్గర చిలుముగొట్టం లంకించుకుని పీలుస్తూ కూచున్నాడు. చివరకు చాల సేపటికి ఒక నావ తీసుకువచ్చాడు. కాని ఏం లాభం? సమయం దాటి పోయింది. అందరూ కలసి చీవాట్లు పెట్టారు వాడిని యింత ఆలస్యం చేసినందుకు. "నేనేం గుర్రాన్ని అనుకున్నారా తర తరా పరిగెత్తుకుపోయి రావటానికి?" అన్నాడు వాడు. నావ తీసుకు రావటానికి ఎంత ఆలస్యం అయిందో... వాళ్ళలో వాళ్ళకు ఏర్పడిన ఈ వివాదం ముగియటానికి అంతకు నాలుగు రెట్లు ఆలస్యం అయింది ఈ లోగా రామచంద్రరాయ్ నావ చాలదూరం వెళ్ళిపోయింది. ఇక దాన్ని వెళ్ళి పట్టుకోవటం అసంభవం. రామచంద్రరాయ్ నావ కాలువ గడచి భైరవి నదిలో ప్రవేశించింది. ఫర్నాండిస్ ఫిరంగి మోగించి మహా రాజావారికి సలాంచేశాడు.

రాత్రి నాల్గవ యామంలో ప్రతాపాదిత్యునికి కాస్త కునుకు పట్టింది. కాని ఫిరంగిమోత వినిపించేసరికి మెలకువ వచ్చేసింది. బిగ్గరగా కాపలావాళ్ళను కేక వేసి పిల్చాడు. కాని యెవరూ రాలేదు. ఎక్కడి కాపలావాళ్ళక్కడ రాత్రే పారి పోయారు. ఇంకా బిగ్గరగా పిల్చాడు ప్రతాపాదిత్యుడు.

## 12

ఎన్ని కేకలు వేసినా ఎవరూ రాకపోయేసరికి ప్రతా పాదిత్యుడు లేచి తానే బైటికి వచ్చాడు. 'మంత్రిజీ!' అని పిల్చాడు. వెంటనే ఒక సేవకుడు పరిగెత్తుకు పోయి మంత్రి గారిని అంతఃపురంలోనికి తీసుకువచ్చాడు.

"మంత్రిజీ! కావలావాళ్ళంతా ఏమైనట్టు?"

"బైటిద్వారందగ్గర కావలావాళ్ళంతా పారిపోయినట్టు కనిపిస్తుంది"

ఒక భయంకర సంకటావస్థ దాపురించినట్టు మంత్రి గుర్తించాడు. అందుచేత వెంటనే స్పష్టంగా జవాబు చెప్పే శాడు. తాను గనక అటువంటి సమయంలో తటపటాయిస్తూ, ఆలోచిస్తూ వెంటనే జవాబు చెప్పకపోతే రాజుగారి కోపం ఉగ్రతరం ఐపోతుంది. ఆ సంగతి మంత్రికి తెలుసు.

"అంతఃపురంలోని కావలా వాళ్ళంతా కూడా లేరే!"

నేను వస్తూన్నప్పుడు చూచాను. వాళ్ళను ఎవరో కట్టివడేశా రక్కడ."

రాత్రి జరిగిన సంఘటన మంత్రికి తెలియదు. ఊహా కందనూలేదు. ఏదో మొత్తానికి ఒక విపరీత సంఘటన జరిగి ఉండాలని మాత్రం అతనికి తోచింది. ఆ విషయమై తాను మహారాజును అడిగి తెలుసుకోవడానికి అది సమయం కాదు.

"రామచంద్రరాయ్ ఎక్కడున్నాడు? ఉదయాదిత్యు డేడీ? వసంతరాయ్ ఎక్కడ?..." ప్రశ్న పరంపర కురిపించాడు ఉదయాదిత్యుడు.

"బహుశా, అంతఃపురంలో ఉండచ్చు"

రాజు కంఠంలో తీక్షణత వచ్చింది. "'బహుశా' ఏమిటి మంత్రీజీ! అలాంటి జవాబు నేను మాత్రం ఊహించుకోలేక పోయానా? తమరేమను కడిగా ననుకున్నారు? 'బహుశా' అనబడేది ఎల్లప్పుడూ నిజం ఔతుందా?"

మంత్రి ఏమీ జవాబు చెప్పలేదు. మెల్లగా అచ్చోటు వీడి బైటికివచ్చాడు. దారిలో రమాపతి కలసి విషయమంతా చెప్పాడు. రామచంద్రరాయ్ తప్పించుకుని పారిపోయాడన్న సంగతి వినగానే మంత్రి పెద్ద విచారంలోనే పడ్డాడు. ఇంకా కొంతదూరం వెళ్ళాక ఒకచోట కాళ్ళు ముడుచుకుని కూచున్న రమేశభట్టు కనిపించాడు.

"మంత్రిగారూ! జాంబవంతుడుగారూ! రండి దయ చేయండి" అన్నాడు రమేశభట్టు ఆయన్ను చూడగానే. అని పండ్లికిలించి నవ్వసాగాడు.

అంత ఆదరంగా పిలుస్తున్న రమేశభట్టుతో మంత్రి ఒక్కమాటయినా పలకలేదు; అతనికేసి తిరిగైనా చూడలేదు. ఒకసేవకుడిని పిల్చి "ఇతన్ని నావెంట తీసుకురా" అని ఆజ్ఞాపించాడు. ఆ మూర్ఖుడిని తీసుకుపోయి క్రుద్ధుడైయున్న రాజుగారిముందు నిలువబెడదామని అతని ఉద్దేశం. రాజుగారి వజ్రాయుధం ఎవరిమీదనో పడితీరవలసిందే, తప్పదు. అది ఈ అరటిచెట్టుమీద పడనిస్తే మంచిది. మిగతా పెద్దపెద్ద వృక్షాలన్నీ బ్రతికిపోతాయి. అదీ మంత్రి ఆలోచన.

రమేశభట్టును చూడగానే రాజు దావాగ్నిలా అయిపోయాడు. రాజును సంతోషపెట్టాలన్న ఉద్దేశంతో రమేశభట్టు ఒక విపరీత భంగిమలో నిల్చున్నాడు; పండ్లికిలించాడు. హాస్యరస పిచ్ఛలంగా ఏమో మాటాడబోయాడు. రాజుకు ఎక్కడలేని అసహ్యం పుట్టుకువచ్చింది. కూచున్న చోటునుంచి లేచాడు. రెండుచేతులూ విసురుతూ "ఇతన్ని నా ముందు నుంచి అవతలికి గెంటివెయ్యండి. తీసుకుపొండి అవతలికి. ఎవరు

తీసుకురమ్మన్నారితన్ని ఇక్కడికి" ? అన్నాడు తీవ్రంగా అస హ్యించుకుంటూ. ప్రతాపాదిత్యుడాసమయాన నిజంగా చాల కోపంగా ఉన్నాడు. అంతకోపంలో ఆ ఏహ్యాభావం కలగబట్టి సరిపోయిందిగాని, లేకపోతే ఆక్షణాన రమేశభట్టు బ్రతుకు బుగ్గిపాలైపోయేదే. చంపాలన్నా దగ్గరకు వెళ్ళి కత్తితో స్పృశించాలిగా! అటువంటి అసహ్యకరమైన ప్రాణిని ప్రతా పాదిత్యుడు స్పృశిస్తాడా! సేవకులు వచ్చి రమేశభట్టును దూరంగా తీసుకుపోయారు.

"మహారాజా! అల్లుడుగారు..." ఏమో చెప్పబో యాడు మంత్రి.

రాజు తల ఊపుతూ "ఊం– రామచంద్రరాయ్..." అన్నాడు.

"చిత్తం. వారు రాత్రే ఊరు విడిచి వెళ్ళిపోయారు."

రాజు స్తంభాకృతిగా నిల్చుండిపోయాడు. "విడిచి వెళ్ళి పోయాడా? కావలావాళ్ళంతా ఎక్కడ చచ్చారు?"

"బయటి ద్వారందగ్గర కావలావాళ్ళంతా పారిపో యారు."

రాజు చేతులు పిడికిళ్ళు పట్టాయి. "పారిపోయారా? పారిపోతేమాత్రం ఎక్కడికిపోతారు? అందర్నీ పట్టించి ఇప్పుడు నాదగ్గర హాజరుపెట్టవలిసిందే. అంతఃపురంలోని కావలావాళ్ళను నాదగ్గరకు పంపించండి ఇప్పుడే." మంత్రి వెళ్ళిపోయాడు.

రామచంద్రరాయ్ నావలో ఎక్కి వెళ్ళిపోయినరాత్రి వెన్నెలకూడాలేదు; బాగాచీకటిపడింది. ఉదయాదిత్యుడు; వసంతరాయ్, సురమ, విభ తిరిగిచ్చారేగాని ఎవరూ

నిద్రపోలేదు. విభ మౌనంగా, చైతన్యమేలేనట్టు నేలమీద పడుకుంది. కన్నీళ్ళుకూడా ప్రవహించటం ఆగిపోయాయి. ప్రక్కనే సురమకూచుని వుంది మెల్లగా తలనిమురుతూ. ఉదయాదిత్యుడు, వసంతరాయ్ మౌనంగా కూచునివున్నారు. చీకటిలో ఒకరిముఖం ఒకరికి స్పష్టంగా కనిపించటం లేదు. గదినిండా నిశ్శబ్దం, అంధకారం, భయోత్పాతం! ఉచ్ఛ్వాస నిశ్వాసల శబ్దం కూడా వినిపిస్తోంది. అనుక్షణమూ ఆనందంగా కాలక్షేపం చేస్తూఉండే వసంతరాయ్‌కి చుట్టూ నిరానందమే కనిపిస్తూ ఉండేసరికి పూర్తిగావ్యాకులచిత్తుడై పోయాడు. మాటిమాటికీ బట్టతల తడువుకుంటున్నాడు. ఊరికే నాలుగువైపులా గుడ్లుపెట్టి చూస్తున్నాడు. 'అయ్యయ్యో! ఇలాగైందేమిటి' అని అనుకుంటున్నాడు. ఏమిటో అయోమయంగా ఉంది మనిషికి. ఏమీ బోధపడటంలేదు. జరిగిన సంఘటనయావత్తూ ఒక దుస్స్వప్నంలా వుంది. ఉండి ఉండి ఉదయాదిత్యుని చేయిపట్టుకుని 'దాదాభాయీ!' అని పిలుస్తాడు. 'ఏమిటి తాతయ్యగారూ?' అంటాడు ఉదయాదిత్యుడు. కాని వసంతరాయ్ జవాబేమీ చెప్పడు. ఒక్క 'దాదాభాయీ' అన్న పిలుపులోనే తనలోని మర్మవేదన యావత్తూ వ్యక్తమై, వేలాదిమూగ ప్రశ్నలకు జవాబులు కోరుతున్నాడన్నమాట. 'ఏమిటిది? ఇలా అయిందేం?' అన్నదే ఆ వేలాది ప్రశ్నల సారాంశమైన ఏకైకప్రశ్న. నాలుగువైపులా వ్యాపించివున్న అంధకారం అతని చెవులదగ్గర గడబిడగా ఏమి చెబుతున్నదో! ఏ భాషలో చెబుతున్నదో! అతని కేమాత్రం అర్థం కావటంలేదు.

ఇటువంటిసమయంలో ఉదయాదిత్యుడు పలికే 'తాతయ్యగారూ' అన్నపదం కాస్త ఓదార్పు ప్రసాదిస్తున్నది. 'దాదా భాయీ! నా మూలాన్నే కదూ ఇదంతా ఇలాజరిగింది!' అని అడుగుతున్నాడు ఉండిఉండి ఒక్కొక్కసారి. ప్రతాపాదిత్యుడు తలపెట్టిన తన హత్య యథాసమయంలో ముగిసిపోయివున్నట్లయితే...ఇదంతా ఇలా జరిగేదికాదు – అన్నభావం ఒకటి మాటిమాటికీ అతనిమనస్సులో పొడసూపుతూ ఉన్నది. "ఊహుం – కాదు తాతయ్యగారూ!' అని మాత్రం క్లుప్తంగా జవాబు చెప్పి ఊరుకుంటున్నాడు ఉదయాదిత్యుడు; ఎక్కువగా మాటాడేస్థితిలో లేడు తాను. చాలసేపు అందరూ నిశ్శబ్దంగానేఉన్నారు. చివరకు వసంతరాయ్ "విభా! నా తల్లీ! నువ్వు ఒక్కమాటన్నా పలకవేం అమ్మా!" అంటూ ఆమె దగ్గరకు జరిగికూచున్నాడు. కాసేపయాక "సురమా! ఓ సురమా" అన్నాడు. సురమ తలెత్తి అతనివైపు చూచింది. కాని అతని నోటివెంట మళ్ళీ మాటేమీరాలేదు. ఆ వృద్ధుడు తల నిమురుకుంటూ ఏదో ఇంకా రాబోయే ఒక మహాసంకటస్థితిని భవిష్యత్తులో అవలోకిస్తున్నట్టుగా ఉన్నాడు. ఆ సమయంలో సురమ స్థిరంగా కూచుని విభాదేవి తల నిమురుతూ ఉన్నది. ఆమె మనస్సులో ఎట్టిభావాల దొంతరలు సందడిస్తున్నాయో ఆ భగవంతునికే తెలియాలి. ఆ చీకటిలో సురమ ఒకసారి భర్తవైపు చూచింది. అతనప్పుడు గోడను తలానించి కూచున్నాడు; తనలో తాను ఏమాలోచించుకుంటున్నాడో మరి! సురమ నేత్రాల్లోనించి అశ్రువులు ప్రవహించాయి.

ఆ కన్నీళ్ళు విధ ఎక్కడచూస్తారోనని వెంటనే తుడిచివేసు కుంది.

తెల్లవారబోతోంది. వెలుతురు వ్యాపిస్తోంది. వసంత రాయ్ ఒక పెద్దనిట్టూర్పు విడిచాడు – ఆ నిట్టూర్పుతోపాటు ప్రాణం ఊడిపడుతుందా అనిపించేట్టు. అంతటితో రాబోయే సంకటాలనుగూర్చిన భయం తొలగిపోయింది. రాత్రిజరిగిన సంఘటన యాదిత్తూ సింహాసనలోకనం చేసుకున్నాడు. అక్కడి నించి లేచివెళ్ళిపోయాడు సీతారాం దగ్గరకుపోయి "ఇదిగో సీతారాం! నిన్నెవరు ఇలా కట్టిపడేశారు?' అని ప్రతాప్ అడి గితే నా పేరుచెప్పు, తెలిసిందా? ఒకప్పుడు నేను చాల బల వంతుడినన్న సంగతి ప్రతాప్‌కు తెలుసు. నీ మాటనమ్ముతాడు" అన్నాడు.

చాల సేపటినుంచీ సీతారాం అదే ఆలోచిస్తున్నాడు : తన్ను మహారాజు పిలిపించి అడిగితే ఏమిచెప్పాలి అని. ఉదయాదిత్యుని పేరు చెప్పటం అతనికేమాత్రం ఇష్టంలేదు. ఆ చేరువలో ఉన్న ఒక తాటిచెట్టుమీది భూతం తన్ను కదల కుండా బంధించి పారేసిందని చెబుదామని ఒక నిర్ణయం చేసు కున్నాడు. కాని ఇప్పుడు వసంతరాయ్ వచ్చి ఇలా చెప్పేసరికి నిరపరాధి యైన భూతాన్ని క్షమించి విడిచి పెట్టేశాడు. వసంతరాయ్ చెప్పినదానికి ఒప్పుకున్నాడు. ఆ తరువాత వసంతరాయ్ రెండో ద్వారపాలకునివద్దకు వెళ్ళాడు: "ఇదిగో భగవంతం! ప్రతాప్ నిన్ను పిలిపించి అడిగితే అంతా నామీద చెప్పెయ్యి" అన్నాడు. కాని భగవంతంలో ధర్మజ్ఞానం ఆ సమయాన ప్రబలంగా ఉత్పన్నమైంది. దానికి కారణం లేక

పోలేదు: యువరాజు మీద అతనికి చాల కోపంగా ఉంది. "అలాంటి మాటలు నాకు చెప్పకండి మహాప్రభూ! అది చాల అధర్మం." అన్నాడు.

వసంతరాయ్ అతని భుజంమీద చెయివేసి రాస్తూ "భగవంతం! నా మాట విను. ఇందులో అధర్మం ఏమీలేదు. ఒక సత్పురుషుని ప్రాణాన్ని రక్షించేందుకు ఒక చిన్న అబద్ధ మాడటం అధర్మమే అయితే...ఆలాంటి పని చెయ్యమని నిన్ను నేను బలవంతంచేస్తానటోయ్" అన్నాడు. అతని భుజం దువ్వుతూ, వీపు దువ్వుతూ ఒప్పించటానికి చాల ప్రయత్నం చేశాడు - కాని లాభం లేకపోయింది. అకస్మాత్తుగా ధర్మజ్ఞానం మిక్కిలి ప్రబలంగా ఉత్పన్నమైన వాడిముందు యుక్తి పనిచెయ్యట మనేది చాలకష్టం. "కాదులెండి బాబూ! మా కామందులవారి ముందు అబద్ధం ఎలా చెబుతానండీ!" అన్నాడు. వసంతరాయ్ చాల ఖిన్నుడైనాడు. "నా మాట విను భగవంతం! ఇందులో అధర్మం ఏమాత్రం లేదు. లేదని నిన్ను నేను నమ్మించగలను. ఇటు చూడు; నేను నిన్ను చాల సంతోషపెడతానుగా తరువాత. నా మాట మన్నించు, ఇదిగో, ఇప్పటికి నా దగ్గర ఉన్నంతవరకూ తీసుకో - పరవా లేదు, తీసుకో." అన్నాడు అనునయపూర్వకంగా - భగవంతం చెయ్యిచాచి పుచ్చుకున్నాడు. జేబులో పెట్టుకున్నాడు. వసంతరాయ్ నిర్విచారంగా తిరిగి వచ్చేశాడు.

ఆ కావలావాళ్ళిద్దర్నీ రాజదర్బారుకు తీసుకువచ్చారు. లోలోపల రగులుకుంటూన్న క్రోధాన్ని ఒకరకంగా అణుచుకుంటూ రాజు గంభీరంగా కూచున్నాడు సింహాసనంమీద.

"నిన్నరాత్రి అంతఃపురం బైటద్వారం ఎలా తెరచుకుందీ?" అడిగాడు రాజు ఒక్కొక్కమాటే మెల్లంగా స్పష్టంగా ఉచ్చరిస్తూ.

సీతారాంకు ప్రాణాలన్నీ వొణికిపోతున్నాయి. చేతులు రెండూ జోడించి నిల్చున్నాడు. "జయం మహారాజావారికి. నా దోషం ఏమీ లేదండయ్యా!"

"దోషం సంగతి ఎవరడిగారు నిన్ను?"– కనుబొమ్మలు పైకెత్తి బెదరింపుగా అడిగాడు రాజు.

సీతారాం హడావిడిపడుతూ ఇలా చెప్పసాగాడు; "కాదండి మహారాజా! మనవి చేస్తా నుండండి. యువ రాజాగారు, యువరాజాగారు, నన్ను కదలటానికి వీల్లేకుండా కట్టిపారేసి వెళ్ళిపోయారండి దొరా!"– యువరాజు పేరు చెప్ప కూడదని ఎంతగట్టిగా ఎన్నిసార్లుగా మనసులో అనుకుంటూ వచ్చాడో... అంత ఎక్కువగా అతని ధ్యానమంతా యువ రాజుమీదే ఉండిపోయింది; నోటివెంట యువరాజు పేరే వచ్చేసింది. ఒకసారి మాట అన్నతరువాత దాన్ని తిప్పుకోవా లంటే అతనికి చాతకాలేదు.

కాపలావాళ్ళను విచారణకై రాజదర్బారుకు పిలిపిం చారన్న సంగతి తెలియగానే వసంతరాయ్ ఆతృతగా బయలుదేరి వచ్చాడు. అతడు దర్బారు గుమ్మంలోకి అడుగు పెడుతూవున్నప్పుడు సీతారాం చెబుతున్నాడు: "యువరాజా వారికి నేనెంతో బ్రతిమాలి చెప్పాను కూడానండి – కాని వారు–"

"ఆఁ-ఆఁ- సీతారాం! అబద్ధాలు చెబుతావా? తప్పా కామా! అంత అధర్మానికి దిగజారావుటోయ్! ఇందులో యువరాజు తప్పేంలేదు" అన్నాడు వసంతరాయ్ వెంటనే అందుకుని

"కాదు - లేదు మహారాజా! యువరాజావారి తప్పేం లేదు" అన్నాడు శీతారాం వణికిపోతూ.

"అయితే తప్పెవరిదంటావు? నీదేనా?" రాజు గర్జిస్తూ అడిగాడు.

"కాదు-కాదు- మహారాజా!"

"ఎవరిది మరి తప్పు?"

"చిత్రం మహారాజా-"

రాజు భగవంతాన్ని కూడా విచారణ చేశాడు. అతను సర్వం ఉన్నది ఉన్నట్టుగానే చెప్పేశాడు. ఒక్క తాను నిద్రపోతున్న సంగతి మాత్రం దాచిపెట్టాడు. వృద్ధ వసంతరాయ్ ఆలోచిస్తూ కూచున్నాడు. అతనికేమీ ఉపాయం తోచలేదు. ఆ యిద్దరు కాపలావాళ్ళనూ పనిలోనుంచి తొలగించటం జరిగింది. ఇతర్ల చేత ఇంత తేలిగ్గా నిర్బంధితులయ్యే బలహీనులు ద్వారపాలకత్వ ఉద్యోగానికెందుకు రావాలి? అదే వాళ్ళు చేసిన మహాపరాధం. అందుకు బాగా కొరడా దెబ్బల శిక్ష విధించటమైంది. దర్బారులోనుంచి అందరూ వెళ్ళిపోయారు - ఒక్క వసంతరాయ్ తప్ప.

"ఈ తప్పుకు శిక్ష ఉదయుడు అనుభవించి తీరవలసిందే. అతన్ని క్షమించేందుకు వీల్లేదు" అన్నాడు ప్రతాపాదిత్యుడు వసంతరాయ్ ముఖంలోకి చూస్తూ తీక్షణ గంభీర కంఠ

స్వరంతో. ఉదయాదిత్యుని అపరాధమంతా వసంతరాయ్ దే నన్న భావం ధ్వనిస్తోంది ఆ మాటాడిన తీరులో. ఎదురుగా ఉదయాదిత్యు డున్నట్టూ, అతన్ని మందలిస్తున్నట్టూ ఉన్నదా పలికిన రీతి. ఇంతకూ వసంతరాయ్ చేసిన అపరాధం ఏమిటీ? తన ప్రాణంకన్నా ఎక్కువగా ఉదయాదిత్యుని ప్రేమిస్తూ ఉండటమే.

"నాయనా! ప్రతాప్! ఇందులో ఉదయాదిత్యుని తప్పేమీ లేదోయ్!"

వసంతరాయ్ పలికిన ఆమాటతో ప్రతాపాదిత్యునికి వొళ్ళు మండిపోయింది. "తప్పేం లేదు! వాడి తప్పేం లేదని నువు చెబుతున్నావూ అంటే – ఇంకా ఎక్కువ కఠినంగా వాడిని శిక్షించా లన్నమాటే. మధ్యలో నువు కల్పించుకుని పూసుకోవ్డా వెందుకూ? నీకే మవసరం?"

వసంతరాయ్ ఉదయాదిత్యుని పక్షంగా మాటాడు తున్నకొద్దీ, ప్రతాపాదిత్యునికి కొడుకుమీద కోపతాపాలే పెరిగిపోతున్నాయి. తనమూలాన ప్రత్యేకంగా ఉదయాదిత్యునికి కఠినదండనఎక్కడలభిస్తుందోనన్న భయంతో వసంతరాయ్ మాట, పలుకు మానేసి, నోరు నొక్కుకొనికూచున్నాడు.

కొంతసేపటికి ప్రతాపాదిత్యుని మనస్సు కాస్త శాంత పడ్డది. "ఉదయునికి ఒక మనశ్శక్తి, ఒక అభిప్రాయం, ఒక ధ్యేయం ఉన్నట్టు నే ననుకోను. ఏ పనీ తాను స్వయంగా సంకల్పించి చెయ్యలేడు. అమాయకుడు. మరొకరి కటాక్షానుసారం మెలగుతూ ఉండేవాడే. ఆ సంగతి నాకు తెలుసు. లేకపోతేనా? ఇవాళ అతను ఏమైపోయేవాడో! అతడు

ఏయే తోటివల్లో నడుస్తున్నాడో పరికిస్తూంటే అతనికి పోలితాన్ని హామిస్తున్న ఆ కటాక్ష విన్యాసాలు కూడా నేను గమనిస్తూనే ఉన్నాను. అందుచేత అతన్ని శిక్షించాలన్న కోరికే నాకు కలగటం లేదు. శిక్షించతగినవాడూ కా దతను. కాని, వింటున్నావా పెదనాన్నా! నువ్వు మళ్ళీ యశోహర్‌కు వచ్చి ఉదయాదిత్యునితో కలసి మాటాడేవంటే చాలు...ఇక వాడు జీవితాశ వదలుకోవలసిందే."

వసంతరాయ్ మాటాడకండా చాలసేపు అలానే కూచున్నాడు. చివరకు లేచాడు, "సరే అయితే ప్రతాప్! నేను ఈ సాయంత్రానికే వెళ్ళిపోతున్నాను" అన్నాడు. అంతే, ఇంకొక్కమాటకూడా పలకలేదు. ఒక్క నిట్టూర్పు విడిచి వెళ్ళిపోయాడు.

ఎవరు ఉదయాదిత్యుని ప్రేమిస్తున్నారో వాళ్ళనూ... ఉదయాదిత్యు డెవరిమాటను ఎక్కువగావింటాడో వాళ్ళనూ - ఉదయాదిత్యునితో ఏవిధమైన సంబంధమూ లేకండా దూరంగా పంపించివెయ్యాలిసిందే నన్న నిశ్చయానికి వచ్చాడు ప్రతాపాదిత్యుడు. వెంటనే మంత్రిని పిలిపించి చెప్పేశాడు: 'కోడల్ని ఇక అంతఃపురంలో ఉంచుకోటానికి వీల్లేదు. ఏదోవంకను ఆవిడను పుట్టింటికి పంపించి వెయ్యాలిసిందే" అని. విభాదేవి మీద అతని కేమీ అనుమానంలేదు. ఏమైనా ఇంటిబిడ్డకదా!

# 13

వసంతరాయ్ ఉదయాదిత్యుని గదిలోకి వెళ్ళాడు. "దాదాభాయీ! ఇక నేను మళ్ళీ ఈ జన్మలో నిన్ను చూడ్డం

సంభవించదు బాబా!" అంటూ మనుమడిని కావిలించుకుని గుండెకు హత్తుకున్నాడు.

"ఎందుకని తాతయ్యగారూ? అలా అంటారేం?" అన్నాడు ఉదయాదిత్యుడు చేయిపట్టుకుని.

వసంతరాయ్‌కి దుఃఖం పొర్లి వచ్చింది. "నీ మీద నాకు పట్టరాని ప్రేమ. అందువల్లనే నీకు కష్టాలు దాపరిస్తున్నాయి. నువ్వు సుఖంగా ఉంటే చాలు నాయనా! నే నింకా ఎన్నాళ్ళు బ్రతుకుతాను? ఈ నాలుగు రోజులూ...నిన్ను చూడలేకపోయినా ... ఏదోవిధంగా వెళ్ళబుచ్చుకుంటాను."

ఉదయాదిత్యుడు తల అడ్డంగా తిప్పాడు. "ఊహుం – అలా వల్లగాదు తాతయ్యా! కలుసుకుంటూ వుండవలసిందే – దానికెవరూ ఆటంకం కలిగించలేరు. మిమ్మల్ని చూడకపోతే నేను బ్రతకలే నసలు"

వసంతరాయ్ చాల వ్యాకుల చిత్తుడైనాడు. "ప్రతాప్ నన్ను చంపివెయ్యలేడు. నా కౌగిలిలోనించి నిన్నుమాత్రం లాగివేశాడు దాదాభాయీ! నేను వెళ్ళిపోయాక నాసంగతే మరచిపో బాబూ! నేను చచ్చిపోయాననే అనుకో"

ఉదయాదిత్యుడు సురమదగ్గరకు వెళ్ళాడు. వసంతరాయ్ విభదగ్గరకుపోయి, ఆమెగడ్డం పుచ్చుకుని "విభా! నా చిట్టితల్లీ! ఒక్కసారి లే అమ్మా! ఈ ముసలితాత తలమీద నీ చేత్తో నిమురు తల్లీ!"అన్నాడు. విభ లేచి తాతగారి తల నిమురుతూ తెల్ల వెంట్రుకలుచూస్తూ నిలబడ్డది.

ఉదయాదిత్యుడు సురమ కన్ని సంగతులూ చెప్పాడు: "నా కున్నది యావత్తూ నా చేతుల్లోనించి లాగి అవతల పారే

య్యటానికి గొప్ప పన్నాగమే సాగుతోంది సురమా!'' అని కాసేపు ఊరుకుని "సురమా! ఆఖరుకు నిన్నుకూడా నా చేతుల్లోనించి లాక్కుపోతే ఎలాగ?" అన్నాడు, ఆమె చేయి అంది పుచ్చుకుని.

మరుక్షణమే సురమ భర్తను గట్టిగా కౌగిలించుకుంది. "ఒక్క యమధర్మరాజు తప్ప మరింకెవరూ ఆ పని చెయ్యలేరు" అన్నది.

చాలసేపటినించి సురమ హృదయంలోకూడా ఇలాంటి భయమే సందడిస్తూ ఉంది. తన కౌగిలిలోనించి తన భర్తను బలవంతాన గుంజుకు పోయేందుకని ఏదో ఒక కఠోరహస్తం మున్ముందుకు సాగివస్తున్నట్టుగా ఆమెకు కనిపించింది. గట్టిగా, బలంకొద్దీ భర్తను తన గుండె కదుముకున్నది. 'ఉహుఁ - నేను విడిచిపెట్టను. ఈ నా కౌగిలి ఎవరూ సడలించలేరు' అనుకుంది మనసులో. "మీ నుండి నేను ఒక్కనాటికీ వేరైపోను. నన్ను మీనుండి ఎవరూ వేరుచేయ్యలేరు" అన్నది. అదేమాట చాలసార్లు అన్నది. ఉదయాదిత్యుని తన కౌగిలిలోనించి ఎవరూ లాక్కుపోవటానికి వీల్లేనంత బలాన్ని సమకూర్చుకోవాలని ఆమె సంకల్పం. అటువంటి దైవబలం - భౌతికబలం కాదు - చేకూర్చుకోవాలని ఆమె సంకల్పం. ఈ సంకల్పనించి యెట్టి భౌతికశక్తీ తన్ను తొలగింపజాలదు. ఇలా మాటిమాటికీ అనుకుంటూ తన మనస్సుకు వజ్రసన్నిభమైన బలాన్ని సంచితం చేసుకుంటున్నది.

"సురమా! తాతయ్యగారిని ఇక మళ్ళీ మనం చూడ లేము." అన్నాడు ఉదయాదిత్యుడు ఆమె ముఖంలోకి చూస్తూ.

సురమ మాటాడలేదు. ఒక్క నిట్టూర్పు విడిచింది. "నా కష్టాల్ని గురించి నాకేం చింత లేదు. సురమా! కాని తాతయ్యగారిసంగతి తలచుకుంటే నా గుండె పగిలిపోతున్నది. ఇంకా ముందు భగవంతుడేమి చేయనున్నాడో కదా! ఆయన మనసులో ఎంత బాధ పడుతున్నాడో ఎవరికి తెలుసు?" అంటూ ఉదయాదిత్యుడు తాతగారినిగురించి ఎన్నో విష యాలు చెప్పసాగాడు. అది అంతం లేకుండా చెబుతూనే ఉన్నాడు. ఒకటి తరువాత ఒకటి చాలా సంగతులు జ్ఞాపకం వస్తున్నాయి. అన్నీ చెప్పుకుపోతున్నాడు.

"తాతయ్యగారిని గురించి మనం మాటల్లో ఏం చెప్ప గలం? అలాంటిమనిషి ప్రపంచంలో నభూతో న భవిష్యతి."

ఆ తరువాత ఇద్దరూ లేచి విభాదేవిగదికి వెళ్ళారు. విభాదేవి తాతయ్యతల నిమురుతూవుంది. తాతయ్య కూచుని పాట పాడుతున్నాడు—.

జగం బిదంతా క్రీడారంగము
ఈ మన జీవిత మొక లీల,
తోటి స్నేహితులు దాటిపోయిరీ
ఆట ముగిసె నిక జాగేలా?

ఉదయాదిత్యుని చూడగానే వసంతరాయ్ ఒక నీరసపు చిరునవ్వు ప్రదర్శించాడు. "చూచావా దాదాభాయీ! విభ నన్నెంతసేపటికీ విడిచిపెట్టటంలేదు. నా ప్రయాణంసంగతి విని

ఏడుపు మొదలుపెట్టింది. పిచ్చి పిల్లంటావా; లేదా? నువ్వే చెప్పు. ఇక నే నీ యేడుపుచూడలేను బాబూ! ఇదిగో, ఇటు చూడు, చిట్టితల్లీ! నువు ఇలా ఏడుస్తూఉన్నావంటే-" వసంత రాయ్ కంఠం రుద్ధమైపోయింది. మాటరాలేదు. విభను సము దాయించవలసివాడు తానే ఏడుపుసాగించాడు. కాని వెంటనే కన్నీళ్ళు తుడుచుకున్నాడు. "చూడు దాదాభాయీ! సురమ స్వైవహారంచూడు. ఆమెకూడా ఏడుపు ఆరంభించింది. ఇక నేనేం చేసేది? మీరంతా కలిసి ఇలా చేస్తుంటే ఇక నే నిక్కడే ఉండిపోవలసి వచ్చేట్టుంది."

ఎవరూ, ఏం మాటాడకండా ఉండటం చూచి వసంత రాయ్ మరీ వ్యాకులచిత్తుడైపోయాడు. సితార్ అందుకున్నాడు. జోరుగా వాయించటం మొదలుపెట్టాడు. కాని విభాదేవి కన్నుల్లో అశ్రువులు చూచేసరికి వాయించలేకపోయాడు. కన్నులకు చీకట్లు కమ్మినట్లయింది. ముగ్గుర్నీ బాగా తలవాచేట్టు చీవాట్లు పెడితేగాని ఏడుపు మానెయ్యరేమో ననిపించింది. కాని నోట్లోనించి మాట పెగిలివస్తే కదూ! కంఠం రుద్ధమై పోయింది. సితారు అవతలపెట్టేశాడు.

చివరకు ప్రయాణమై వెళ్ళిపోయేటప్పుడు ఉదయాది త్యుని చాలసేపు కావిలించుకుని "నా సితారు ఇక్కడే విడిచి పెట్టి పోతున్నాను. ఇక నేనది వాయించేదిలేదు - అమ్మాయి సురమా! సుఖీభవ! - విభా -" మాట పూర్తిచెయ్యలేక పోయాడు. కన్నీళ్ళు తుడుచుకుంటూ వెళ్ళి పల్లకిలో కూచున్నాడు.

# 14

ఊరిబయట ఒకమూల ఉన్నది మంగళాంబ యిల్లు జపమాల త్రిప్పుచూ ఇంట్లో కూచుందామె. సంతలో ఆ ఈ సరుకులు కొనుక్కొని, అన్నీ ఒకబుట్టలో పెట్టుకుని రాణీగారి దాసీ — మాతంగిని దానిపేరు — మంగళాంబయింటికి వచ్చింది. "సంతకుపోయి వస్తున్నాను. మంగళాంబ అక్కయ్యను చూచి చాల రోజులైంది. ఒకసారి చూచిపోదామని బుద్ధిపుట్టి ఇలా వచ్చాను. ఇవాళ నాకు చాల పనివుంది. ఎక్కువసేపు ఇక్కడ కూచోవటానికికూడా వీల్లేదు" అంటూ బుట్ట దించుకుని తీరుబాటుగా కూచుంది. "నీకు తెలుసుగా అక్కయ్యా! మా ఆయనకు నా మీద ఎంత మోజు! ఇప్పటికీ మోజు లేకపోలేదనుకో, కాని ఇంకెవతిమీదనో మనసు తగుల్కొని కాస్త నాతో ఎడాపెడగా ఉంటున్నాడులే. నేనంతా గాలించి తెలుసుకున్నాను. కాబట్టి అక్కా! నువు నాకు చెయ్యాలిసిన సాయం ఏమిటంటే — మూణ్ణాళ్ళలో ఆ నా సవితి రూపీమని చచ్చిపోవాలి."

'పిల్లిమారకం' దగ్గరనించీ, 'మొగుడిమారకం' వరకూ కావల్సిన అన్నిమందులూ మంగళాంబదగ్గర దొరుకుతాయి. అంతేగాక వశీకరణయంత్రాలు, మంత్రాలుకూడ ఆమెకుబాగా తెలుసు. అందుచేత రాజభవనంలోని నౌకర్లు, పరిచారికలు ఆవిడద్వారంముందు దర్శనంకోసం పడిగాపులు పడివుంటారు ఎప్పుడూను. ఏ తన సవితి మూన్నాళ్ళలో చనిపోవాలని

మాతంగిని కోరుకుంటున్నదో ఆ వగలాడి మరెవ్వరో కాదు; తానే – మంగళాంబే.!

మంగళాంబ తనలో తాను నవ్వుకుంది. మనస్సులో ఇలా అనుకుంది: "నువ్వు చాలా లనుకుంటున్న చంచలాక్షి అప్పుడే చచ్చిపోదే మాతంగినీ! యమధర్మరాజువనికి ఇంకా బాగా చేయూత ఇచ్చిగాని తాను చావదు." మాతంగిని ముఖంలోకి నవ్వుతూచూచి పైకి ఇలాఅన్నది: "నీవంటి అంద గత్తెనుకూడా కాదని మరింకొక తెమిరాద నుగులుకొనే అరసి కుడుకూడా ఉంటాడా? సరేలే, నువ్వేం భయపడుబోకు. మళ్ళీ నీ కాళ్ళముందుకే వస్తాడులే. అందుకు మందు నీ కళ్ళ లోనే ఉంది. కొంచెం ఎక్కువగా వయ్యారం ఒలికించిచూడు, చాలు. అదికూడా పనిచెయ్యకపోతే; ఒక మూలికనిస్తాను; తాంబూలంలో పెట్టి తినిపించావంటే వశమైపోతుంది" అంటూ లోపలికి వెళ్ళి మూలిక తెచ్చి ఇచ్చింది. ఇస్తూ అడిగింది: "మీ రాజభవనంలో కబుర్లేమిటి, చెప్పవేమే!"

"ఆ గొడవలన్నీ మనకెందుకులే అమ్మా" అన్నది మాతంగిని అరచేతులు తలకిందుచేస్తూ.

"ఔనౌను, నిజమే. మనకెందుకులే –"

మంగళాంబ అలాగ తన మాటతో ఏకీభవిస్తుందని మాతంగిని అనుకోలేదు. చిక్కే వచ్చింది. "అయినా నీకు చెప్పేందుకు ఏముందీ? ఇంతకు – నేను దబ్బున వెళ్ళా లమ్మా! మరోనాడు వచ్చి చెబుతాలే" అని అన్నదేగాని వెళ్ళిపోడానికి లేవలేదు. తీరిగ్గా అలాగే కూచుంది.

"సరేలే; ఇంకెప్పుడైనా వచ్చి చెబుదువు గానిలే."

మాతంగినికి సంతృప్తి కలుగలేదు. "అయితే వెళ్ళిపోతాను అక్కా! ఆలస్యం చేశానంటే చీవాట్లు తగులుతాయమ్మా! నువు విన్నావో లేదో అక్కా! రాజుగారి అల్లుడుగారు వచ్చారా, ఆనాడు! వచ్చిన రోజు రాత్రే ఎవ్వరికీ చెప్ప కండా వెళ్ళిపోయారు."

"అలాగనా? ఎందుకు వెళ్ళిపోయాడబ్బా! అంతఃపు రంలోని రహస్యాలు నీకుతప్ప మరెవరికీ బాగా తెలియవు; ఆ సంగతి నే నెరగనూ!"

ఆ ప్రశంసా వాక్యంతో మాతంగిని ఉబ్బిపోయింది. "అసలు సంగతేమిటో తెలుసా? మా రాజుగారి కోడల్ని ఎరుగుదువుగా! ఆ తల్లి యితర్ల మంచి చూచి ఓర్చలేదు. యేం మంత్రాలు, యేం మాయలు నేర్చిందో గాని మొగుడిని ఇట్టే బుట్టలో వేసేసుకుంది. ఆవిడేం చేసిందను కున్నావు?...పోనీలే - గొప్పవార్ని గురించి మనమెందుకు అయ్యా కబుర్లు చెప్పుకోటం? ఎవరన్నా విన్నారంటే తంటా వస్తుంది."

మంగళాంబ కుతూహలం ఆపుకోలేకపోయింది. కాసేపు ఊరుకుంటే అంతా మాతంగినే చెప్పుకొస్తుంది. కాని ఉండబట్ట లేకపోయింది. "ఇక్కడెవరున్నారనీ? నువ్వూ నేనేగా! ఏమైనా మనిద్దరిమధ్యా ఉండాల్సిందేగాని పైకేం పోదు. ఇంకా భయ మెందుకూ? ఏమన్నావు? రాణీగారి కోడలు ఏం జేసిందీ?"

"ఆవిడగారు విభాదేవిమీద ఏమేమి చాడీలు చెప్పిందో మరి అల్లుడిగారికి...ఆయనగారేమో రాత్రికి రాత్రే మూట ముల్లె కట్టుకుని వెళ్ళిపోయాడు. విభాదేవి నెత్తి నోరు బాదు కుని యేడ్చినా కనికారం లేకుండా దాటిపోయాడు పాపం అమ్మాయిగారు అలా పడి యేడుస్తూవుంది. ఇదంతా విని మహారాజావారికి వొళ్ళు మండిపోయింది. ఇప్పటి కిప్పుడు కోడల్ని పుట్టింటికి పంపించేయాలని చూస్తున్నారు...అదేమిటి? అలా నవ్వుతావేం? ఇందులో పరాచకం యేముందీ?"

రామచంద్రరాయ్ రాత్రికి రాత్రే పారిపోవటానికి గల యధార్థ కారణం అంతఃపురంలో నౌకర్లకు, దాసీలకూ అందరికీ తెలుసు. కాని వాళ్లు బైటకి నచ్చి తలా ఒకరీతిగా చెబు తున్నారు. ఒకరు చెప్పినదానికీ, ఇంకొకరు చెప్పినదానికీ పోలికే వుండటంలేదు. అందుకే మంగళాంబ నవ్వింది.

"ఇదిగో, నువు వెళ్ళి మీ రాణీగారితో ఒక్కసంగతి చెప్పాలి: 'కోడల్ని ఇప్పుడే పుట్టింటికి పంపించివెయ్యాలసిన అవ సరంలేదు. మంగళాంబ చక్కని మందు యిస్తుంది. దానితో యువరాజుగారికి ఆమె పొడ గిట్టకండా యిట్టె మారిపోతాడు; యేం పరవాలేదు' అని చెప్పు." మంగళాంబ కిలకిలా నవ్వు సాగింది.

"సరేలే; వెళ్ళగానే చెప్పేస్తాను" అన్నది మాతంగిని.

"యువరాజుకు పెళ్లాంమీద అంత మమకారం ఉందేం?"

"ఇంకా అడుగుతావేం? ఆవిడను చూడకపోతే క్షణం ఉండలేడు. ఎక్కడున్నాసరే, కాకిచేత కబురంపిందంటే చాలు రెక్కలు కట్టుకువచ్చి వాల్తాడు ఆమె దగ్గర."

"సరే చక్కని మందే యిస్తాను. ఇంతకూ ఒకమాట చెప్పు: పగటిపూటకూడా పెళ్ళాందగ్గరే వుంటాడా?"

"ఆఁ"

"అయ్యో రామా! అయితే ఆమె ఆయనతో యేం మాటాడుతుందో, యేం చేస్తుందో నీకు తెలియకుండా వుంటుందా?"

"హుఁ - నా కదేమీ తెలియదమ్మా!"

"పోనీ, నువు నన్నొకసారి యెప్పుడైనా అంతఃపురం లోకి తీసుకుపోతావా? వ్యవహారం యెలావుందో చూస్తా."

"ఏం అక్కా! నీ కెందుకు అంత తలనొప్పి?"

"ఏమీ లేదు. ఒక్కసారి వెళ్ళి చూస్తే నాకు అర్థ మౌతుంది, ఏ మంత్రం వేస్తే పారుతుందా అనేది. అసలు మన మంత్రా ఆయనమీద పారుతుందో లేదోకూడా తెలుసుకో వాలిగా!"

"సరే అయితే; ఇక నేను పోతాను; మళ్ళీ ఎప్పుడైనా వస్తాలే" అంటూ మాతంగిని బుట్ట ఎత్తుకుని వెళ్ళిపోయింది.

మాతంగిని వెళ్ళిపోయాక మంగళాంబ ఒక త్రాచు పాములా వొళ్ళు విసుచుకుంది. కంటిపాపలు పైకి మిటకరిం చింది, పళ్ళు పటపట కొరికింది. ఏమేమి గొణుక్కుందో మరి!

# 15

వసంతరాయ్ ప్రయాణమై వెళ్ళిపోయాడు. విభాదేవి మేడపైకి వెళ్ళి నిల్చుని చూస్తున్నది; తాతయ్యా పాలకీ సాగి పోతూ ఉన్నది. వసంతరాయి పలకీలోనుంచి ముఖం బైటపెట్టి

వెనక్కు చూస్తూ ఉన్నాడు. చీకటిపడుతోంది. అతని కన్నుల్లో నుంచి అశ్రువులు ప్రవహిస్తున్నాయి. ఆ పరిస్థితుల్లో అతని దృష్టికి దట్టపు పొగమంచు కప్పులా కనిపిస్తున్నది. ప్రతాపాదిత్యుని రాజప్రాసాదం - మార్పులేని, చలనంలేని పాషాణమయమైన రాజప్రాసాదం. పల్లకీ కనుచూపు మేర దాటిపోయింది. కాని విభ అక్కడే ఆలాగే నిల్చుని చూస్తూనే ఉంది. నక్షత్రాలు మొలిచాయి,దీపాలు వెలిగాయి; వీధుల్లో జన సంచారం కూడా బాగా తగ్గింది. విభ అలాగే నిల్చుని పల్లకీ వెళ్ళిపోయిన దోవవైపే నిశ్చలంగా శూన్యదృక్కులు బరపుతూ ఉంది. ఆమెకోసం సురమ తెగ వెతికింది. ఎక్కడా కనిపించక పోయేసరికి చివరకు తానూ మేడమీదికి వచ్చింది. "ఏమిటి చూస్తున్నావు విభా!" అన్నది మెడ కావిలించుకుంటూ. "ఏం చూస్తున్నానో నాకే తెలియదు" అన్నది విభ ఒక నిట్టూర్పు విడుస్తూ. నిజానికి ఆమెకంతా శూన్యంగానే కనిపిస్తోంది. మనసు కేమాత్రం సుఖం లేదు. తాను గదిలోకి ఎందుకు వెడుతుందో, ఎందుకు బయటికి వస్తుందో, నిద్ర ఎందుకు పోతుందో, ఎందుకు మేలుకొంటుందో, అర్థరాత్రివేళ లేచి ఇటూ అటూ ఎందుకు పచార్లు చేస్తుందో తనకే తెలియదు. ఈ రాజప్రాసాదం తనయిల్లు కాదా? తన యిల్లన్నది ఎక్కడా లేనేలేదా? తనజన్మ, ఆటలు, పాటలు అన్నీ ఈ రాజప్రాసాదంలోనేగా నిన్న మొన్నటి వరకూ? ఇవాళ ఇది తనయిల్లు కాకండా ఎలాపోయింది? తనమీద ఎంతో అపేక్షగల తాతయ్యకూడా వెళ్ళిపోయాడు. చంద్రద్వీపం నించి తన్ను తీసుకు పోవటానికి ఎవరు వస్తారు?

బహుశా రామమోహన్ వస్తాడా? అన్నయ్యకు తనమీద మంచి అపేక్ష. వదినెకూడా తన్నెంతో ప్రేమగా చూస్తుంది. కాని వాళ్ళకూ కష్టాలే వచ్చిపడుతున్నాయి! ఏమి కానున్నదో ఎవరి కెఱుక!

సీతారామ్‌కు ఉద్యోగం ఊడిపోయింది. చాల యిబ్బందిలో వున్నాడన్న సమాచారం ఉదయాదిత్యునికి తెలసింది. సీతారాం చాల బీదవాడు. బోలెడంత సంసారం అతని మీద ఆధారపడివుంది. సీతారామ్‌కీ, భగవంతానికీ ఉదయాదిత్యుడు కొంత సహాయం చేశాడు. సీతారామ్ డబ్బు పుచ్చుకున్నాడు; కాని చాల సంకోచిస్తూ సిగ్గుపడుతూ పుచ్చుకున్నాడు. మహారాజా వారిముందు ఉదయాదిత్యుని పేరుచెప్పి చాల తప్పుచేశానని ఇప్పటికీ మనసులో ఎంతైనా బాధపడుతూనే ఉన్నాడు. చివరకాయన డబ్బు ఇస్తుంటే పుచ్చుకుని ఏడ్చాడు. ఆయన పాదాలకు నమస్కారం చేశాడు. 'మీరు దయామయులు, భగవంతుడే మీరు' అన్నాడు. 'మహారాజా వారముందు నేను మీపేరెత్తి చేసిన అపరాధాన్ని మన్నించండి' అంటూ వేడుకున్నాడు. భగవంతం అలా కాదు; అతని ప్రకృతి వేరు. అతడు చదరంగం ఆడతాడు; చుట్టలు కాలుస్తాడు; ఇరుగుపొరుగు వారితో చాల ముభావంగా ఉంటాడు. యువరాజు ఇచ్చిన డబ్బు చక్కగా పుచ్చుకున్నాడు. వెళ్ళాడు. యువరాజు మూలాన నే నన్నిందాలా చెడిపోయాను. ఈ కాసిని రూపాయలు నా ముఖాన పారేసి, చేసిన అపకారాన్ని కప్పిపుచ్చు కుందామనుకున్నాడు కామాలు!' అన్నాడు ముఖం అదోరకంగా పెట్టి చేతులు

తిప్పుకుంటూ. కాని డబ్బు మాత్రం ఆయన ఇవ్వటం నీ తరువాయి; నిస్సంకోచంగా పుచ్చేసుకున్నాడు.

పనిలోనించి తీసివేయబడిన కాపలావాళ్ళందరికీ యువ రాజు ప్రతినెలా జీతాలు ఇస్తున్నాడన్న సంగతి మహారాజా వారికి తెలిసింది. పూర్వంలా అయితే ఆయనకు తెలియక పోయేదే. ఇదివరకల్లా రాజుకు ఉదయాదిత్యుడంటే ఉపేక్షా భావమే. అత డేంచేస్తున్నదీ తాను పట్టించుకునేవాడు కాడు. వినిపించుకునేవాడు కాడు. యువరాజు ప్రజల్లో కలిసి తిరు గుతూ ఉంటాడనీ, ప్రజలపక్షం వహించి తనకు విరుద్ధంగా ప్రవర్తిస్తూ ఉంటాడనీ రాజుకు తెలియకపోలేదు. కాని రాను రాను అవన్నీ మామూలు విషయాలైపోయాయి. అవి తలచు కున్నా ఆయనకేం బాధ కలగటంలేదు. ఒక ప్రముఖ విషయ ప్రసక్తి ఉంటేతప్ప ఆయన ఉదయాదిత్యుని అస్తిత్వమే విస్మ రించాడు. ఇప్పుడిప్పుడే ఆతని విషయం కాస్త పట్టించుకుంటు న్నాడు; మళ్ళీ కనిపెట్టి వుంటున్నాడుకూడా. అందుచేత విష యం అతని చెవికి చప్పున ఎక్కింది. విని చాల ఉగ్రుడైనాడు. వెంటనే ఉదయాదిత్యుని తన సముఖంలోకి పిలిపించుకున్నాడు. అడిగాడు: "నేను సీతారామ్‌నీ, భగవంతాన్నీ నౌకరీలోనించి తీసివేశానంటే – కోశాగారంలో డబ్బులేదని చేశానా ఆపని? నువ్వెందుకూ వాళ్ళకు సహాయం చేయటం?"

ఉదయాదిత్యుడు చాల నమ్రతగా జవాబు చెప్పాడు: "నేను దోషిని. మీరు వాళ్ళను శిక్షించటంద్వారా నన్ను శిక్షించారు; మీశిక్షానుసారమే నేను వాళ్ళకు మానసిక శిక్ష ఇస్తున్నాను."

ఇదివరకెప్పుడూ ఉదయాదిత్యుని మాటల్ని ఇంత ధ్యానపూర్వకంగా రాజు వినియుండలేదు. ఆ ధైర్యం, గాంభీర్యం, వినయం, సుసంయతమైన భాష రాజుకు ఇంక్కాలి అసహ్యమనిపించలేదు ఉదయాదిత్యుని మాటకు రాజు తర్కించకుండా "నేను ఆదేశిస్తున్నాను ఉదయ్! ఇక నెప్పుడూ ఆర్థిక సహాయం వాళ్ళకు చెయ్యబోకు" అన్నాడు.

"అంటే – మీరు ఇంకా నాకు కఠినమైనశిక్ష విధించారన్న మాట! మహారాజా!" ఉదయాదిత్యుడు అంజలిపట్టి ఇంకా ఇలా అన్నాడు: "ఇంతకూ నేనేమి అపరాధం చేశానని ఇటువంటి కఠినశిక్ష అనుభవించటానికి? నా మూలాన పదిపన్నెండు మంది కూడుదొరక్కుండా అల్లాడుతూ ఉండటం నన్నెలా చూచి సహించమంటారు? పది పన్నెండుమంది నౌకరీ పోయి, గోలుగోలుమని ఏడుస్తూ తిరుగుతున్నారు. నా కంచంలో మాత్రం అన్నం నిండుగానే ఉంటోంది. నాన్నగారూ! నా సుఖభోగాలన్నీ మీ ప్రసాదమే. నా కంచంలో మీరు కావలసినదానికంటే ఎక్కువగానే అన్నం పెడుతున్నారు. నే నా ఆహారం తింటూన్నప్పుడు ... ఆకలితో, దాహంతో వేసారిపోతున్న పదిపన్నెండు మందిని పక్కన కూచోబెట్టి...వాళ్ళకు ఒక్క మెతుకుకూడా పెట్టవద్దని నన్ను నిషేధిస్తే...ఆ అన్నం నాకువిషతుల్యంగాక మరేమౌతుంది?"

యువరాజు అలా ఆవేశంగా మాటాడుతోంటే రాజు ఏ మాత్రం ఆటంకపరచలేదు. అతడంతా చెప్పటం అయాక రాజు యిలా అన్నాడు: "నువు చెప్పవలసినదంతా చెప్పావు; విన్నాను. ఇక నేను చెప్పేది నువు విను. భగవంతాన్నీ,

సీతారామ్‌నీ నౌకరీలోనుంచి తొలగించింది నేను. వాళ్ళకి బియ్యం, పప్పు ఎవరైనా యిస్తే వాడు నన్ను ధిక్కరించి, నాకు విరుద్ధంగా నడుచుకున్నట్టే పరిగణింపపడుతుంది." ప్రతాపాదిత్యునికి బాగానే కోపం వచ్చేసింది. ఇంతకోపం రావటానికి కారణం తనకే తెలియదేమో! లేక తనలో అనుకున్నాడేమో! 'నేను చాలా కఠినంగా ప్రవర్తించానూ! ఈ ఉదయాదిత్యుడొక దయానిధి బయలుదేరి ప్రతివిధానం నెరపేవాడా? దయపుట్టి ఏం చేస్తాడో చూస్తాగా! నేను కఠినంగా వ్యవహరించినచోట దయాళువు ఒకడు బయలుదేరటం స్వార్థాత్మకమైన విషయంకాదా!' అని.

ఉదయాదిత్యుడు సురమ వద్దకు పోయి జరిగినదంతా చెప్పాడు.

"ఆనాడు ఇంట్లో తిండికి లేకపోయేసరికి ఇంటిల్లపాదీ అల్లాడిపోయారట; సాయంత్రమప్పుడు సీతారామ్ తల్లి చిన్న మనమడి నెత్తుకుని నా దగ్గరకు వచ్చి బోరున ఏడ్చింది. నేనేదో ఇచ్చిపంపిస్తే కాస్త ఎంగిలి పడ్డారా రాత్రి. నోరెరగని పసివాళ్ళు అన్నంలేక అటమటిస్తూంటే చూచి ఎవరిగుండె కరగదూ! ఏదో పసిపిల్లలకన్నా పెట్టుకోకపోతే ఎలా బ్రతికాలి వాళ్ళు?" అన్నది సురమ.

"మహారాజావారు వాళ్ళను నౌకరీలోనుంచి తీసివేశారు. వాళ్ళకేమైనా సాయంచేస్తే మహారాజావారికి కోపం వస్తుందేమోనన్న భయంతో ఎవరిమటుకు వారు 'మనకెందుకీ పీడ' అని తప్పుకునే తిరుగుతున్నారు. ధనవంతులైనవాళ్ళు వాళ్ళను తమయింటో నౌకరీకి పెట్టుకోడానికి జంకుతున్నారు.

ఏవిధమైనసాయమూ చెయ్యకండా వున్నారు ఇటువంటి పరి స్థితిలో మనంకూడా ముఖంతిప్పుకుంటే వాళ్ళగతేం కావాలి. ఎక్కడికి పోతారు? వాళ్ళకు నేను తప్పకుండా సహాయంచేసి తీరుతాను. నువ్వేం విచారపడబోకు. కాని అనవసరంగా నాన్నగారికి కోపం తెప్పించటమూ మంచిపని కాదు. కాబట్టి ఈ పని అతి రహస్యంగా చెయ్యాలి మనం"

"ఆపని మీరేం పట్టించుకో నక్కర్లేదు; నేను చేస్తాను లెండి. ఆ భారమంతా నాకు వప్పజెప్పేయండి" అన్నది సురమ. భర్తచేయి పుచ్చుకుని. తాను కల్పించుకుని భర్తకు మాట రాకండా చెయ్యాలని ఆమె ఉద్దేశం. ఈ ఏడాది అంతా ఉదయాదిత్యునికి చెడుగానే ఉన్నది తండ్రిగారికి ఇష్టంలేనివి; ఆయన కోపగించు కొనేటటువంటివే అయినపనులే తప్పని సరిగా చేయవలసి వస్తున్నది. భర్తను ప్రాణప్రదంగా ఎన్ను కుంటూన్న సురమ కూడా అతనికి చేయూత ఇవ్వక తప్పటం లేదు. అటువంటి పనులనించి అతన్ని మరలించే ప్రయత్నం చెయ్యలేక పోతున్నది. ధర్మయుద్ధానికి బయలుదేరి వెళ్ళే భర్తకు అస్త్రశస్త్రాలు చేతికిచ్చి, తిలకందిద్ది పంపించే స్త్రీలు కొందరే ఉంటారు. అలాగ భర్తను ప్రోత్సహించి పంపించి, పడక గదిలోకివెళ్ళి కూచుని అశ్రుధారలు విడుస్తూ ఉంటారు. అట్టివారిలో చేరిన స్త్రీ సురమ. అడుగడుక్కీ సురమప్రాణం భయంతో, ఆశంకలతో కంపించిపోతూ ఉంటుంది. అయినా అడుగడుక్కీ ఆమె భర్తకు ప్రోత్సాహం ఇస్తూనే ఉంది. ఏదో ఘోరమైన విపత్తు సంభవించిన స్థితిలో కూడా...ఉద యాదిత్యుడు సురమాదేవి ముఖంలోకి చూస్తే... ఆమె

నేత్రాలు అశ్రుసిక్తములై వుంటాయి కాని చెయి వణకదు, పాదం తొట్రుపడదు.

సురమదగ్గర ఒక నమ్మకమైన దాసి వున్నది. ఆ దాసీ దాని ద్వారా ఆమె సీతారామ్‌కీ, భగవంతానికీ మాసిక వేతనము పంపిస్తూఉంది. దాసి చాలనమ్మదగిన మనిషే అయినా రహస్యం మంగళాంబకు తెలియకండా మాత్రం దాగలేదు.

## 16

ప్రతి మాసం అతిరహస్యంగా సీతారామ్‌కూ భగవంతానికీ ఆర్థిక సహాయం అందుతూన్న సంగతి ప్రతాపాదిత్యునికి తెలిసింది. వెంటనే సురమాదేవిని పుట్టింటికి పంపివేయవలసిందని రాణీగారికి ఆజ్ఞ జారీచేశాడు. ఉదయాదిత్యుడు గుండెనిబ్బరం తెచ్చుకున్నాడు. విభ మాత్రం అధైర్యపడిపోయింది. వెళ్ళి సురమాదేవి కంఠం కావిలించుకుంది "నువ్వు వెళ్ళిపోతే ఈ శ్మశాన వాటికలో నా గతేం కావాలి వదినా?" అంటూ కన్నీళ్ళు పెట్టుకుంది. సురమ ఆమెగడ్డం పుణుకుతూ, ముద్దుపెట్టుకుని "నేనెందుకు వెడతాను విభా! నా సర్వస్వం ఉన్నది యిక్కడే కదా!" అన్నది. మహారాజావారి ఆజ్ఞ వినగానే సురమ ఇలా అన్నది: "నే నిప్పుడు పుట్టింటికి వెళ్ళవలసిన అవసరం ఏమిటో నాకు బోధపడటం లేదు. అక్కడి నించి నన్ను తీసుకు పోయేందుకా ఎవరూ రాలేదాయెను. నే నిప్పుడు వెళ్ళటం మా ఆయనకూ ఇష్టంలేదు. కనుక ఏకారణమూ లేకండా నేనిప్పుడు పుట్టింటికి బయలుదేరి వెళ్ళటం అనుచితమని భావిస్తున్నాను."

అదివిని ప్రతాపాదిత్యుడు మండిపోయాడు. కాని చేసే దేమీ కనిపించలేదు. బలవంతాన సురమను ఎలా పంపించి వెయ్యగలడు? అంతఃపురంలో శరీరబలం పనికిరాదు. స్త్రీ ప్రపంచంలో ప్రతాపాదిత్యునికి అనుభవం తక్కువ; అక్కడ అతను పూర్తిగా అనభిజ్ఞుడే. పురుషులనైతే బలప్రయోగం ద్వారా సాధించగలడు. కాని స్త్రీలవిషయంలో అవలంబించ దగిన నీతిపద్ధతి ఏమిటో అతనికి తెలియదు. అందుచేత ఆ కార్యభారం రాణీగారికి అప్పగించాడు.

రాణీగారు ఉదయాదిత్యుని పిలిపించి చెప్పింది : "నాయనా! ఉదయ్! కోడల్ని పుట్టింటికి పంపిచాలి మరి!"

"ఎందుకమ్మా! ఏం తప్పు చేసింది?"

"మా ఆడవాళ్ళకేం తెలుస్తుంది నాయనా? ఏ రాజ కార్యం చక్కబడవలసివుందో మరి! అందుకోసం కోడల్ని పుట్టింటికి పంపించాలి కామాలు! మహారాజావారి ఉద్దేశ్య మేమిటో వారికే తెలియాలి."

"నన్ను కష్టపెట్టి, నన్నేడిపించి ఏమి రాచకార్యాలు సాధిస్తారమ్మా మీరు? ఎంతవరకు సహించాలో అంతవరకు సహిస్తూనే ఉన్నాను ఇక్కడ బాధలన్నీ. ఇక్కడ నే ననుభ వించే సుఖం ఏమిటో నువ్వే చెప్పమ్మా! సురమమాత్రం ఏం సుఖపడుతున్నదనీ? ప్రొద్దుటినుంచీ సాయంత్రందాకా తిట్లు, తిరస్కారాలేగా ఆమె అనుభవిస్తున్నది? చివరి కామెను ఇంట్లోనుంచికూడా వెళ్ళగొట్టేస్తున్నారన్నమాట! ఈయిల్లు-వాకిలితో ఆమెకేం సంబంధంలేదా? బిచ్చం అడుక్కోటానికి వచ్చిందా మనింటికి? భోజనం కోసమని ఉన్నదా మనింట్లో?

మీ ఇష్టంవచ్చినన్నాళ్ళు ఉంచుకుంటారూ! ఇష్టంగాకపోతే వెళ్ళగొట్టేస్తారూ! అయితే అమ్మా! నాకుకూడా ఈ ఇంట్లో స్థానం లేదన్నమాటే- నన్నుకూడా పంపించెయ్యండమ్మా!"

రాణి కన్నీళ్ళు పెట్టుకుంది. "నాకేమీ అర్థంకావటం లేదు నాయనా! మీ నాన్నగారి మనస్సులోకి ఎప్పుడే ఆలోచన వస్తుందో చెప్పలేం. వారి మాయ వారికే తెలియాలి. కాని ఒక్క సంగతి బాబూ! కోడలు మంచిపిల్లకాదు; దాని లక్షణాలు చూస్తుంటే నాకు కడుపు చెరువైపోతుంది. పోనీ, నాలుగురోజులు పుట్టింట్లో వుండివస్తుంది. అందులో చెరుపేముంది? నువ్వే చూస్తావుగా ఆమె వెళ్ళిపోయాక ఇల్లు ఎలా కళకళ లాడుతుందో!"

ఉదయాదిత్యుడు మరేమీ మాటాడలేదు. మౌనంగా అలాగే కాసేపుకూచుని, లేచి వెళ్ళిపోయాడు.

రాణీ మహారాజావారి వద్దకు పోయి ఏడ్చింది. "మీ రేమన్నా చెప్పండి మహారాజా! కోడల్ని పంపించేశామంటే ఉదయుడు నా కొడుకు కాకుండా అయిపోతాడు. వాడి తప్పేమీ లేదు పాపం! కోడలు మాయలమారి; వాడిని పూర్తిగా వలలో వేసుకుంది. మందే పెట్టిందో, మంత్రమే వేసిందో!" అంటూ ఏడ్చింది.

ప్రతాపాదిత్యునికి బాగా కోపం వచ్చేసింది. "సురమ వెళ్ళిందా వెళ్ళింది; లేకపోతే ఉదయుడిని ఖైదులో పెట్టేస్తాను"

రాణి అక్కడినించి సురమదగ్గరకు పోయింది, "ఓసి పాపిష్టిదానా? నా కొడుకును ఎలా మార్చేశావే! నా బిడ్డడిని నాకు వొప్పజెబుతావా లేదా? నువు కొంపలో అడుగు

పెట్టాడో లేదో ఎంత అనిష్టం తీసుకొచ్చావే! చివరకు వాడిని ఖైదులో కూడా పెట్టిస్తేగాని నీ కళ్ళు చల్లబడ వన్నమాట!"

ఆ మాటలు వింటూంటే సురమ శరీరం కంపించి పోయింది. "నా మూలాన వారు ఖైదులో పడటం ఎందుకూ? అలా ఒక్కనాటికీ జరగటానికి వీల్లేదు. నేనే వెళ్ళిపోతాను అత్తయ్యగారూ! ఇప్పుడే ఈ క్షణంలోనే."

సురమ వెళ్ళి సమాచారమంతా విభకు చెప్పింది. "విభా! నేనిక్కడనుంచి వెళ్ళానూఅంటే ఇక అంతే అనుకో. మళ్ళీ మావాళ్ళు నన్నిక్కడికి పంపించరు" విభ వదినగారిని కావిలించుకుని ఏడున సాగింది. సురమ అలాగే దిగాలుపడి కూనుంది. 'ఇంకేముంది? ఇంకేం లేదు? సర్వం కోల్పోయినట్టే - మళ్ళీ కలుసుకోవట మంటూ ఉండదు'- అన్న వాక్యాలు అనంత కాలగర్భంలోనించి శబ్దిస్తూ వచ్చి వచ్చి ఆమె హృదయంలో శూలపుపోటు లైనాయి. ఒక మహా శూన్య భవిష్యత్తు ఆమెముందు వ్యాపించి·గోచరం కాసాగింది. అందులో ఆ ముఖమేలేదు; ఆ నవ్వేలేదు; ఆ ప్రేమేలేదు; కన్నులు - కన్నులూ, మనసు - మనసూ, హృదయం - హృదయం కలసి పోవటంము లేదు; సుఖదుఃఖాల భాగస్వామ్యం లేదు; గుండె చీల్చిచూ చిన ఒకబిందువైనా ప్రేమలేదు; స్నేహం లేదు; ఏమీ లేదు; ఎంత భీషణమైన భవిష్యత్తు! సురమగుండె పగిలిపోయినట్టుంది; బుర్రి తిరిగిపోతూన్నట్టుంది. కన్నీళ్ళన్నీ ఇగిరిపోతూయి. ఉదయాదిత్యుడు రాగానే అమాంతం అతని పాదాల మీద వ్రాలిపోయింది. అతని పాదాలు గుండెలకు హత్తుకొని వెక్కి వెక్కి ఏడ్చింది. ఇంతయిదిగా

ఆమె ఎప్పుడూ ఏడవలేదు. బలిష్ఠమైన ఆమె హృదయం ఈనాడు నూరుముక్కలుగా విదీర్ణమై పోయింది. ఉదయాదిత్యు డామె ముఖాన్ని హృదయంలో హత్తుకుంటూ మిక్కిలి వ్యాకుల చిత్తుడై పోయాడు. 'ఏమిటి? సురమ ఏమైంది ?' అన్నాడు, అతని ముఖంలోనికి చూస్తూ? సమాధానం చెప్పెనస్థిలో ఉన్నదా? సురమ ఆ సమయాన; అలా అతని ముఖంకేసి చూస్తున్నది, మళ్ళీ తలవంచుకుని ఏడుస్తున్నది. చివరకు గద్గద కంఠస్వరాన "ఇక మళ్ళీ ఈ జన్మలో మీ ముఖం చూడలేను. సాయంత్రమపుడు మీరు వచ్చి కిటికీ దగ్గర కూచుంటారు; పక్కన నేను ఉండను. గదిలో దీపం వెలుగుతూ ఉంటుంది; మీరువచ్చి గుమ్మంలో నిల్చుంటారు; నేను నవ్వుతూ మీ చెయి పుచ్చుకుని లోపలికి తీసుకు పోవటమంటూ ఉండ దిక. మీరు యిక్కడ, నేను అక్కడ" అన్నది. 'అక్కడ' అని ఆమె పలికిన శబ్దంలో చెప్పరానంత నిరాశ; ఊహించరానంత దూర దూరాంతర వియోగ వేదన అంతర్గర్భితమై వున్నాయి. చూపులు, చూపులు కలుస్తూంటేనే ఇంత దూరం, ఇంత అంతరం! ఆ చూపులుకూడా లేకపోతే ఇక ఎంత దూరమో! వార్త లందుతూ ఉంటేనే చాల దూరమనిపిస్తూ ఉంటుంది. అదికూడా లేకండాపోతే అదెంత దుస్సహమైన దూరమో! ఎప్పుడేనా ప్రాణాంతకమైన ఇచ్ఛ కలిగినప్పుడు తన ప్రియతముని ఒక్క క్షణంసేపయినా చూచుకోలేకపోయిన పరిస్థితిని తెచ్చుకోటంకంటే...ఆయన పాదాల్ని ఇలాగే గుండెకు హత్తుకుంటూ హత్తుకుంటూ ఈక్షణాన్నే ప్రాణాలు విడిచేస్తే మంచిది కాదూ!

# 17

వెనుకటి ప్రకరణంలోనే రుక్మిణిపేరు పాఠకులకు పరిచయం అయింది. వారు మరచి ఉండరనుకుంటాను. మంగళాంబే ఆ రుక్మిణి. ఆమె రాయగడ్ విడిచిపెట్టి, పేరు మార్చుకుని, యశోహార్ పట్నంవచ్చి ఊరుచివర ఒకమూల ఉంటూన్నది. ఆమెను గురించిన అసాధారణ విషయమేమీ లేదు. మామూలు ప్రాకృతస్త్రీలకువలె భోగవిలాసాలంటే ఆమెకు ఇష్టం. మగవాళ్ళను రెచ్చగొట్టి వశపరచుకోవడం ఆమెకు సరదా. ఈర్ష్య ఆమెలోని ప్రధానగుణం. ఇతర్లను నవ్వించడం, ఏడిపించడం ఆమెకొక వినోదక్రీడ. ఆడించినంత వరకు ఆడిస్తుంది. ఇష్టంలేకపోతే మడిచి గూటిలో పెట్టేస్తుంది. కోపం వచ్చిందంటే ఆమెరూపం చాలా ప్రచండంగా మారిపోతుంది. ఆ సమయంలో ఎదుటివాడిని ముక్కలు ముక్కలుగా చీల్చి తినేస్తుందేమో నన్నంత భయంకరంగా ఉంటుంది; అటువంటప్పుడామె ఎక్కువగా మాటాడదు; ఆపాదమస్తమూ కంపించిపోతుంది; కనుల్లోనుంచి నిప్పురవ్వలు చిందుతూ ఉంటాయి. అసూయ చెలరేగినప్పుడు, పడగ విప్పి బుసలు కొట్టే త్రాచుపాములా అయిపోతుంది మనిషి. రకరకాల వ్రతాలూ అవీ చేస్తూఉంటుంది. తాంత్రిక అనుష్టానాలు కూడా ఉన్నాయి. పరిచయస్థులైనవారి మానసిక ప్రవృత్తులామెకు బాగా తెలుసు. ఆమె హృదయంలో సదా సముజ్జ్వలంగా వెలుగుతూ ఉంటుంది, ఒకే ఒక ప్రధాన ఆశయం:

యువరాజు సింహాసనం అధిష్టించాలి. అతని హృదయ సింహాసనం తాను అధిష్టించాలి. అతని హృదయరాజ్యం, యశోహర రాజ్యం రెండూ తాను ఏకఛత్రాధిపత్యంగా పరిపాలించాలి. ఈ ఆశయం తాను ఎలాగైనా సరే సాధించి తీరాలి. చాలా కాలనుంచీ ప్రయత్నించి రాజమహాలులోని నౌకర్లతోనూ, దాసీలతోనూ బాగా పరిచయం సంపాదించింది వాళ్ళద్వారా, రాజమహాలులోని ఏ చిన్న కబురునైనా సరే ఆమెకు చేరవలసిందే. సురమాదేవికి కాస్త తలనొప్పిగా వున్నదని తెలిస్తే చాలు 'ఇక బ్రతకదు, చచ్చిపోతుం'దనే మంగళాంబ ఆలోచన ప్రతాపాదిత్యునికి కాస్త సుస్తీగా ఉన్నదని కబురువస్తే చాలు 'అయిపోయింది; ఇంకెన్నాళ్ళో బ్రతకడు' అనే ఆమె అనుకోటం. సురమాదేవి, ప్రతాపాదిత్యుడు చచ్చిపోవాలన్న కోరికతో ఎన్నో అనుష్ఠానాలు చేసింది. కాని అవి ఇంతవరకూ సఫలం కాలేదు. రోజురోజుకూ ఓపిక పట్టలేక పోతున్నది. మంత్రతంత్రాలు ఎలాగైనా పాడుగానీ, వాళ్ళగనక ఏవిధంగానైనాసరే చేతికి చిక్కితేచాలు. తన హస్తలాఘవం చూపించి మనసులోని వాంఛ తీర్చుకోవాలని ఆమె దృఢసంకల్పం, ఈ సంకల్పాన్ని స్మరించుకుంటూ పళ్ళకింద పెదవి పెట్టి నొక్కుకుంటూ ఉంటుంది – అది కసకసా నలిగిపోయి నెత్తురు వరద లౌతుందేమో ననిపించేట్టు.

మహారాజావారూ, రాణీ కోడలిమీద చాల కోపంగా ఉన్నారనీ, ఇంట్లోనుంచి పంపించివెయ్యటానికి కృతనిశ్చయులై ఉన్నారనీ మంగళాంబకు తెలిసింది. ఆమె ఆనందానికి అంతు లేదు. కాని ఇంకా సురమ వెళ్ళలేదన్న సంగతికూడా దరిమిలా

కబురు తెలుసుకుంది. దబ్బున పంపించి వెయ్యటానికి తానే ఉపాయం స్థిరం చేసుకుంది.

మంత్ర తంత్రౌషధాలన్నీ తెలిసిన మంగళాంబ అనే పేరుగలది విధవరాలొకతె ఉన్నదని తెలియగానే రాణికి ఒక ఆలోచన పోయింది; సురమను పుట్టింటికి పంపించేముందుగానే, ఆమె మీదినించి యువరాజు మనస్సు తిప్పేయించాలి – అని ఈ ఆలోచన మనస్సులో పెట్టుకుని ఆమె మాతంగినిని రహస్యంగా పంపించింది మంగళాంబ దగ్గరికి మందు తీసుకురమ్మని.

ఆ రాత్రంతా మంగళాంబకు పనే. రకరకాల మూలికలు తెచ్చింది. తడిపింది, నూరింది, రసాలుతీసి విషం తయారు చేస్తోంది. అర్థరాత్రిసమయం. ఊరె చివరాయెను. జనసంచారం లేదు. నిశ్శబ్దంగా ఉంది. కీచురాళ్ళ రొదమాత్రం అవ్యాహతంగా ఉంది. ఆ రొదే ఆమెకప్పుడు సావాసగత్తె. ఆ రొదే ఒక నర్తకివలె ఆమెకు ఉత్సాహాన్ని కల్పిస్తూ ఆవేశాన్ని హెచ్చిస్తూ ఉన్నది. ఈ ఉత్సాహావేశాలతో ఆమెకు నిద్రే రాలేదు.

మందు తయారు చెయ్యటానికి అయిదు రోజులు పట్టింది. విషం తయారు చేయటానికి అయిదు రోజులు అనవసరం. కాని సురమ చచ్చిపోతోందంటే యువరాజుకు జాలి, దుఃఖం కలక్కూడదుగా! అందుకోసం అయిదు రోజులు మంత్రి పఠనం చెయ్యవలసి వచ్చింది.

రాణీగారు చెప్పిన మాటమీద ప్రతాపాదిత్యుడు అంగీకరించాడు – సురమ ఇంకా కొద్దిరోజులపాటు ఇక్కడే ఉండటానికి. సురమ వెళ్ళిపోతుందంటే విభకు అంతా అంధ

కారంగా ఉంది. కొన్నాళ్ళనుంచీ ఆమె సురమను విడిచి పెట్టటం లేదు; నీడలా ఆమెను అనుసరించే తిరుగుతున్నది. రోజులు గడుస్తున్నాయి. సురమను గట్టిగా గుండె కదుము కుని, వెళ్ళిపోకండా అట్టిపెట్టుకోవాలని ఒక యిచ్ఛ ఆమెలో ప్రబలమౌతూ వచ్చింది. ఎవరో సురమను తన దగ్గరనించి బలవంతాన లాక్కుపోతున్నట్టే ఆమె నిరంతర భావన

సురమస్థితి ఇంకా దయనీయంగా ఉంది. ఆమె కంతా పరమ శూన్యంగానే కనిపిస్తున్నది. ఎప్పుడూ భర్త పాదాల దగ్గరే పడివుంటోంది. ఆతని వొడిలో ముఖం దాచుకుని నిట్టూర్పులు పుచ్చుతుంది. మాట పలుకు లేకుండా భర్త ముఖం చూస్తూ అలా కూచుంటుంది. "విభా! నా సర్వ స్వాన్ని నీదగ్గర వొదిలిపెట్టి పోతున్నాను." అని మరదలితో చెప్పుకుంటుంది; దోసిటలో ముఖం వాల్చుకుని ఏడుస్తుంది.

మధ్యాహ్నం రెండుగంట లౌతుంది. రేపు ఉదయమే సురమ ప్రయాణం. తనయిల్లు, వస్తువులూ విభకు అప్ప గింత పెట్టేసింది. ఉదయాదిత్యుడు ప్రశాంతంగా స్థితప్రజ్ఞు డిలా కూచున్నాడు. 'సురమ ఇక్కడే ఉంటుంటా ఉంటుంది; లేకపోతే నేనుకూడా ఇక్కడనుంచి వెళ్ళిపోవలసిందే' అని ఒక స్థిరనిశ్చయంతో వున్నాడు.

సాయంత్రం అయింది. సురమకు వొంట్లోఏమీ బాగుం డలేదు. అసలు నిల్చోలేకుండా వుంది మనిషి. చేతులు కాళ్ళు వొణికి పోతున్నాయి. మెదడు తిరిగిపోతున్నది. వెళ్ళి పక్క మీద పడుకుంది. "విభా! వారిని ఇలాపిలు. దబ్బున పిలు! ఇక ఆలస్యం లేదు" అన్నది.

ఉదయాదిత్యుడు గుమ్మంలోకి రాగానే "రండి, రండి, నాకు వొంటో చాల గాబరాగా ఉంది." అన్నది సురమ రెండుచేతులూ చాచి. అతడు దగ్గరకు వచ్చాడు. ఆమె అతని రెండుపాదాలూ కరచిపట్టుకుంది. ఆమె చేతులు కాళ్ళు మంచుగడ్డలా చల్లబడి పోయాయి. ఊపిరి పీల్చడంకూడా ఆమెకుచాల కష్టంగాఉంది అదంతాచూచి ఉదయాదిత్యుడు నిర్ఘాంతపోయి, నీరై పోయి 'సురమా!' అన్నాడు. ఎత్తలేక ఎత్తలేక మెల్లగా తలఎత్తి భర్తముఖంలోకి చూస్తూ 'ప్రియతమా!' అన్నది. ఉదయాదిత్యుని మనస్సంతా వికలమై పోయింది. "ఏమిటి సురమా! ఏమైంది?" అన్నాడు. బహుశా నేను వెళ్ళిపోయేక్షణం సమీపించినట్టుంది." అంటూ ఆమె చేతులెత్తపోయింది – అతని కంఠాన్ని కావలించుకునేందుకు. కాని చేతులెత్తనే లేకపోయింది. దీనంగా గుడ్లు వప్పజెప్పి అతని ముఖంలోకి చూస్తూ ఉండిపోయింది. ఉదయాదిత్యుడు తన రెండుచేతుల్లోనూ ఆమె ముఖం ఎత్తిపట్టుకుని "సురమా! ఎక్కడికి వెడతావు సురమా! ఇక నాకెవరున్నా రిక్కడ?" అన్నాడు. సురమ కన్నుల్లోనుంచి అశ్రుధారలు వెడలినాయి. విభకేసి చూస్తూ ఉండిపోయింది. విభ అప్పుడు చైతన్యం లేని బొమ్మవలె అయోమయావస్థలో ఉంది – గుడ్లు వొప్ప జెప్పి చూస్తూ.

రోజూ సాయంత్రమప్పుడు సురమ, ఉదయాదిత్యుడు కూచునేచోట కిటికి తెరచేవుంది. అందులోనించి కనిపిస్తున్నవి ఆకాశంలోని నక్షత్రాలు. మెల్లగా గాలితరగలు లోనికి వస్తున్నాయి. నిశ్శబ్దంగా ఉంది బయట వాతావరణం. దాసీ

వచ్చి దీపం వెలిగించింది. దేవమందిరంలో హారతి ఇచ్చే వేళ; శంఖానాదం, గంటలచప్పుడు వినిపిస్తున్నవి. "మీ రేమన్నా మాటాడండి. నా కళ్ళుచీకట్లు కమ్ముతున్నాయి. ఏమీ కని పించటంలేదు" అన్నది సురమ భర్తతో.

సురమా దేవి స్వయంగా విషం తాగింది; చచ్చిపోవ టానికి సిద్ధంగా ఉన్నది-అన్నవార్త రాజమహాలులో వ్యాపించి పోయింది. రాణీ, దాసీలు యావన్మందీ పరిగెత్తుకుంటూ వచ్చారు. సురమస్థితి చూచి రాణి యేడుపు సాగించింది. "సురమా! నాతల్లీ! నువు ఇక్కడే వుండు; నిన్ను నే నెక్కడికీ పంపించను. నువు మా ఇంటి లక్ష్మివి. నిన్నెవరు పొమ్మం టారు?"

సురమ అత్తగారి పాదాలు స్పృశించి ఆ పాదధూళి తలపై అలంకరించుకుంది. రాణి ఇంకా బిగ్గరగా ఏడువసాగింది. "నా తల్లీ! నువు కోపం వచ్చి, మమ్మల్ని దిగవిడిచి వెళ్ళి పోతున్నావా?"

సురమ గొంతుపూడిపోయింది. ఏమిటో మాటాడాలను కుంది. కాని మాటాడ లేకపోయింది. డాక్టర్ వచ్చి 'లాభంలేదు; అంతా అయిపోయింది' అన్నాడు. ఆమాట వినటంతోనే "అన్నయ్యా! ఏమైందన్నయ్యా!" అంటూ విభాదేవి గొల్లున ఏడుస్తూ వచ్చి సురమ మీద వాలిపో యింది. వెక్కి-వెక్కి ఏడ్చింది.

తెల్లవారింది సురమా దేవి తల ఒడిలో పెట్టుకుని అలాగే కూచున్నాడు ఉదయాదిత్యుడు.

## 18

సురమ లేదా ఇక ? లేదన్నట్టు అనిపించటం లేదు విభా దేవికి. ఇక్కడే ఎక్కడో ఉంది; మళ్ళీ వచ్చేస్తుంది అని అనుకుంటోంది. ఈ గదిలోనించి ఆ గదిలోకీ, ఆ గది లోనించి ఈ గదిలోకీ తిరుగుతూ ఉంటుంది. ఎక్కడ తిరు గుతూవున్న ఆమె ప్రాణం సురమ కోసం వెతుక్కుంటూ ఉంటుంది. తల దువ్వుకుని జడ వేసు కుందామని కూచుం టుంది. సురమ వచ్చి తనకు జడ వేస్తుందన్న భావంతో అలాగే కూచుండి పోతుంది. సాయంత్రం జౌతుంది; దీపాలు పెడతారు; కాని సురమ రాదు. విభ తల విరబోసుకుని అలాగే కూచుంటుంది. మనిషి ఎప్పుడూ ఉదాసీనంగా ఉంటుంది; ఏడుస్తూ ఉంటుంది. ఎంతైనా సురమ మళ్ళీ రాదేం ? ఆమె ఎప్పుడూ ఇలా చెయ్యలేదు. కాని ఈనాడు ? గొంతు చినిగిపోయేట్టు ఏడ్చినాకూడా ఆమె వచ్చేట్టు లేదు.

ఉదయాదిత్యుని సగం బలం, సగం ప్రాణం వెళ్ళి పోయింది. ప్రతి పనిలోనూ తన కామె శక్తినీ, ఉత్సా హాన్నీ ఇచ్చేది. ఆమె ప్రేమే తన జీవితానికి అవలంబం; ఆమె నవ్వే తనకు వెన్నెల. అటువంటి ఆమె దాటిపోయింది. పడకగదిలో వెళ్ళి కూచుంటాడు. అతనిమనసులో ఏమేమి ఆలోచనలు వస్తూంటాయో ! నాలుగువైపులా చూస్తూ ఉంటాడు. ఎంత చూచినా ఎక్కడా ఏమీ కనిపించదు

మెల్లిగా వెళ్ళి కిటికీదగ్గర కూచుంటాడు. అక్కడ మామూలుగా సురమ కూచునేచోటు ఖాళీగా వుంటుంది. ఆకాశములో ఎప్పటి చంద్రుడే; బైట ఎప్పటి వెన్నెలే; అదే గది; అవే గాలితరగలు వీస్తున్నాయి; ఇలాంటి రాత్రివేళ సురమ రాకండా ఉండగలదా ? అనుకుంటాడు.

ఉండి ఉండి సురమ ఏమో మాటాడుతున్నట్టు విని పిస్తుం దతనికి. నిజంగా అది ఆమె కంఠస్వరమే అనుకుంటాడు. ఉలికిపడతాడు అసంభవం; భ్రమ అనుకుంటూనే నాలుగు దిక్కులా చూస్తాడు, మంచందగ్గరికి వెడతాడు. ఆమె ఇక్కడెక్కడో ఉన్నదన్న ఊహ అతన్ని వెన్నాడుతూనే ఉంటుంది. సురమ ఉన్నరోజుల్లో ఉదయాదిత్యుడు పగలంతా వెయ్యి పనుల్లో తిరుగుతూ ఉండేవాడు. బీదప్రజల గోడు వినేవాడు, పరామర్శ చేసేవాడు; కాని ఇప్పుడతనేపనీ చెయ్యటంలేదు. కాని సాయంత్రమయ్యేసరికి పూర్తిగా బడలిపోతున్నాడు. కాళ్ళీడ్చుకుంటూ వస్తాడు పడగ్గది గుమ్మంలోకి. అప్పుడతని హృదయంలో ఒక సన్నని ఆశాకిరణం మెరుస్తుంది. తలుపు త్రోసుకుని లోపలికి వెడతాడు. కిటికీవద్ద సురమ కూచుని తన కోసం ఎదురుచూస్తున్నట్టు భావిస్తాడు. కాని విభ కనిపిస్తుంది. మరుక్షణమే నిలువునా కుంగిపోతాడు. గదిలో అటూ, ఇటూ పచార్లు చేస్తూఉంటాడు. లోపల ప్రాణం ఏడుస్తూ ఉంటుంది. విభను దగ్గరకు పిల్చి కూచోబెట్టుకుంటాడు. వాత్సల్యం చిలుకుతూ మాటాడతాడు. ఆమె అతని చెయి పట్టుకుని వెక్కివెక్కి ఏడుస్తుంది. అతనికీ కళ్ళు చెమ్మగిలిపోతాయి.

"విభా! ఈ కొంపలో నీ కింక ఎవరున్నారు గనుక! నిన్ను అత్తగారింటికి పంపించాలనుకుంటున్నాను ఏ మంటావు? సిగ్గుపడకుండా చెప్పమ్మా! నా ముందు నీకు సంకోచం ఎందుకూ?" అన్నాడొకనాడు ఉదయాదిత్యుడు విభను పిల్చి.

విభ సమాధానం చెప్పలేదు; మౌనంగానే ఉండిపోయింది. నిజానికి ఈ పుట్టింట్లో ఈ ఒక్క అన్నయ్య తప్ప నా అన్నవాళ్ళెవరున్నారు తనకు? అత్తగారింటికి వెళ్ళిపోవడమే మంచిది. కాని తన్ను తీసుకుపోయేందుకు ఎవరూ రాలేదే! ఎందుకు రాలేదో!

విభను అత్తగారింటికి పంపించే విషయమై ఉదయాదిత్యుడు తండ్రితో వెళ్ళిమాటాడేడు "విభను అత్తగారింటికి పంపించేందుకు నాకేమీ అభ్యంతరం లేదు. కాని వాళ్ళకు విభమీద గౌరవం, ఆదరంవుంటే తీసుకుపోయేందుకు మనిషిని పంపించేవాళ్ళుగా! మనం ఇంతగా ఆత్రుత పడవలసిన అవసరం ఏముందీ?" అన్నాడు ప్రతాపాదిత్యుడు.

విభను చూస్తుంటే రాణికి దుఃఖం పొర్లి పొర్లి వస్తుంది. ఎదిగిన కూతురు, మొగుడికెడబాసి, వితంతువులా ఇంట్లో వుంటే ఏ తల్లికి గుండె చెరువైపోదు! అదీగాక ఆమెకు అల్లుడి మీద ఆపేక్షఉంది. ఏదోకాస్త చిన్నతనంగా ప్రవర్తించాడు. అంతమాత్రానికే వ్యవహారం ఇంతగా ముదిరిపోయింది. ఇదంతా రాణి మనస్సుకు కష్టంగానే ఉంది. ఆమె మహారాజా వారి దగ్గరకు పోయి సవినయంగా "విభను అత్తవారింటికి పంపించండి మహారాజా!" అని ప్రార్థించింది. రాజుకు కోపం వచ్చేసింది. "ఎందు కామాట నాకు పలుసార్లు చెబుతారు

మీరంతా? నన్ను ఊరికే ఇలా వేధించకండి. విభకోసం వాళ్ళువచ్చి నన్ను బిచ్చం అడిగినట్టుగా అడిగితే అప్పుడాలోచిస్తాను" అన్నాడు. "ఆడపిల్ల అత్తగారింటికి వెళ్ళకుండా పుట్టింటిలోనే ఇంతకాలం వుంటే లోకు లేమనుకుంటారు? మీరే ఆలోచించండి" అన్నది రాణి. "అయితే ప్రతాపాదిత్యుడు తనకు తానై కూతుర్ని అత్తగారింటికి పంపించటా, అక్కడ రామచంద్రరాయ్ ఆమెను సమ్మానించే బయటికి నెట్టివెయ్యటం జరిగితే లోకులేమనుకుంటారో నువ్వే చెప్పు" అన్నాడు రాజు. రాణి కన్నీళ్ళు తుడుచుకుంటూ తిరిగి వచ్చేసింది — 'మహారాజావారికి మధ్య మధ్య ఏం పిచ్చి యెత్తుతుందో ఏమో! యెవరెంత చెప్పినా వినిపించుకోరు' అని మనసులో గొణుక్కుంటూ.

# 19

ఆత్మ ప్రతిష్ఠ, ఆత్మాభిమానం రామచంద్రరాయ్‌కి ఇంతా అంతా కాదు. వాటి విషయమై చాల పట్టుదలగా వుంటాడు. ఒకనాడతడు పల్లకీలో ఎక్కి ఒక వీధిగుండా వెడుతున్నాడు. ఇద్దరు సాలెవాళ్ళు తమ యింటిముందు నూలు వడుక్కుంటూ కూచున్నారు. అమాయకులు; తెలిసినవాళ్లు కాదు. రాజుగారి పల్లకీ చూచి వాళ్ళు లేవలేదు. ఈ చిన్న సంఘటనపై రాజు ఒక పెద్ద తుపాను లేపి నానా హంగామా చేశాడు.

ఒకసారి రామచంద్రరాయ్ అత్తగారింట్లో వున్నప్పుడు ఒక నౌకరుకు ఏదో పని పురమాయించాడు. పాపం వాడు

పూర్తిగా వినిపించుకున్నాడో లేదో చిన్న పొరపాటేదో చేశాడు. ఇంకేముంది? అత్తగారింట్లో నౌకర్లకుకూడా తన మీద గౌరవం లేకుండా ఉన్నదని నిర్ణయించేసుకున్నాడు. వాళ్ళకు యజమానుల మద్దతు, ప్రోత్సాహంకూడా ఉన్నాయి; లేకపోతే ఇలా ప్రవర్తిస్తారా? అని కూడా భావించాడు. ఆనాడు ఉదయం ఉదయాదిత్యుడా నౌకరుతో మెల్లిగా ఏదో మాటాడుతూ ఉండటం తాను చూచాడు కూడా. తన్ను అవమానించమనే వాడికేదో ఉపదేశిస్తున్నాడన్నమాట! లేకపోతే అంత మెల్లిగా మాటాడవలసిన రాచకార్యం మరేముంటుంది?

మరొక రోజున కొంతమంది పిల్లలు మట్టి, ఇటుకలతో ఒక సింహాసనం తయారుచేశారు. పిల్లలంతా రాజు, మంత్రి, సభాసదులుగా యేర్పాటు చేసుకుని ఆడుకుంటున్నారు. రామచంద్రరాయ్ అదంతా చూచాడు. వెంటనే వాళ్ళ తల్లిదండ్రుల్ని పిలిపించి తీవ్రంగా మందలించి పంపించాడు. వాళ్ళు పాపం నిర్ఘాంతపోయారు.

రామచంద్రరాయ్ బాలీసు అనుకుని మెత్తని పరుపుపై కూచుని హుక్కా పీలుస్తున్నాడు. ఎదురుగా ఒక బీదవాడు బిరికి బిరికిగా చేతులు కట్టుకుని నిల్చున్నాడు. వాడి అపరాధం విచారిస్తున్నాడు రాజు. ప్రతాపాదిత్యుడికీ, రామచంద్రరాయ్‌కీ మధ్య జరిగిన అప్పటి వ్యవహారమంతా యెలాగో మొత్తానికి వాడికి తెలిసింది; ఇరుగు పొరుగువాళ్ళతో కూచుని ఆ సంగతే చర్చిస్తున్నాడట; అదీ వాని అపరాధం. అదంతా యెవడో గిట్టనివాడు తీసుకువచ్చి రాజుకు చెప్పాడు. రాజు వెంటనే ఉగ్రుడైపోయి, వాడిని దర్బారుకు పిలిపించి విచారణ ఆరంభిం

చాడు. విచారణ తీరు, తీవ్రత, హంగామా చూస్తే 'ఇదేదో ఖూనీకేసు కామాలు, హంతకుడిని పట్టి రాజు విచారణచేస్తున్నట్టుంది' అనుకుంటారు తెలియనివాళ్ళు.

"మతిమాలినవాడా! నీ కంత పొగరట్రా?" గర్జించాడు రాజు.

"కాదు మహారాజా! నే నేం చెయ్యలేదండీ!" భయం భయంగా గొణిగాడు అపరాధి.

"మతి మాలినవాడా! మన మహారాజావారిని ప్రతాపాదిత్యుడితో సమానంచేసి మాటాడతావుట్రా?" మంత్రిగారి దబాయింపు.

"మతి మాలినవాడా! ఎవడురా నువ్వు? అంతమాత్రం తెలియదుట్రా? ఈ ప్రతాపాదిత్యుని బాబు మొట్టమొదట సింహాసనం ఎక్కినప్పుడు తనకు రాజతిలకం పెట్టేందుకు మన చనిపోయిన పెద్దరాజాగారిని రమ్మని ఎంతో బ్రతిమాలుతూ కబుర్లు చేశాడు. ఎంతో ఏడ్చి మొత్తుకుంటే చివరకు మన పెద్ద రాజాగారు వెళ్ళి ఎడమకాలి చిటికెనవేలి గోరుతో తిలకం దిద్ది వచ్చారు. తెలిసిందా? ఏమిటనుకున్నావో!" అని దివాన్ గారి బుకాయింపు.

రమేశభట్టుకూడా లేచి అందుకున్నాడు. "విక్రమాదిత్యుడూ, ఆయనకొడుకు ఈ ప్రతాపాదిత్యుడు - ఈ రెండు తరాలనించేగా వీళ్ళకు రాచరికం. ప్రతాపాదిత్యుని తండ్రి ఒక వానపాము. ఆ వానపాముకొడుకు ఒక జలగ, ప్రజలరక్తం తాగితాగి సిద్దైలాతయ్యారైనాడు ఆ జలగ కొడుకు - చేటలాగ ముఖం వాడూ - తానొక పడగవిప్పిన నాగుబాము నను

కుంటున్నాడు; తన్నుజూచి ప్రజలంతా గడగడ వణికిపోతు న్నారనుకొని విర్రవీగుతున్నాడు. మేము రాజదర్బారులో తరతరాలుగా విదూషక వృత్తిచేస్తూవున్నాం. మేము పేరు గన్న పాములవాళ్ళం. నాగుబామేదో, తుట్టిపురుగేదో మాకు బాగా తెలుసు."

ఈ మాటలతో రాజుగారికి పరవశమై పోయింది. పూర్వాంకన్న వేగంగా హుక్కా పీలుస్తున్నాడు, పొగ విడుస్తు న్నాడు. అతనిసభలో ప్రతిరోజూ రెండుమూడు సార్లయినా ప్రతాపాదిత్యునిమీద ఈవిధంగా దాడి సాగుతూనే ఉంది.

నేరస్థుడిని బాగా దబాయించి, భయపెట్టి ఏడిపించిన మీదట రాజు తీర్పు చెప్పేశాడు: "జాగ్రత్త! మతిపూలిన వాడా! ఈసారి బ్రతికిపోయావు పో. ఇక ముందైనా జాగ్రత్తగా ఉండు."

సభాసదులంతా వెళ్ళిపోయారు. ఒక్క మంత్రి, రమేశ భట్టు మాత్రం మిగిలారు.

రమేశభట్టు రాజుగారివైపు చూస్తూ ఇలా చెప్ప సాగాడు: "మీరేమో ఇలా వచ్చేశారు. అక్కడ యువ రాజు తండ్రిమూలాన చిక్కులోనే పడ్డాడు. కూతురు వితం తువై పోతే ఆవిడ గాజులు, సొమ్ములు, హారాలు అమ్మేసి బొక్కసం పెంపుచేద్దాంగదా అని తండ్రి అభిప్రాయ పడ్డాడు. అందుకు కొడుకు అడ్డం తగిలాడాయెను. కాబట్టి కొడుక్కు పెద్దచిక్కే వచ్చింది."

"ఔనౌను" అంటూ రామచంద్రరాయ్ పకపకా నవ్వాడు.

"మహారాజా! నేను విన్న దేమంటే - ప్రతాపాదిత్య కుమారుడు చాల విచారంలో పడికొట్టు కుంటున్నాడట. కూతుర్ని అత్తగారింటికి పంపించటం ఎలాగ అన్న చింతతో చాలా అన్నంనీళ్ళు మానేశాడట" అన్నాడు మంత్రి.

"భేష్! బాగుంది! అదా వ్యవహారం!" అంటూ రాజు పకపకా నవ్వుతున్నాడు; హుక్కా పీలుస్తున్నాడు తృప్తిగా.

ఇలా నవ్వులు, పరాచికాలు సాగిపోతూ ఉంటాయి. ప్రతాపాదిత్యుని, ఉదయాదిత్యుని కల్పిత మూర్తులమీద ఎక్కడలేని అత్యాచారం వాచా సాగుతూ ఉంటుంది. కాని ఉదయాదిత్యునికికూడా ఈదుర్దశ ఎందుకు పట్టవలసివచ్చిందో ఊహించటం కష్టం. అతడు ఎంతో కష్టపడి రామచంద్రరాయ్ ప్రాణాల్ని కాపాడేడు. అందుమూలాన తనకురానున్న కష్టాల్ని కూడా అతడు లెక్కచెయ్యలేదు. అందు కతనియెడల కృతజ్ఞతా భావం చూపవలసింది పోయి రామచంద్రరాయ్, అతని సభాసదులు యావన్మందికూడా అతన్ని గురించి ... ప్రతాపాదిత్యుని కుమారుడు కాబట్టి...అవమాన కరమైన శబ్దాలు ప్రయోగించి పరిహాసిస్తూ ఉన్నారు రామచంద్రరాయ్ ఎట్టి కఠిన హృదయుడని చెప్పటానికి వీల్లేదు అయితే అతడు తేలిక హృదయంగల మనిషి. మనఃప్రవృత్తి చాల సంకుచిత మైనది. తానొక రాజాధి రాజనీ, తన్ను ఇబ్బందులనుంచి రక్షించటం ప్రతి యొక్కని కర్తవ్యం అనీ అతని భావన. ఇటువంటి భావన ఉన్నప్పుడు ఉదయాదిత్యునిపట్ల కృతజ్ఞత ఎలా చూపిస్తాడు? అదీగాక - ఉదయాదిత్యుడు

తన కంత సాయం చేశాడంటే ఎందుకు చేశాడు? తన చెల్లెలి క్షేమంకోరి చేశాడు. కనుక అందులో చాలవరకు అతని స్వార్థమే ఉంది. ఇంకో విషయంకూడా ఉంది. రామచంద్రరాయ్‌కి ఉదయాదిత్యునిపట్ల కృతజ్ఞతా భావం లోలోపల ఏ కాస్తఅయినా వున్నప్పటికీ... ఒకవంక రమేశభట్టు మొదలైన వారంతా భీభత్సంగా పరిహాసం చేస్తున్న సందర్భంలో...నోరు నొక్కుకుని ఊరుకుంటున్నాడు; హృదయ భావం పైకి వెల్లడించగల దార్ఢ్యం అతనికి లేదు.

విభా దేవి అంటే రవంత ఆసక్తి రామచంద్రరాయ్ హృదయంలో ఉన్నట్టే ఉంది. ఆమె నిజానికి అందగత్తె; కొత్తగా యౌవనంలో అడుగుపెట్టింది. ఆనాడు తాను విభను పలుకరించనే లేదు. తద్వారా ప్రతాపాదిత్యునిపట్ల కసితీర్చుకుందామని తన ఉద్దేశం. కాని నిద్ర మెలుకువవచ్చి చూచేసరికి విభ ఏడుస్తోంది. తానే జాలిపడి ఆమె కన్నీళ్ళు తుడిచాడు. ఆ సమయంలో ఆ వెన్నెట్లో ఆమె ముఖ సౌందర్యాన్ని చూచాడు. విరహ వేదనతో ఉబికిపడుతోన్న ఆమె అర్ధనగ్న వక్షస్సీమను చూచాడు. వలపుతీపులు చిలుకరించే కన్నుల్లో అశ్రుబిందువుల తళతళలు చూచాడు. చిగురుటాకువలె కంపిస్తూన్న క్రీపెదవి చూచాడు: ఆ క్షణాన తనలో ఒక రకమైన ఆవేగం పొడసూపింది. ఆ పెదవిని ముద్దు పెట్టుకోవాలన్న తీవ్రతరమైన వాంఛ అంతస్సులో సందడిచేసింది, ఆ నవవికసిత యౌవన లాలిత్యాన్ని గుండెకు హత్తుకోవాలన్న తహతహ రేకెత్తింది. ప్రప్రథమంగా అతని జీవితంలో ఆ రాత్రి ఏదో ఒక విద్యుత్ ప్రవాహం శరీరమంతా పొంగింది. గుండె వేగంగా

వొట్టుకోసాగింది. ముద్దుపెట్టుకుందామని అలా అనుకున్నాడో లేదో ఆ సమయాన బైట తలుపు చప్పుడైంది. ఉలికిపడి ఆగి పోయాడు.

అది అతని హృదయానికి ప్రథమవికాసం; కన్నులకు అపూర్వ సౌందర్యం. నవజీవితానికి ప్రథమ ఉచ్ఛ్వాసం. కాని తీరని కోరిక అవటంచేత అది అతని స్మృతిపథాన్ని వీడలేదు, ఆవరించుకుని ఉంది. అది ఒక స్థిరమైన ప్రేమభావం అవటానికి వీల్లేదు. రామచంద్రరాయ్‌వంటి వ్యక్తుల సంకుచిత హృదయాల్లో దానికి స్థానంలేదు. ఒక షోకిల్లా పురుషుడికి ఒకానొక విలాస సామాగ్రిమీద ఒకొక్క సమయాన సరదా పుడుతుంది. అలాగే రామచంద్రరాయ్‌కీ విభమీద ఒకరకమైన సరదా పుట్టింది. అదొక సరదా; లేదా ఆకర్షణ; అంతే. ఏమైనాగానీ మొత్తానికి రామచంద్రరాయ్ యౌవనస్వప్నంలో విభాదేవి జాగృతమైంది. ఆమెను పొందవలెనన్న అభిలాష అతనిలో ఉత్పన్నమైంది. కాని మనిషి ద్వైధీ భావంలో పడి పోతున్నాడు. విభను తీసుకురమ్మని తాను మనిషిని పంపిస్తే లోకు లేమనుకుంటారు? రాజదర్బారులోని పెద్దపెద్ద లంతా తన్నొక స్త్రీ స్వభావంగల వాడినిగా భావించే అవకాశం ఉంది. మంత్రి అసంతుష్టుడైపోతాడు. రమేశభట్టు తన్ను చూచి లోలోపల నవ్వుకుంటాడు. అదీగాక ప్రతాపాదిత్యుని ఏ విధంగా శిక్షించినట్టు! ఇటువంటి ఆలోచనలతో యువన్ని పంపించటానికి ధైర్యంచాలక అలాగే ఊరుకుంటూ వచ్చాడు. విభనుగురించికూడా రాజ దర్బారులో పరిహాస వాక్యాలు

లేస్తుంటే విని ఊరుకుంటున్నాడేగాని ఏమీ చెయ్యలేక పోతున్నాడు

మంత్రి రమేశభట్టుకూడా వెళ్ళిపోయాక రామమోహన్ వచ్చాడు. వచ్చి నమస్కారంచేసి "మహారాజా!" అన్నాడు.

"ఏమిటి రామమోహన్!"

"తమరు ఆజ్ఞాపించండి మహారాజా! నేను వెళ్ళి మా దొరసానమ్మగారిని తీసుకువస్తాను"

"అదెలాగ వీలౌతుంది రామమోహన్."

"ఎందుకు వీలుకాదు మహారాజా! అంతఃపురం శూన్యంగా పడివుంది; నేను చూడలేకండా వున్నాను. అక్కడికి వెడితే మహారాజావారి గదిలో యెవరూ కనిపించరాయెను. నాకు గుండె తరుక్కుపోతుంది. మా లక్ష్మీదేవమ్మగారు రావలసిందే; ఇల్లు కళకళలాడవలసిందే. అప్పుడూ మా కళ్ళకు సార్థకత! మీరు 'ఊఁ' అనండి మహారాజా! వెళ్ళి తీసుకు వస్తాను."

"నీకేమన్నా పిచ్చెత్తిందా రామమోహన్! ఆ ఇంటి పిల్లను తీసుకు వచ్చి నా యింట్లో అట్టిపెట్టుకుంటానా?"

"అలాగంటారేం మహారాజా! మా దొరసానమ్మగారు ఏం తప్పు చేశారనీ?"

"నీకేం తెలుసు రామమోహన్! ప్రతాపాదిత్యుని కూతుర్ని నా యింటికి తీసుకు రావటమా?"

"ఎందుకు తీసుకు రాకూడదు! ప్రతాపాదిత్యునితో ఆమెకేం సంబంధం. పెండ్లి కాకుండా ఉన్నంతకాలమే ఆమె ఆ

తండ్రి కూతురు. పెండ్లి అయిన తరువాత యిక ఆ తండ్రి అధికారం యేముంది? ఇప్పుడామె మీకు మహారాణి-మీరే ఆమెను ఇంటికి తెచ్చుకోటానికి సంకోచిస్తే ఎలాగ? మీరే అమెగారిని గౌరవించకపోతే ఇంకెవరు గౌరవిస్తారు మహా రాజా!''

''ప్రతాపాదిత్యుని కూతుర్ని నేను పెళ్ళాడటమే ఆమెకు పెద్ద గౌరవం. పైగా ఆమెను ఇంటికికూడా తెచ్చుకోనా? అదెలా వీలౌతుంది రామమోహన్. ఇక నాకు మర్యాద ఏముంటుంది?''

''మర్యాద అంటారా మహారాజా! మీ అర్ధాంగి ఎక్కడో ఎవరింట్లోనో వుండటం, ఆమెపై మీకే యధికారమూ లేకపోవటం, మరెవరో ఆమెమీద ఇష్టంవచ్చినట్లు ప్రభుత్వం చలాయిస్తూ ఉండటం - ఇందువలన మీ మర్యాద పెంపొందుతున్న దంటారా?''

''మరి ప్రతాపాదిత్యుడు కూతుర్ని పంపకపోతే?''

రామమోహన్ ఛాతీ పెరిచి నిల్చున్నాడు. ''ఏమన్నారు మహారాజా! మీ మహారాణీగార్ని ప్రతాపాదిత్యుడు పంపడా? మీ మహారాణీగార్ని ఇక్కడికి రానీకుండా అడ్డగించగల సాహసం ఎవరికైనా ఉన్నదా! ఆమెగారు మాతల్లి. మా యింటికిలక్ష్మీదేవి. మా అమ్మను మాకుగాకుండా చేసే దుస్సాహసానికి ఎవరు తెగుతారో చూస్తాగా! ప్రతాపాదిత్యుడు గొప్పరాజైతే కావచ్చు. అయినాసరే. అతన్నికూడ ధిక్కరించి మా అమ్మను నేను తెచ్చుకుంటాను. తప్పకండా

తెచ్చుకుంటాను. వద్దంటానికి మీకు మాత్రం ఏం అధికారం ఉంది?" అంటూ బయలుదేరి వెళ్ళటానికి ఉద్యుక్తుడైనాడు.

"రామమోహన్! ఉండు-ఉండు - ఒకమాట వినిపో. రాణిగార్ని నువ్వు వెళ్ళి తీసుకు రాదలిస్తే వెళ్ళు. నాకేం అభ్యంతరంలేదు. కాని నేను నిన్ను పంపించానన్న సంగతి మాత్రం ఎవరికీ తెలియకూడదు — మంత్రికిగాని, రమేశ భట్టుకుగాని —

"తెలియదులెండి మహారాజా! ఎవరికీ తెలియదు" అంటూ రామమోహన్ వెళ్ళిపోయాడు.

రాణివచ్చాకనైనా అందరికీ తెలియకుండా ఉంటుందా! సరే, అప్పటిసంగతి అప్పుడాలోచించుకోవచ్చు. ఇప్పుడేం తొందర? ప్రస్తుతానికి మాత్రం బెడదేం లేదుగా అని ఊరుకున్నాడు.

## 20

అన్నయ్య విచారం మరచిపోయి సుఖంగా ఉండాలి. అదీ విభాదేవి కోరిక. సర్వవిధాలా ఆమె అందుకే ప్రయత్నిస్తూఉంది. రాను రాను అది ఆమె ఏకైక కర్తవ్యం అయింది. అతని పనులన్నీ తాను స్వయంగా చేస్తుంది. భోజనాది దైనందిన చర్యలలో ఏ మాత్రం లోపం రానీదు. సాయంత్రమప్పుడు ఉదయాదిత్యుడు వచ్చి గదిలో కూచుంటాడు. విభ వచ్చి అతని పాదాల దగ్గర కూచుంటుంది. ఉదయాదిత్యుడు రెండు చేతుల్లో ముఖం వాల్చుకుని మౌనంగా ఉంటాడు. బహుశా అతని కన్నులు అశ్రుసిక్తములై

ఉండచ్చు. విభ ఏమో కబుర్లు చెబుదా మనుకుంటుంది. కాని నోటివెంట ఒక్క మాటకూడా రాదు. ఇద్దరూ స్తబ్ధంగా అలా కూచుండిపోతారు. మధ్యమధ్య గదిలోని దీపపుకాంతి గోడమీద కనిపించుతూ ఉంటుంది. విభ అటు చూస్తుంది. చూచి చూచి అకస్మాత్తుగా "అన్నయ్యా! వదినె ఎక్కడికి పోయిందీ?" అంటూ ఏడుస్తుంది. ఉదయాదిత్యుడు ఉలికి పాటుగా మొగం మీదినించి చేతులుతీసి చూస్తాడు ఆమె వైపు – 'ఏమిటి నువ్వు అనేది? నాకేం అర్థంకావటంలేదే!' అన్నట్టు. తిన్నగా మళ్ళీ మామూలు ప్రపంచంలోకి వస్తాడు. కన్నీళ్ళు తుడుచుకుని "ఇదిగో విభా! నీ కొక కథ చెబుతా విను" అంటాడు.

వర్షాకాలం; పొద్దస్తమానం వర్షమే. ఆకాశంనిండా నల్లని మేఘాలు. నలుదిక్కులా చీకటి నీడలు. తోటలో చెట్లు వర్షానికి నాని నీళ్ళు గారుతున్నాయి. ఒకొక్కప్పు డొకొక్క జడివానజల్లు గాలి తోపుగు గదిలోకికూడా వస్తున్నది. మాట పలుకు లేకండా ఉదయాదిత్యుడు కూచుని వున్నాడు. అవిరామంగా పడుతున్న ఆ వర్షపు. జల్లుల రొదలో 'సురమ లేదు, సురమ లేదు, సురమ లేదు' అన్న మాట లతని చెవుల్లోకి పొడుచుకు వస్తున్నవి. మధ్య మధ్య గాలి తరగలు జోరుగా చొరవ జేసుకునివచ్చి 'సురమ ఏదీ?' అని ప్రశ్నిస్తున్నాయి. మెల్లగా విభాదేవి వచ్చి 'అన్నయ్యా' అని పిల్చింది. అన్నయ్య ఏమీ మాటాడలేదు విభను చూడగానే దోసిలిలో ముఖం కప్పుకుని, కిటికీ కొయ్యకు తల ఆనించి వాలిపోయాడు. వాన జల్లుతో అతని తలంతా

తడిసిపోయింది. ఇలా పగళ్ళు, సాయం సమయాలు, రాత్రిలు గడిచి పోతున్నవి. విభ అన్నయ్యకోసం భోజనం తయారుచేసి కంచంలో పెట్టుకుని తీసుకు వస్తుంది. "లే, అన్నయ్యా! భోజనం చెయ్యి" అంటుంది. ఉదయాదిత్యు డేమీ జవాబు చెప్పడు. రాత్రి చాల పొద్దుపోతుంది. "చాల పొద్దుపోయింది, అన్నయ్యా! లే" అంటుంది విభాదేవి గద్గద కంఠస్వరంతో. ఉదయాదిత్యుడు తలెత్తి చూస్తాడు. విభ ఏడుస్తూ ఉంటుంది. వెంటనే లేచివచ్చి ఆమె కన్నీళ్ళు తుడుస్తాడు; భోజనంముందు కూచుంటాడు. ఏదో నాలుగు మెతుకులు కొరుకుతాడు; సరిగా భోజనం చెయ్యడు. విభ చూచి నిట్టూర్పు విడుస్తుంది. వెళ్ళిపోయి పడుకుంటుంది. తానూ భోజనం చెయ్యదు.

అన్నయ్యకు కాలక్షేపంగా ఆయా ముచ్చట్లుచెబుతూ కూచుందామని విభ ఉద్దేశం. కాని ఎంతోసేపు మాటాడ లేదు. అన్నయ్యకు సుఖం కల్పించట మెలాగో ఆమెకు బోధపడటంలేదు. 'అయ్యో! ఇప్పుడీ సమయంలో తాతయ్య ఉంటే బాగుండునే' అనుకుంటూ ఉంటుంది మాటి మాటికి.

రాను రాను ఉదయాదిత్యుని హృదయంలో ఒకరక మైన భయం గూడు కట్టుకోసాగింది. తండ్రి అంటే ఒక పెద్ద భయం ఏర్పడిపోయింది. పూర్వపు సాహసం ఇప్పు డేమాత్రం లేదతనిలో. ఆపదలను, అన్యాయాల్ని, అకృ మాల్ని ఎదుర్కొనే శక్తి లుప్తమై పోయింది. ప్రతి పని లోనూ ద్వైధీభావమే, ప్రతి మాటలోనూ సంశయమే.

ఎక్కడో ఏదో దుర్ఘటన జరిగిందీ అన్నవార్త వినగానే వెంటనే గుర్రం సిద్ధంచేసి పట్టుకురమ్మని ఆజ్ఞాపిస్తాడు. కాని తీరా గుర్రం వచ్చేసరికి ఎక్కడికి వెళ్ళాలో, ఏమి చేయాలో గుర్తుకు రాదు. అప్పుడప్పుడు బైటినుంచి ఎవరో ఏడుస్తున్నట్టు వినిపిస్తుంది. బైటికిపోయి చూస్తాడు. రాజోద్యోగులు ఒక పౌరుని చెట్టుకుకట్టి దెబ్బలు కొడుతూ ఉంటారు. ఆ బీదరైతు ఏడుస్తూ 'రక్షించండి, యువరాజా!' అని పిలుస్తాడు. పాపం. యువరాజు చూడలేక లోపలికి వెళ్ళిపోతాడు. పూర్వం ఇలా ఉండేవాడు కాదు. తరువాత ఏమైనాసరే, ముందు మాత్రం రాజోద్యోగుల్ని అటకాయించేవాడు; ప్రజల్ని రక్షించటానికి చేతనైనంత వరకు ప్రయత్నం చేసేవాడు.

సీతారామ్‌కూ, భగవంతానికీ పంపబడుతున్న మాసిక సహాయం ఆగిపోయింది బహిరంగంగా గాని, రహస్యంగాగాని ఏ విధంగానూ సహాయంచేసే సాహసం అతనిలో ఇప్పుడేమాత్రం లేదు. తన ప్రాణాలమీది తీపిచేత ఇలా మారిపోయాడనటానికి వీల్లేదు. నిజానికి అతని హృదయంలో ఒక గుడ్డిభయం గూడు కట్టుకుపోయింది. త్రండ్రి ఒక భయంకర మూర్తిలా కనిపించాచగాడు. తన అదృష్టం, తన భవిష్యత్తు – అంతా ప్రతాపాదిత్యుని పిడికలిలో బంధితమై యున్నట్లొక భావం అతని మనస్సులో కుదురుకుపోయింది. తన ప్రాణోత్క్రమణ సమయంలోనైనాసరే...... 'ఊహుఁ నువ్వు చచ్చిపోవటానికి వీల్లేదు' అని ప్రతాపాదిత్యుడు గనక కన్నెర్ర చూపి బెదిరిస్తే...

తీక్షణంగా పలికాడూ అంటే... మృత్యువదన గహ్వారంలో నించైనా మళ్ళీ బయటికి తప్పదల్లే కనిపిస్తున్నది.

## 21

వితంతువు రుక్మిణివద్ద కొంత నగదు ఉంది. ఇక్కడామె మంగళాంబగా చలామణి ఔతూ, వడ్డీ వ్యాపారం సాగించి పొట్టపోసుకుంటూ ఉంది. రూపం ఉంది; రూపాయలు ఉన్నాయి. వాటి సహాయంతో ఆమెకు చాలమంది వశీకృతులైనారు. సీతారాం శాస్త్రి షోకిల్లామనిషి. కాని అతని చేతిలో పైసా కూడా లేదు. కాబట్టి మంగళాంబ రూపం అన్నా, ఆమెదగ్గరున్న రూపాయలన్నా అతని కెంతైనా మోజు. యింటో కుండలు డీకీలు కొడుతూవుంటే; అతడు పూలరంగడులా తయారై, లాఠీ ఒకటి చేతబుచ్చుకుని వీధి వెంట వెళుతూ ఉంటాడు. ఎక్కడికీ? మంగళాంబయింటికి. దారిలో యెవరైనా కనిపించి 'ఏమోయి, సీతారాం? ఎలాగడుస్తున్నాయి రోజులు?' అని అడిగితే, ఛాతివిరిచి, ఠీవిగా నిల్చుని 'భలే మజాగా వెడుతున్నాయిలే. నిన్న మా యింట్లో పెద్ద విందుచేశాను. మా వాడకట్టంతా వచ్చి భోజనాలు చేసి వెళ్ళారు' అంటాడు. యెటువంటి పరిస్థితిలోనూ మాటలు కోటలు దాటిస్తాడు. ఆర్థికంగా పరిస్థితి దిగజారుతూన్న కొద్దీ మాటల్లో బడాయి పెరుగుతూ ఉంటుంది. ప్రస్తుతం అతని పరిస్థితి మరీ దిగనాసిగా ఉంది.

డబ్బవసరం ఇప్పుడెంతైనా ఉంది అతనికి – వచ్చాడు రుక్మిణి యింటికి – నవ్వుతూ మొదలుపెట్టాడు——

'భిక్షపెట్టవే రాధా!
వెండీ బంగారమ్ములు కాదే
ప్రేమభిక్ష నే నడిగెద!
మానరత్నభిక్షార్థిని తరుణీ!
ప్రాణరక్షణము సేయగదే!'

ఊహుఁ – అలాకాదు అడగవలసింది. మానరత్నంతో ఇప్పుడు పెద్ద అవసరం ఏమీలేదు. ప్రేమసంగతి అవసరం వచ్చినప్పుడు చూచుకోవచ్చు. ప్రస్తుతానికి కాస్త వెండి దొరికితే పనైపోతుంది. అదీ సంగతి"

"నీకు అవసరం రావటం, నేను ఇవ్వకపోవటమూనా? నీకు గాకపోతే ఇంకెవ్వరికి ఇస్తాను చెప్పు" అన్నది రుక్మిణి విస్తారమైన అనురాగం అభినయిస్తూ.

సీతారాం వెంటనే అందుకుని ఇలా అన్నాడు: "అవసరం అంటే మరేంకాదు; విషయం ఏమిటంటే – మా అమ్మదగ్గర రూపాయలు లేకపోలేదు. డబ్బు నా దగ్గరేమీ అట్టిపెట్టుకోనుగా! మా అమ్మ ఇనాళ జోడాఘాట్ వెళ్ళింది; అల్లుడిగారింటికి వెళ్ళేటప్పుడు డబ్బుతీసి నా కివ్వడం మరచిపోయింది కామాలు. రేపు మళ్ళీ నీకు తెచ్చి ఇచ్చేస్తాను. ఎక్కువ అక్కర్లేదు. పది రూపాయలుమాత్రం ఇవ్వు ప్రస్తుతానికి."

మంగళాంబ తనలో తాను నవ్వుకుంది. "అంతతొందరేమొచ్చిందీ. నీ కెప్పుడు వుసులుబాటుగా ఉంటే అప్పుడే ఇద్దువుగాని. నీ కిస్తున్నాను గాని ఏట్లో పారెయ్యడంలేదుగా!"

నిజం చెప్పవలసివస్తే - పోగొట్టుకున్నా మళ్ళీ దొరకవచ్చునన్న ఆశ ఉంటుంది. సీతారాంకు ఇ స్తేమాత్రం మళ్ళీతిరిగి రావడం కల్ల. అంతే భేదం.

మంగళాంబ అభినయించిన అనురాగ లక్షణాలు చూచేసరికి సీతారామ్ లోలోపల ఉబ్బితబ్బిబ్బైనాడు. వలపు మొలకెత్తింది. కాస్తరసికత చూపిద్దామనుకున్నాడు. చేతిలో పైసా లేకపోయినా నవాబుపోకిళ్ళు అతనికి బాగా అలవాటే. నోటికి ఏది వస్తే అది అనేస్తూ ఉంటాడు. ఆ మాట యితర్లు యెలా తీసుకున్నారా అనే ఆలోచన లేకుండా ముందుగా తనే పకపక నవ్వేస్తాడు. అతని నవ్వుచూస్తే ఎవరికైనా నవ్వొస్తుంది. రాజుగారి దగ్గర ద్వారపాలకుడుగా పనిచేస్తున్న రోజుల్లో మిగతా పహారావాళ్ళ చేతుల్లో చెప్పుదెబ్బలు తినే టంత పరిస్థితికి తెచ్చుకుంటూ వుండేవాడు తరచు. కారణం ఏమిటంటే_ తనకు హాస్యంగా కనిపించేదాన్ని ఇతర్లుకూడా హాస్యంగా తీసుకోరు. ఒకసారి హనుమాన్ప్రసాద్ పహారా కాస్తున్నాడు. నిద్ర వచ్చిందికామాలు, కూర్చుని కునికిపాట్లు తీస్తున్నాడు. సీతారామ్ మెల్లగా వెనుకనించి వచ్చి అతనివీపు మీద గట్టిగా గుద్ది పకపకా నవ్వసాగాడు. హనుమాన్ ప్రసాద్కూడా గుద్దుకూ, హాస్యానికీ ఏమంత తేడా లేదుకదా అనుకుని సీతారామ్కు భలే ప్రతీకారమే చేశాడు. ఆనాడు మొదలుకుని సీతారామ్ మళ్ళీఅతగాడితో హాస్యానికిదిగలేదు.

సీతారామ్లో వలపుఉబికిందిగా! మెల్లగాపోయి, రుక్మిణివొళ్ళు తాకుతూ, ఎంతో ప్రేమగా "నువు నా సుభద్రవు; నేను నీ జగన్నాథుడిని" అన్నాడు.

"ఏడిచావులే _ తెల్ల మొగమా; సుభద్ర జగన్నాథు డికి చెల్లెలు కాదూ!"

"అదేమిటి అలాగంటావేం? అయితే మరి సుభద్రాపహరణం ఎలా జరిగింది?"

రుక్మిణి నవ్వింది. సీతారామ్ ఛాతీవిరిచి "ఊహుం. నేను ఒప్పుకోను. అలానవ్వితే కాదు. సుభద్ర చెల్లెలే అయినట్లయితే సుభద్రాపహరణం ఎలా జరిగింది? అని అడుగుతున్నాను" అన్నాడు. భలే చక్కని యుక్తి విసిరా ననుకున్నాడు. దానికి జవాబులేదని అతనినమ్మకం.

"పో. పో. తెలివి తక్కువవాడా!" అన్నది రుక్మిణి మృదువుగా.

సీతారామ్ రవంత చిన్నబుచ్చుకున్నాడు. నేను తెలివి తక్కువాడినేలే. నీముందు నేనెప్పుడూ ఓడిపోతూనేఉన్నాను" అంటూ; భలే సమాధానం చెప్పాను; సమయానికి చక్కని మాటలు స్ఫురించాయి అనుకున్నాడు మనస్సులో. మళ్ళీ ఇలా అన్నాడు పైకి. "సరే పోనీ, సుభద్ర అని పిలవటం నీకు ఇష్టంలేకపోతే చెప్పుమరి, ఎలా పిలిస్తే నీకు సంతోషంగా ఉంటుందో!"

"ప్రియా! అని పిలు" అన్నది రుక్మిణి నవ్వుతూ.

"ఊం. ప్రియా!"

"ప్రాణ ప్రియా! అని పిలు"

"ప్రాణప్రియా! బాగుంది. ఇంతకూ ప్రాణప్రియా! నువు ఇచ్చిన డబ్బుకు ఎంతవడ్డీ ఇవ్వమంటావు?"

రుక్మిణికి కోపంవచ్చింది. మూతి ముడుచుకుంది. "పో. పో. ఇదేనా నీప్రేమ? వడ్డీమాట ఎలావచ్చింది నీనోట్లోనించి?"

సీతారాం ఆనందంతో పులకించిపోయాడు. "ఎబ్బెబ్బే అది కాదు. తమాషాగా అన్నాను. నీవు పరాచికంకూడా తెలుసుకోలేవేం? ఛీ. ప్రియతమా!"

సీతారాం తల్లికి ఏంజబ్బో మరి! ఎప్పుడుపడితే అప్పుడు అల్లుడుగారింటికి పోతుంది; పోతూ పెట్టెలో డబ్బుతీసి సీతారాంకు ఇవ్వటం మరిచేపోతుంది ప్రతిసారీ. తత్ఫలితంగా సీతారాం పలుసార్లు రుక్మిణి యింటికి రాక తప్పటంలేదు. మొత్తానికి ఈవిధంగా క్రమేణా సీతారాంకీ, రుక్మిణికీ ప్రగాఢ మైత్రి ఏర్పడిపోయింది. రహస్యాలోచనలు పెరిగాయి. "ఇదంతా నా వక్కడివల్లాకాదు. భగవంతం సాయంలేకపోతే పనికాదు" అన్నాడు సీతారాం ఒకనాడు.

ఆనాడు సాయంత్రం భోరున వర్షం కురుస్తోంది. పెద్ద తుపాను. రాజుగారి కోటతలుపులన్నీ బందుచేసి వున్నాయి. గాలి జోరుగా వీస్తోంది. తోటలోని చాలచెట్లు కుదుళ్ళు కదలి నేలకు ఒరిగి పోయాయి. మాటి మాటికీ మెరుపులు, ఉరుములు. ఉదయాదిత్యుడు తలుపులన్నీ వేసుకుని లోపల కూచున్నాడు. ఒడిలో ఒక చిన్నమ్మాయి ఉంది. గదిలో దీపం ఆరిపోయింది. ఒడిలో అమ్మాయి నిద్రపోతోంది. ఆ అమ్మాయంటే సురమకు ఎంతో ప్రేమ. సురమ చనిపోయాక ఆపిల్లతల్లి ఆ అమ్మాయిని రాజమహాలుకు పంపించటం మానివేసింది. చాలరోజు లయాక ఇవాళ ఆపిల్ల ఆడుకుంటూ ఆడుకుంటూ రాజమహాలు లోకి వచ్చింది. యువరాజునుచూడ

గానే 'బాబాయి, బాబాయి' అంటూ పిల్చింది. ఉదయాదిత్యు డాపిల్లను ఎత్తుకుని లాలిస్తూ గదిలోకి తీసుకొచ్చాడు. 'సురమకు 'ఈ పిల్లంటే ఎంతో అపేక్ష. ఈ పిల్లను చూడ్డానికి సురమ వస్తే రావచ్చు'అని ఉదయాదిత్యుని ఆశ. "బాబాయి! మాపిన్ని ఏది?" అని అడిగిందా పిల్ల. 'నువ్వు పిలు, వస్తుందేమో!' అన్నాడు ఉదయాదిత్యుడు. ఆపిల్ల 'పిన్నీ, పిన్నీ' అని పిలవసాగింది. ఆపిలుపుకు ఎవరో పలుకుతున్నట్టు వినిపించిందతనికి. 'ఇదిగో, ఇక్కడున్నా' నని ఎవరో పలుకుతున్నట్టు వినిపించింది. ప్రేమార్ద్రమైన పిలుపు వినగానే ఆ స్నేహమయి ఉండబట్టలేక వస్తున్నదా? అమ్మాయిని ఆప్యాయంగా ఎత్తుకోటానికి! పిల్ల నిద్రపోయింది; పిల్లను ఒడిలో పెట్టుకుని చీకటింట్లో అలాగే కూచున్నాడు ఉదయాదిత్యుడు.

బయట బయ్‌మని గాలిచప్పుడు. అక్కడక్కడ గాలికి కొట్టుకుంటున్న కిటికీతలుపుల చప్పుడు. అకస్మాత్తుగా ఎవరో వస్తున్నట్టుగా పదధ్వనులు! ఔను పదధ్వనులే. ఉదయాదిత్యుని హృదయం దడదడ కొట్టుకోసాగింది. ఆ దడదడలో బైట గడబిడ ఏమిటో అర్థం కాలేదు. ఇంతలో గది తలుపులు తెరుచుకున్నాయి. గదిలో దీపపు కాంతులు వచ్చాయి. నిజమా? కలా? దీపమొకటి చేతిలో పుచ్చుకుని ఒక యువతి గదిలో ప్రవేశించింది. కళ్ళు తెరిస్తే వచ్చిన సురమాదేవి ఎక్కడ పారిపోతుందోన ఉదయాదిత్యుడు కళ్ళు మూసుకునేవున్నాడు. "సురమా! వచ్చావా!" అన్నాడు.

"ఏం నన్ను మరచిపోయావేమిటి?" అన్న దా స్త్రీ చేతిలోని దీపం పక్కన పెట్టి.

ఆ కఠోరమైన కంఠధ్వని వినిపించేసరికి ఉదయాదిత్యునికి నిద్రమత్తు వీడిపోయిన ట్లనిపించింది. ఉలికిపడ్డాడు. కళ్ళు తెరచి చూచాడు. రుక్మిణి! ఒడిలోని పిల్లకూడా మేల్కొని ఏడవసాగింది. ఉదయాదిత్యుడు లేచి పిల్లను పక్కమీద పడుకోబెట్టాడు. ఏం చెయ్యాలో ఎక్కడికి వెళ్ళాలో అతనికేం పాలుపోవటంలేదు. రుక్మిణి అతనికి చేరువుగా వచ్చింది. కళ్ళు ఆడిస్తూ "ఔనులెండి నేనెందుకు జ్ఞాపకంఉంటాను? ఇలాంటి మనిషిని మరి" అన్నది. ననా కెందుకన్ని ఆశలు కల్పించి ఆకాశాని కెక్కించావు?" అన్నది. ఉదయాదిత్యుడు విస్తుపోయి అలాగే నిల్చున్నాడు. మాటాడలేక పోయాడు. అప్పుడిక రుక్మిణి బ్రహ్మాస్త్రం ప్రయోగించింది. ఏడుపు ఆరంభించింది. "నేను నీకేమపకారం చేశాను? నా తప్పేమిటి? ఈ నా డిలా నీ కంటికి నెరుసులా అయిపోయానే! నన్నన్ని విధాల నాశనం చేసింది నువ్వేగా! తన మనస్సు, శరీరం సర్వస్వం యువరాజుకు అర్పణ చేసుకున్న యువతికి ఈనాడు పడిపంచల బిచ్చమెత్తుకోవలసిన గతిపట్టిందే! ఈ నొసటిమీద భగవంతు డంతేనా రాసింది!" అన్నది ఏడుపు జోడిస్తూ.

యువరాజు హృదయం గాయపడ్డది. నిజానికి తనవల్లనే ఆమె దుర్గతి పాలైనట్టు భావించసాగాడు. గతం ఎప్పుడో మరచిపోయాడు. యౌవనోన్మాదిని రుక్మిణి వలపన్ని ఏ విధంగా తన్ను వశపరచుకున్నదో— ఆ విషయమంతా ఎప్పుడో మరచిపోయాడు. తానొక అజగరానికి ఆహారమై, ఆనాడు పాతాళ

లోకంలోని చీకటికూపంలో పోయిపడ్డ సంగతంతా మరచే పోయాడు. అంతా మరిచేపోయాడు. రుక్మిణి ఏడుస్తూ ఇప్పుడు ప్రత్యక్షమైంది. పాపం! చాల దురవస్థలో ఉందికామాలు! "నీకేంకావాలి ఇప్పుడు?" చాల దయగాఅడిగాడు యువరాజు.

"నాకు మరేమీఅక్కర్లేదు; కేవలం నీ ప్రేమకావాలి. నేనా కిటికీవద్ద కూచుని నీ గుండెలో తలదాచుకుని, నీ బుజ్జగింపు నీ ప్రేమ అనుభవించాలని నా కోరిక - ఏం? సురమాదేవి ముఖంకన్నా నా ముఖం నల్లగా వుందా? నీ మూలాన్నే నల్ల బడింది; ఆ వంచ ఆ పంచ తిరిగి తిరిగి, ఆ నాడు నల్లగా లేదేం?" అంటూ ఉదయాదిత్యునిమంచంమీద వెళ్ళి కూచో టానికి ఉద్యుక్తురాలైంది. ఇక ఉదయాదిత్యుడు ఉండబట్టలేక పోయాడు. "వద్దు - వద్దు - నువు అక్కడ కూచోవద్దు - దూరంగా ఉండు" అన్నాడు వణుకుతూన్న కంఠంతో.

రుక్మిణి తోకతొక్కిన త్రాచులా అయింది. పడగ విప్పింది "ఎందుకుకూచోకూడదు? దూరంగాఎందుకుండాలి?" అన్నది. ఉదయాదిత్యుడు అడ్డంగావచ్చి నిల్చున్నాడు. "ఉహూఁ. నువు ఈ మంచందగ్గరికి రాబోకు. నీకేం కావాలో చెప్పు. ఇప్పుడే ఇస్తాను" అన్నాడు.

"సరే అయితే - నీ ఆ ఉంగరం ఇలా ఇవ్వు."

అప్పటికప్పుడు ఉంగరంతీసి అవతలపారేశాడు ఉద యాదిత్యుడు. రుక్మిణి అదిపుచ్చుకుని వెళ్ళిపోయింది వెళ్ళుతూ వెళ్ళుతూ మనస్సులో అనుకుంది. 'ఇంకా అబ్బాయికి ఆ దెయ్యంమీది మోహం దిగలేదు ఇంకా కొన్నాళ్ళుపోవాలి. అప్పుడు నా మోహమంత్రం మళ్ళీ ప్రయోగిస్తాను.'

రుక్మిణి వెళ్ళిపోయాక ఉదయాదిత్యుడు మంచంమీద కూచుని, దోసిటలో ముఖంవాల్చుకుని ఏడ్చాడు. "ఎక్కడున్నావు సురమా నువు? పిడుగుపడి దగ్ధమైపోయిన నా హృదయానికి ఈనాడు నువు లేవుకదా! ఎవరిస్తారు శక్తి! ఎక్కడున్నావు నువు సురమా! సురమా!..."

## 22

భగవంతం పరిస్థితికూడా ఏమీ బాగాలేదు. అస్తమానం ఇంటి అరుగుమీద కూచుని హుక్కా పీలుస్తూ ఉంటాడు - అత డిలాగ అస్తమానం హుక్కా పీలుస్తూ ఉండటం చూచి ఆ వాడకట్టువాళ్ళంతా భయపడసాగారు. యెందువల్లనంటే - నిరంతరం అతని నోట్లోనించి నల్లగా పొగ వస్తున్నదాయెను! అతని మనస్సులోకూడా ఏదో ఒక దుష్టమైన కార్యానా ఉండి వుండాలని వాళ్ళు అభిప్రాయపడ్డాడు. భగవంతం అసలు ధర్మాత్ముడనే పేరు పడ్డాడు. ఏదైనా పనివుంటే చేసుకుంటాడు; లేకపోతే జపమాల తీసుకుని తిప్పుతూ ఉంటాడు. యెక్కువగా యెవరితోనూ మాటాడడు. అనవసరంగా ఇతర్లను గురించి యెక్కడా చర్చించడు. ఊరికే ఎవరితోనూ కలిసి మెలిసి బాతాఖానీకి దిగడు. ఎవరికేనా ఏదైనా ఇబ్బంది వచ్చినప్పుడు చక్కని సలహా ఇస్తాడు. బుద్ధిపూర్వకంగా యెవరికీ అపకారం చెయ్యడు. తన కెవరన్నా అపకారం చేస్తేమాత్రం జన్మలో మరచిపోడు. ప్రతీకారం చేసిగాని నిద్రపోడు. ప్రపంచంలో మంచివాళ్ళుగా చలామణీ అయేవాళ్ళలో భగవంతం ఒకడు వాడకట్టులో ఉన్నవాళ్ళందరికీ అతనంటే గౌరవమే-ముఖ్యంగా

ఎందువల్లనంటే — ఆమధ్య ఇల్లుగడవని రోజుల్లో చాలమంది దగ్గర అప్పులు చేశాడు; కాని చివరకు వెండివళ్ళెం అమ్మేసి అందరి బాకీలు తీర్చేశాడు.

ఒకనాడు తెల్లవారేసరికి సీతారామ్ వచ్చి పరామర్శ మొదలుపెట్టాడు: "ఏం, తమ్ముడూ భగవంతం! ఎలా గడుస్తున్నాయి రోజులు?"

"ఏమంత బాగా లేదోయ్"

"ఏం? ఏం? ఎందువల్ల?"

భగవంతం హుక్కా గొట్టం నోట్లోనించి తీయకుండా పీలుస్తున్నాడు. వెంటనే సమాధానం చెప్పలేదు. చివరకు హుక్కా గొట్టం సీతారామ్‌కు అందిస్తూ — "చాల కష్టంగానే ఉన్నదోయ్" అన్నాడు.

"ఏం? సంగతేమిటో చెప్పు అసలు?"

భగవంతానికి మనసులో కాస్త విసుగు పుట్టింది. "సంగతేమిటో నీకుకూడా చెప్పాలా? మనిద్దరిగతీ ఒకలాంటిదేగా!"

సీతారామ్‌కు కొంచెం రోషంవచ్చి. "కాదోయ్ తమ్ముడూ! అదిగాదు నేననేది. అప్పో, సొప్పో చేసి కాలం గడుపుకోలేవూ అంతమాత్రం?"

"అప్పుచేస్తే తీర్చవద్దూ! ఎలా తీరుస్తాను. అమ్మేందుకు గాని, తాకట్టు పెట్టేందుకుగాని నా దగ్గరేముందనీ?"

సీతారామ్ ఛాతి విరిచాడు. "నీ కిప్పుడెంత డబ్బు కావాలో చెప్పు; నే నిస్తాను"

"నీ దగ్గర అంత యెక్కువగా డబ్బు ఉన్నదన్నమాట! అయితే ఒక గుప్పెడు రూపాయలు భావిలో పోసినా నీకేం యిబ్బంది ఉండదు. కాబట్టి నాకు ఒక పది రూపాయలు ఇవ్వు కాని ముందే చెబుతున్నాను అబ్బాయి:! మళ్ళీ తిరిగి యిచ్చే తాహతు నాకు లేదు."

"నువ్వు ఆ భయమేం పెట్టుకోకు"

సీతారామ్ ఈవిధంగా సాయం చేస్తానన్నాడు కదా అని ఆ యిద్దరి మధ్య స్నేహం పొంగి పొరలలేదు. చిలుము గొట్టంలో ఇంత పొగాకు వేసి, వెలిగించి, తీరుబాటుగా కూచుని పీలుస్తున్నాడు భగవంతం.

"ఇదిగో తమ్ముడూ! రాజుగారు చేసిన అన్యాయం వల్ల మనం ఎలా చచ్చిపోతున్నామో చూడు!" అన్నాడు సీతారాం మెల్లిగా.

సీతారామ్ కనబరుస్తూన్న ఔదార్యం భగవంతానికి అసహ్యాకర మనిపించింది. లోలోపల మండిపోతూనే ఉన్నాడు మనిషి.

"మరేంలేను తమ్ముడూ! మనలోమాట చెబుతున్నాను. ఇప్పుడు కాకపోతే ఇంకాకొన్నాళ్ళకయినా సరే మనపరిస్థితులు మరీ విషమించిపోతాయి, తప్పదు"అన్నాడు మళ్ళీ సీతారాం.

"రాజుగారే అన్యాయానికి దిగితే మనబోటివాళ్ళం ఏం చేస్తాం చెప్పు?"

"యువరాజు గనక సింహాసనం ఎక్కితేనా? రామ రాజ్యమే అనుకో – అంతవరదాకా మనం ఇలా మగ్గిపోతూ ఉండవలసిందే" భగవంతానికి కోపం వచ్చేసింది. "ఎందుకోయి

ఈ విషయాలన్నీ? మనకేం సంబంధం? నువు ఒక పెద్ద అమీరువై పోయావు. ఇంట్లో కూచుని రాజుల్ని, వజీర్లను హత్య చేస్తూఉండు నీయిష్టంవచ్చినట్లు. నీ కద అందం, చందం. నేను బీదవాడిని; నా కా ధైర్యసాహసాలు ఎక్కడ ఏడిచాయి? ఎవరు రాజైతే మనకేమి హాని! చెలికత్తె కాగలదే ఎప్పుడైనా రాణి'—"

"అలా కోపం తెచ్చుకుంటావేం? తమ్ముడూ! నేను చెప్పేది కాస్త వినిపించుకో మరి!" అంటూ రహస్యంగా ఏమేమో చెప్పసాగాడు.

భగవంతానికి అకస్మాత్తుగా కోపం వచ్చేసింది. "ఇదిగో సీతారాం! నేను చెబుతున్నా విను. ఇటువంటి విషయాలు నాతో ఎప్పుడూ ఎత్తబోకు"

సీతారామ్ అప్పటికైతే వెళ్ళిపోయాడు. తరువాత ఆ నాడంతా భగవంతం మనస్సులో ఏమేమి ఆలోచనావరంపరలు ఊగిసలాడాయో! నోట్లోనించి హుక్కాగొట్టం తియ్యనే లేదు సాయంత్రందాకా.

మర్నాడు తానే స్వయంగా సీతారామ్ఇంటికి వెళ్ళాడు. "నిన్న నువు చెప్పినవిషయం నిజంగా చాల బాగానే వుంది" అన్నాడు.

"నేను చెప్పానుకదూ! నిన్ననే చెప్పాగా ఆ సంగతి!" అన్నాడు సీతారాం సగర్వంగా.

"ఆ విషయమే నీతో మాటాడిపోదామని వచ్చాను ఇప్పుడు."

సీతారాంకు ఇంకా ఎక్కువగర్వం వచ్చేసింది. ఆ తరు వాత చాలరోజులవరకూ వారిద్దరిమధ్య ఏవేవో సమాలోచ నలు జరిగాయి. వాటి పర్యవసానం ఏమిటీ అంటే – యువరాజు పేరుమీద మొగల్ పాదుషాకు ఒక కృత్రిమపు అర్జీ తయారు అయింది. అందులో ప్రతాపాదిత్యుడు పాదుషాకు విద్రోహిగా తయారైనట్టు నేరం ఆరోపింపబడింది. ప్రతాపాదిత్యుని కూల ద్రోసి తనకు రాజ్యాం ఇప్పించవలసినదిగా ఉదయాదిత్యుడు కోరుతున్నట్టుగా అర్జీ రాశారు. యువరాజు మొహరు వేశారు దానిమీద. రుక్మిణి యువరాజు ఉంగరం సంపాదించిందిగా! దానిమీద అతని మొహరు ఉండనే ఉంది. కాబట్టి ఈపని ఇదివరకే సగంపూర్తి అయివున్నదన్నమాట.

పన్నిన పన్నాగం ప్రకారం పనిపూర్తి అయింది. కృత్రి మపు అర్జీ తయారైంది. యువరాజుగారి మొహరు వేశారు దాని మీద. సీతారాం తెలివితక్కువవాడు కాబట్టి, భగవంతం ఆ అర్జీని తీసుకుని ఢిల్లీకి వెళ్ళి, పాదుషాకు దాఖలు చెయ్యాలనని నిశ్చయం అయింది.

భగవంతం అర్జీ తీసుకున్నాడు. ఢిల్లీదాకా వెళ్ళవలసిన ఆయాసం తన కెందుకనుకున్నాడు. సరాసరి ప్రతాపాదిత్యుని దగ్గరకు వెళ్ళాడు. ఆ అర్జీ ఆయనకు దాఖలుచేశాడు.

"మహారాజా! యువరాజుగారి మనిషి ఒకడు ఈ అర్జీ తీసుకుని ఢిల్లీకి ప్రయాణమై పోతున్నాడు. నాకు తెలిసిందండి ఆ సంగతి. నేను వాడిని వెంబడించి వెళ్ళాను. వాడి దగ్గరనించి అర్జీ ఎలాగో కాజేశాను. వాడేమో దేశం విడిచిపెట్టి పారి

పోయాడు" అని చెప్పాడు. కాని సీతారాం పేరుమాత్రం ఏ సందర్భంలోనూ చెప్పలేదు.

ప్రతాపాదిత్యుడా అర్జీ చదువుకున్నాడు. అప్పుడతని హృదయంలో లేచిన భావావేశం ఎలాంటిదో తేలిగ్గా ఊహించుకోవచ్చు.

చేసినపనికి బహుమానంగా భగవంతాన్ని మళ్ళీ నౌకరీలో పెట్టుకున్నాడు.

## 23

నానాటికీ విభాదేవి హృదయం అంధకారావృతమై పోతున్నది. భవిష్యత్తులో ఆమెకు అపారదుఃఖమే, నిరాశే గోచరిస్తున్నది. తన జీవనసౌఖ్యం యావత్తూ పూర్ణాహుతి అయిపోయినట్టుగానే భావించుకోసాగింది. మనసుకు సుఖం లేదు, శాంతి లేదు. ఒక్కతే పక్కమీద పడుకుని ఏడుస్తూ ఉంటుంది 'నన్ను మీరు పూర్తిగా త్యజించిపారేశారన్న మాటేనా? నేనేమపరాధం చేశాననీ?' – మాటిమాటికీ అదే మాట అనుకుంటూ ఉంటుంది: 'నే నేమపరాధం చేశాను? నే నే మపరాధం చేశాననీ?' అని. దిండుమీద ముఖం పెట్టుకుని బోర్లాపడుకుని అనుకుంటూ ఉంటుంది: "ఒక ఉత్తరమైనా లేదు. ఎవరి ద్వారానైనా కాస్త కబురు తెలియజెయ్యటంకూడా లేదు. నేనేం చేసేది. ఎక్కడకి పోయేది? పిచ్చిదానిలాగా అటు ఇటూ తిరుగుతున్నాను. ఎవరూ మీ కబురు చెప్పరు. ఎవరూ మీ పేరైనా ఎత్తరు. ఇకనాకు రోజులు ఎలా గడపాలో!' ఇలా ఆమెకు చాలా

రోజులు గడిచాయి. విశాలమైన రాజమహాలులో ఆమెకంతా శూన్యంలా ఉంటోంది. తోడు, నీడ లేని ఏకాకిలా కాలం గడుపుతున్నది. నీడలాగ ఆ గదినించి యీ గదికీ, ఈ గది నించి ఆ గదికీ తిరుగుతూఉంటుంది.

ఇలా ఉండగా ఒకనాడు రామమోహన్ హఠాత్తుగా ఊడిపడ్డాడు. వచ్చి నమస్కారంచేసి 'జై మా దొరశానమ్మ గారికి' అన్నాడు. సుఖసంపదలు ఒక్కసారిగా తన తలపై వచ్చిపడ్డట్టుగా ఆమె ఉలికిపడి చూచింది రామమోహన్ కనిపించగానే ఆమె కన్నులు చెమరించాయి. 'వచ్చావా, మోహన్!' అన్నది.

"ఆం- వచ్చాను. మా అమ్మ నన్ను మరచిపోయింది కామాలనిపించింది. ఒకసారి వెళ్ళి జ్ఞాపకం చేద్దామని ఇలా వచ్చాను"

ఏవేవో చాల ప్రశ్న లడగాలనుకుంది విభ. కాని సిగ్గుచేత అడగలేకపోయింది. చంద్ర్వదీవం కబుర్లు వినాలని యెంతో ఆసక్తి మనసులో ఉబికింది.

రామమోహన్ విభా దేవి ముఖంలోకి చూచి చింతితుడయినాడు. "అదేమిటమ్మా! అలాగైపోయినారేం- ముఖమంతా పాలిపోయింది. కళ్ళు అలా లోతుకుపోయాయి. తల అంతా అలా అట్టగట్టుకుపోయింది. ఆ నవ్వేదీ? ఆ సంతోషం ఏమైందీ? పద, అమ్మా మీ యింటికి మీారు వచ్చేయండి- ఇక్కడ మిమ్మల్ని ఆదరించేవాళ్ళూ, పెట్టేవాళ్ళూ ఎవరూ లేరు"

విభాదేవి నవ్వి ఊరుకుంది. ఆ నవ్వు అలా కాసేపు వెలిగి అంతలోనే అంతర్హితమై పోయింది. కన్నుల్లోనుంచి అశ్రుబిందువులు త్రోసుకుని వచ్చాయి; ఆపుకోలేకపోయింది. చాలకాలంనుంచి అనాదృతగాఉండి ఒక్కసారి ఆదరం పొందే సరికి అభిమానం ఉబికింది. అతి కోమలము, అనంత ప్రీతి పూర్ణముఅయిన అభిమానంతో ఆమె ఏడ్చింది. "ఇంతకాలా నికి నేను జ్ఞాపకంవచ్చాను" అనుకుంది మనసులో.

రామమోహన్‌కూడా తన్నుతాను సంబాళించుకో లేకపోయాడు. అతని కన్నుల్లోనుంచీ అశ్రువులు ఉమ్మళించాయి వచ్చాయి. "ఏడవబోకమ్మా, అపశకునం! మీారు సాక్షాత్తు లక్ష్మీదేవి. నవ్వుతూ వచ్చేయండి, మీా యింటికి మీారు. ఇవాళ శుభదినం; కన్నీళ్ళు తుడిచేసుకోండి"

అల్లుడు కూతుర్ని స్వీకరించాడేమోనని రాణికి చాల రోజులనుంచీ భయంగానేఉంది. కాని ఇవాళ కూతుర్ని తీసుకు పోయేందుకు రామమోహన్ వచ్చాడని తెలియగానే ఆమె చాల సంతోషించింది. రామమోహన్ ను లోపలికి పిలిపించు కుంది; అల్లుడిగారిక్షేమం అడిగి తెలుసుకుంది– అతనికి సుష్టుగా భోజనం పెట్టింది – దగ్గర కూచోబెట్టి ఆ యీా కబుర్లన్నీ చాల అడిగింది. రోజంతా ఆనందంగా గడచిపోయింది. మర్నాడు బాగానే వుంది; ఉదయాన్నే విభను ప్రయాణం చేసి పంపించటానికి ముహూర్తం నిశ్చయం అయింది. ప్రతా పాదిత్యు డేమీా అభ్యంతరం చెప్పలేదు.

ప్రయాణం నిశ్చయమైనతరువాత విభ ఉదయాదిత్యుని దగ్గరకు వెళ్ళింది. అప్పుడతడు ఒంటరిగా కూచుని ఏమాలో

చిస్తున్నాడో మరి! విభ రాగానే మొదట కొంచెం ఉలికి పడ్డాడు. మరుక్షణమే తన్నుతాను సంబాళించుకున్నాడు.
"ఏం. విభా! వెడుతున్నావా? మంచిదమ్మా వెళ్ళు. అక్కడ నీకు సుఖంగా, హాయిగా ఉంటుంది. నేను నిన్ను ఆశీర్వదిస్తున్నాను. లక్ష్మీదేవివలె నీ భర్తృగృహాన్ని సముజ్వలంగా ప్రకాశింప జెయ్యి."

విభ అన్నయ్యపాదాలదగ్గర కూచుని ఏడ్చింది. ఉదయాదిత్యుని కన్నుల్లోనించి అశ్రుజలం ప్రవహించింది. విభాదేవి తలపై చెయివైచి నిమురుతూ "ఏడుస్తున్నావెందుకు విభా! నీకిక్కడ ఏమిసుఖంవుంది చెప్పు. నలువైపులా దుఃఖమే, కష్టాలేకద! ఈ జైల్లోనించి నీకు విడుదలైంది; బ్రతికిపోయావు" అన్నాడు.

విభ అక్కడినించి వెళ్ళిపోడానికి లేచింది. ఉదయాదిత్యుడన్నాడు. "వెడుతున్నావా? వెళ్ళమ్మా! అత్తగారింటికివెళ్ళి మమ్మల్ని పూర్తిగా మరచిపోయేవు సుమీ! అప్పుడప్పుడు కాస్త గుర్తుకు తెచ్చుకుంటూ ఉండు. క్షేమసమాచారాలు తెలుపుతూ ఉండు" అన్నాడు.

విభ వెళ్ళిపోయి రామమోహన్‌తో చెప్పేసింది: "నేనిప్పుడు రాను రామమోహన్!"

రామమోహన్ ఆశ్చర్యపోయాడు: "అదేంమాట! అలాగంటారేం అమ్మా!"

"ఊహుఁ. నేను రాను. అన్నయ్యను ఇక్కడ అలా ఒంటరిగా వొదిలిపెట్టి నేను రాలేను. అతడిప్పుడనుభవిస్తున్న దుఃఖాలు కష్టాలు అన్నీ నామూలాన్నే పాపం! అటువంటి

వాడిని ఇక్కడ ఒంటరిగా దిగబెట్టేసి నేను వచ్చి అక్కడ సర్వసుఖాలూ అనుభవించనా? నే నలా చెయ్యలేను మోహన్! అతని హృదయంలో దుఃఖలేశ మున్నంత కాలం నే నతన్ని విడిచిపెట్టి ఎక్కడికీ పోను. నేనుకూడా లేక పోతే అతన్ని ఎవరుచూస్తా రిక్కడ?" అంటూ విభ ఏడ్చింది.

అంతఃపురమంతా గగ్గోలెత్తిపోయింది. రాణి వచ్చి నయాన, భయాన బుజ్జగించి చెప్పింది. విభ ఒప్పుకోలేదు. "ఊహుం. నేను వెళ్ళలేనమ్మా! వెళ్ళను" అన్నది. రాణికి చాల కోపంవచ్చింది. నెత్తినోరు బాదుకుని ఏడ్చింది "ఇలాంటి పిల్లను నే నెక్కడా చూడలేదమ్మా!" అనుకుంటూ ప్రతా పాదిత్యునిదగ్గరకు వెళ్ళి గొడవంతా చెప్పుతుంది.

ప్రతాపాదిత్యుడు అంతా ప్రశాంతంగా విన్నాడు. "ఏముంది ఇందులో నేను పరిష్కారం చెయ్యటానికి? వెళ్ళ టం అమ్మాయికి ఇష్టం లేకపోతే వెళ్ళదు, అంతే" అన్నాడు. ఆ మాట విని రాణి నిర్ఘాంతపోయింది "సరే, మీ యిష్టం వచ్చినట్టే చేసుకోండి; నా కెందుకు మధ్య ఈ లేనిపోని ఆరా టం!" అని చేతులు తిప్పుతూ పలికి వెళ్ళిపోయింది.

ఈ సమాచారమంతా విని ఉదయాదిత్యుడు కూడా ఆశ్చర్యపోయాడు. వచ్చి ఎన్నివిధాలో చెప్పాడు. కాని విభకు ఒక్కమాటా అర్థంకాలేదు. ఏకధారగా కన్నీళ్ళు విడుస్తూ కూచుంది.

హతాశుడై రామమోహన్ దీనంగా ముఖంపెట్టి "అమ్మగారూ! నేను వెడతాను మరి ఐతే. వెళ్ళి మహారాజా వారికి ఏం చెప్పమంటారు?" అన్నాడు.

విభ ఏమీ మాట్లాడలేకపోయింది. చాలసేపు గడిచింది. మళ్ళీ రామమోహన్ "నేను వెడతాను మరి అమ్మగారూ!" అంటూ నమస్కారం చేశాడు; వెళ్ళిపోవడానికి ఉద్యుక్తుడైనాడు. విభ మరీ వ్యాకులపడిపోయి ఏడువసాగింది. 'మోహన్!' అని పిలిచింది – వెడుతూన్నవాడిని కాతర కంఠస్వరాన.

మోహన్ తిరిగి వచ్చాడు: "ఏమిటి దొరసానమ్మగారూ!"

"నన్ను క్షమించమని చెప్పువారితో. వారు స్వయంగా నన్ను రమ్మని కబురుచేశారు. నేను రాలేకపోతున్నాను. ఇది నా దౌర్భాగ్యం"

"చిత్తం – తల్లీ" అంటూ రామమోహన్ మళ్ళీ ప్రణామం చేసి వెళ్ళిపోయాడు.

విభ అనుకుంది: 'రామమోహన్‌కు నా భావం అర్థమైనట్టు లేదు. కోపం వచ్చినట్టుంది' అని. తాను హృదయపూర్వకంగా వెళ్ళాలనే అనుకుంది; కాని వెళ్ళలేకపోయింది. రామమోహన్‌కు తనమీద నిజంగా ఎంతో అపేక్ష. అటువంటి వాడుకూడా ఇవాళ కోపంవచ్చి వెళ్ళిపోయాడు. ఆ సమయాన ఆమె హృదయం ఎంత క్షోభించిందో ఆమెకే తెలియాలి.

విభ పుట్టింట్లోనే ఉండిపోయింది. కన్నీళ్ళు తుడుచుకుని, హృదయంమీద ఒక బండ వేసుకుని అన్నయ్య దగ్గరకు వెళ్ళింది. ఒక నీలి నీడవలె ఇంటిపనులు చేస్తూ తిరుగుతున్నది. ప్రేమగా ఉదయాదిత్యుడేమైనా పలుకరిస్తే ఆమె తలవంచుకుని నీరసంగా నవ్వుతుంది. సాయంత్రమప్పుడు అన్నయ్య పాదాల

దగ్గర కూచుని కబుర్లు చెబుదామని ప్రయత్నిస్తుంది. అప్పు డప్పుడు రాణి చివాట్లుపెట్టే సమయంలో మాట పలుకు లేకుండా అన్నీ వింటుంది; చివరకు ఒక నీలి మబ్బు తునక లాగా కన్నీటి జల్లుతో వెళ్ళిపోతుంది. ఎవరన్నా చుబుకం పుణుకుతూ "విభా! అంత మరీ చిక్కిపోతున్నావేం?" అని అడిగితే సమాధానం ఏమీ చెప్పదు. కొంచెం నవ్వి ఊరు కుంటుంది.

పరిస్థితులు ఇలావుండగా భగవంతం వెళ్ళి ఉదయా దిత్యునికి ఆ కృత్రిమపు అర్జీ చూపించాడు. రాజుకు వొళ్ళు మండిపోయింది. చాలాసేపు ఆలోచించిన మీదట ఆజ్ఞ జారీచేశాడు – ఉదయాదిత్యుని ఖైదులో పెట్టమని. అప్పుడు మంత్రివచ్చి "మహారాజా! యువరాజు ఈపని చేశాడంటే నమ్మటానికి వీల్లేదు. ఆ మాట ఎవరు విన్నా నాలుక కరచు కుని 'ఎబ్బే, నమ్మటానికి వీల్లేదు. అటువంటి పాపపు మాట వినసుకూడా వినకూడదు' అని చెవులు మూసుకుంటున్నారు. యువరాజు అలా చేసివుండడు. విశ్వసించటానికి వీల్లేదు" అని చెప్పాడు.

"నాకూ అలాగే అనిపిస్తున్నది కాని, అతన్ని ఇంట్లోనే ఎక్కడికీ పోవటానికి వీల్లేకండా... ఒకరకమైన నిర్బంధంలో వుంచితే తప్పేమిటి? అతని కేవిధమైన కష్టమూ మనం కలిగించ నక్కరలేదు. కాపలా వాళ్ళను ఏర్పాటు చేద్దాం– అతను రహస్యంగా ఏమీ చేయటానికి వీల్లేకండా" అన్నాడు ప్రతాపాదిత్యుడు.

# 24

రామమోహన్ చంద్రద్వీపానికి తిరిగివచ్చాడు. ఒంటరిగానే వెళ్ళి ఒక అపరాధిలాగ రాజుగారిముందు నిలబడ్డాడు. రామచంద్రరాయ్‌కి అతన్ని చూడగానే ఆపాద మస్తకమూ కారం రాచినట్టయింది. ఇదివరకల్లా...విభ వస్తుంది; రాగానే ప్రతాపాదిత్యుని గురించీ, అతని వంశాన్ని గురించీ రెండు మూడు కటువైన మాటలువిసిరి లోపలవున్న అక్కసు తీర్చుకుందామనుకున్నాడు. ఏమేమి మాటలు అనాలి? ఎలా అనాలి? ఎప్పుడనాలి? ఈ మొదలైన అంశాలన్నీ బాగా ఆలోచించుకుని, నిర్ణయాలు చేసుకుని వున్నాడు. భార్యను ఇష్టంవచ్చినట్టు సతాయించుకు తినాలని కాదు అతని ఉద్దేశం. అతడంత పల్లెటూరి మొద్దేం కాదు. ఏదో మధ్య మధ్య ఆవిడ తండ్రిగారి విషయమై నాలుగు కటువైన వాక్యాలు మాత్రం విసిరి ఆమెను సిగ్గుపడేట్టు చేయటమే అతని అభిప్రాయం. అంతకు మించిన చెడు తలంపేమీ లేదు. ఇటువంటి ఆలోచనలలో పూర్తిగా లీనుడైపోయి; ఒకవేళ విభ రాదేమోనన్న అనుమానంకూడా అతనికి స్ఫురించలేదు. తీరా రామమోహన్ ఒక్కడే తిరిగి వచ్చేసరికి అతనికి ఆశ్చర్యం కలిగింది; హృదయం క్షోభించింది; మిక్కిలి అధీరుడైపోయాడు. "ఏం? ఏమైంది రామమోహన్!" అని అడిగాడు.

"వెళ్ళటం అనవసరమే అయింది మహారాజా!"

"తీసుకు రా లేకపోయావు!" అన్నాడు రామచంద్రరాయ్ విహ్వాల భావం సూచిస్తూ.

"ఔను, మహారాజా! బయలుదేరిన వేళ మంచిది కాదు."

రాజుకు కోపం వచ్చేసింది. "పనికి మాలినవాడా! నిన్నెవరు వెళ్ళమన్నారోయ్ అసలు! వద్దు - వద్దు - అని ఎన్నిసార్లో చెప్పాను. ఛాతీ విరుచుకుని ధీమాగా వెళ్ళావే? ఇక ఇప్పుడు—"

రామమోహన్ నుదురు కొట్టుకున్నాడు "మహారాజా! నా అదృష్టం—"

రామచంద్రరాయ్‌కి ఇంకా కోపం పెరిగిపోయింది. "రామచంద్రరాయ్‌కి అవమానం తీసుకువచ్చావుర్రా పనికిమాలినవాడా! వెళ్ళి నాకు మారుగా బిచ్చం అడిగావనన్న మాట అక్కడ! ప్రతాపాదిత్యుడు బిచ్చం పెట్టలేదు; నువ్వు తిరిగివచ్చావు. ఇటువంటి అవమానం మా వంశంలో ఎప్పుడూ ఎరగం."

ఇంతవరకూ రామమోహనరాయ్ తలవంచుకునే వున్నాడు. కాని ఇక ఉండబట్టలేక పోయాడు. "అలా అనకండి మహారాజా! ప్రతాపాదిత్యుడే వంవసంటే తప్పకండా ఆయన్ను ధిక్కరించే తీసుకువచ్చేవాడిని. ఆ మాట మీతో చెప్పివెళ్ళాను. మహారాజా! మీ ఆజ్ఞను శిరసావహించి వెళ్ళినవాడిని ప్రతాపాదిత్యుడికి భయపడతానంటారా? ప్రతాపాదిత్యుడొక రాజైతే కావచ్చు. కాని నాకు రాజు కాదు."

"అయితే అక్కడ జరిగినవ్యవహారం ఏమిటి మరి?"

రామమోహన్ చాలసేపటివరకూ మాటాడలేదు. ఆతని కన్నులవెంట అశ్రువులు ప్రవహించసాగాయి.

"రామమోహన్! తొందరగా చెప్పు" అన్నాడు రాజు ఓపికపట్టలేక

రామమోహన్ చేతులు రెండూ జోడించాడు "మహా రాజా!"

"ఊం. చెప్పు."

"మహారాజా! దొరసానమ్మగారే స్వయంగా...రా జాలకపోయారు" – అని మాత్రం పలికి రామమోహన్ ఊరు కున్నాడు. కన్నులవెంట ఊరికే అశ్రువులు ప్రవహిస్తున్నాయి. అవి స్నేహాభిమానంవల్ల పొంగుతూన్న దుఃఖాశ్రువులు. "దొరసానమ్మగారిపట్ల నాకెంతో విశ్వాసం. ఆ విశ్వాసం పురస్కరించుకునే తీసుకువద్దామని వెళ్ళాను ధైర్యంగా, ఆనం దంగా. కాని ఆమె రాలేదు. నా మాట ఆమె మన్నించలేక పోయింది" అని చెబుతున్నట్లుగా ఉన్నాయి ఆమె అశ్రువులు. ఎంతప్రయత్నించినా కన్నీళ్ళు ఆపుకోలేకపోతున్నాడు.

అతనిమాట వినటంతోనే రామచంద్రరాయ్‌కి బాగా క్రోధావేశం వచ్చిపోయింది. 'సరే' అంటూ లేచాడు. కొంత సేపటివరకూ ఏమీ మాటాడలేదు. "రాలేకపోయిందేం?... సరే, నువ్వు వెళ్ళిపో – వెళ్ళిపో నా ముందునించి ... ఊం – వెళ్ళవేం?" అన్నాడు చివరకు.

రామమోహన్ మాటాడకండా వెళ్ళిపోయాడు – తప్పు తనదేననీ, అందుకు తగినశాస్తికావలసిందేనని అనుకుంటూ.

ఇంత జరిగినమీదట ప్రతీకారం చెయ్యకండా రామ చంద్రరాయ్ ఊరుకుంటాడా? ఎప్పుడెప్పుడా అని ఆతృత పడుతూ ఉన్నాడు. కాని ప్రాతాపాదిత్యుని తానేమీ చెయ్య

తేసు; విభ చేతికంపలేదు. మిక్కిలి అధీరుడైపోయి అటూ ఇటూ పచార్లు ఆరంభించాడు

రెండు మూడురోజులయేసరికి ఈ సంగతి నలుమూలలా వ్యాపించిపోయింది. ప్రతీకారం ఏదో ఒకరూపంలో చేయ గలిగితేనేగాని రామచంద్రరాయ్ ప్రజలముఖం చూడలేనను కున్నాడు. అతడేకాదు, ప్రజలుకూడా ప్రతీకారంచేసి తీర వలెనని ఉత్సుకులై యున్నారు. "మన మహారాజా వారికి ఇంత అవమానమా?" అంటున్నాడు ప్రతివాడూ. తమ రాజు గారికి అవమానం జరిగితే తమకు జరిగినట్లేనని వారి అభి ప్రాయం. ప్రతీకార వాంఛ రామచంద్రరాయ్‌కి తీవ్రంగానే ఉంది. తాను ప్రతీకారం నెరవలేకపోతే ప్రజలేమనుకుంటారు? నౌకర్లుకూడ ఆఖరికి చులకనైపోరూ! ముఖ్యంగా రమేశ భట్టు దృష్టిలో తానెంతగా దిగజారిపోతాడు? అతడు తన్ను గురించి ప్రజలముందు ఎంత చులకనగా, పరిహాసంగా మాట్లాడుతాడు! ఇటువంటి ఆలోచనలతో రామచంద్ర రాయ్ చాల అధీరుడై పోయాడు.

ఒకనాడు రాజసభలో మంత్రి "మహారాజా! మీరు మళ్ళీ వివాహం చేసుకోండి" అని సలహా ఇచ్చాడు.

"ప్రతాపాదిత్యుని కూతురును అన్నగారి దగ్గరే ఉండ నీయండి" అన్నాడు రమేశభట్టు

రాజు రమేశభట్టువైపు చూస్తూ నవ్వాడు "బాగా చెప్పావు రమేశ్!" అంటూ.

రాజు నవ్వటం చూచి సభాసదులంతా నవ్వారు. ఒక్క ఫర్నాండిస్ మాత్రం నవ్వలేదు. రామచంద్రరాయ్ ఆత్మప్రతిష్ఠ

అంటే చాల పట్టుదలగా ఉండే మనిషి - కాని ఆత్మప్రతిష్ఠ అంటే ఏమిటో, దాన్ని ఎలా కాపాడుకోవాలో అతనికి తెలి యదనే చెప్పాలి.

"మంత్రి చెప్పినమాట బాగానేవుంది. అలా చేశా రంటే ప్రతాపాదిత్యునికీ, ఆయన కూతురికీ - ఇద్దరికీ కూడా మంచి శిక్ష విధించినట్టవుతుంది" అన్నాడు దివాన్‌జీ.

వెంటనే రమేశభట్టు అందుకున్నాడు: "ఆ శుభకార్యా నికి మన మహారాజావారు మామగారైన ప్రతాపాదిత్యునికి కూడా ఆహ్వానం పంపించటం మరచిపోకూడదు. ఆహ్వానం పంపకపోతే వారిని అమర్యాద చేసినట్టవుతుంది" అంటూ గుడ్లొకరకంగా పెట్టిచూచాడు. అంతా పక్కుమని నవ్వారు. దూరంగా ఉండి, ఈ మాట వినిపించనివాళ్ళుకూడా నవ్వారు. "మీా పునర్వివాహ సందర్భంలో మీా అత్తగారిని కూడా సగౌరవంగా పిలవటం బాగుంటుంది మహారాజా! ఇక పోతే 'మృష్టాన్నమితరేజనాః' అను సూక్తి ననుసరించి, ప్రతాపాది త్యుని కూతురికి మిఠాయి పళ్ళేలు పంపించేటప్పుడు రెండు పచ్చి అరటిపళ్ళుకూడా పంపించండి"

రాజు పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వాడు. సభాసదులంతా ఆపుకోలేక ఆపుకోలేక ముఖాలు వికృతంగాపెట్టి తెగనవ్వారు. ఫర్నాండిస్ ముఖం తిప్పుకుని అక్కడినించి లేచిపోయాడు.

మధ్య మధ్య దివాన్‌జీ కూడా రసికత చూపించేందుకు ప్రయత్నం చేశాడు. "ఇతర జనుల కందరికీ మృష్టాన్నం పెట్టాలిగా. కాబట్టి మిఠాయిలు, పిండివంటలు అన్నీ యశో

హార్ పట్నానికే పంపించేద్దాం. ఇక్కడి వాళ్ళంతా తిండి తిప్పలు లేకండా పడివుంటారు" అన్నాడు.

ఈ మాటకు ఎవరూ నవ్వలేదు. రాజు మాటాడకండా కూచుని హుక్కా పీల్పుల్లో పడ్డాడు. సభాసదులంతా గంభీర ముఖాలు తాల్చారు. రమేశభట్టు సాశ్చర్యంగా దివాన్ వైపు చూడసాగాడు. అప్పుడు మంత్రి "అలాగంటారేం దివాన్‌జీ! మహారాజావారి వివాహ సందర్భంలో మృష్టాన్నానికి లోటువస్తుందా? ఇక్కడి వాళ్ళంతా తిండి తిప్పలు లేకండా వుండాలిసిన గతేం బట్టింది!" అన్నాడు. దివాన్‌జీ పాపం తల వంచుకున్నాడు.

ఇంతకూ రాజుగారు మళ్ళీ పెళ్ళి చేసుకోవటం ఇంచుమించు నిర్ణయమైపోయినట్టే.

# 25

ఉదయాదిత్యుడిని నిజంగా ఒక కారాగారంలో పెట్టలేదు. రాజ ప్రాసాదానికే సంబంధించిన ఒక చిన్న గదిలో ఉంచారు. దానికి దక్షిణాన ఒక వీధివుంది. తూర్పువైపు ఎత్తయిన గోడ ఉంది దాని కొక ద్వారం. ఆ ద్వారం ముందు కాపలావాళ్ళు పహరా కాస్తున్నారు. గదిలో ఒక చిన్న కిటికీ ఉంది. అందులోనించి కొద్దిగా ఆకాశం, కొన్ని వెదురు పొదలు, శివాలయం కనిపిస్తూ ఉంటాయి. ప్రప్రథమంగా ఉదయాదిత్యుడిని ఈ గదిలోకి తీసుకు వచ్చినప్పుడు బాగా చీకటిగా ఉండింది. అతడు కిటికీ వద్దకుపోయి నేల మీద కూచున్నాడు. వర్షాకాలపు రోజులు; ఆకాశంనిండా

మేఘాలు కమ్ముకుని వున్నాయి. దక్షిణపువైపు వీధి అంతా బాగా తడిసిపోయివుంది. అప్పుడప్పు డొక డిద్దరు బాటసారులు వెడుతూ ఉన్నారు. అప్పుడు తపతప చప్పుడౌతున్నది. ఇక పోతే తూర్పువైపునుంచి, కారాగారపు హృదయ స్పందనంవలె కాపలా వాళ్ళ పదధ్వానులు వినిపిస్తున్నాయి. ఆకాశంలో ఒక్క నక్షత్రం కూడా కనిపించటంలేదు. ఉదయాదిత్యుడు తదేకంగా చూస్తున్నాడు వెదురు పొదలవైపు. అటునించి కీచురాళ్ళ రొదకూడా వినిపిస్తున్నది. ఆ రాత్రి ఉదయాదిత్యుడు పక్కమీద మేను వాల్చనేలేదు; నిద్రే పోలేదు; కిటికీ దగ్గర అలాగే కూచుని కాపలావాళ్ళ పదధ్వానులు వింటున్నాడు.

నేడు సాయంత్రం కాకముందే విభాదేవి అంతఃపురపు తోటలో వెళ్ళికూచుంది. అంతఃపుర భవనంలో గుంపు ఎక్కువౌతోంది, అక్కడ ఏకాంతంగా ఉండదు, దాసీలు, ముసలమ్మలు, ఇరుగుపొరుగు ముత్తయిదువలు 'ఏమిటమ్మా! ఏమిటి కథ!' అని గుచ్చిగుచ్చి అడుగుతారు, ప్రతినిట్టూర్పుకు విస్తృతభాష్యం, సమాలోచన ఆరంభమౌతాయి. ఇదంతా విభ సహించలేదు. అందుచేత తోటలోకి పారిపోయి ఒకచోట కూచుంది. సూర్యుడు ఆ కారుమేఘాల్లో ఎప్పుడు ఉదయించాడో, ఎప్పుడస్తమించాడో తెలియదు. పగలు ఎప్పుడు ముగిసిందో రాత్రి ఎప్పుడు ఆరంభమైందో ఎవరు చెప్పగలరు? సాయంత్రమప్పుడు మాత్రం ఆకాశాన పడమటివేపు రవంత పసిడి రేఖ కనిపించింది. కనిపించడమే తడవుగా మరుక్షణమే మాయమైపోయింది. కటికిచీకటి ముద్దగట్టుకుని సర్వదిగంత

వ్యాప్తమై ఉంది. ఆ చీకటిదేవత ఒక విస్మృతవిరాట్ స్వరూ-
పంలో వేలాదిపాదాలమీద ధృఢంగా నిల్చియున్నట్టనిపిస్తు-
న్నది. రాత్రి గడచిపోతున్నది. దీపాలన్నీ కొండెక్కాయి.
విభ ఒక సన్నిచెట్టుకింద కూచునివుంది. స్వభావతః ఆమె
పిరికి గుండెగల మనిషి. కాని ఆ సమయంలో ఆమెలో
భయమనేదే లేకండాపోయింది. చీకటి దట్టమై పోతున్నకొద్దీ
ఆమెకు అనిపించింది: తనదగ్గరనించి ఈ ప్రపంచాన్ని ఎవరో
దూరంగా లాక్కుపోతున్నట్టు... సుఖకరంగా, శాంతంగా
ఎవరో తన్ను ఈ ప్రపంచపు ఒడ్డునించి మెల్లగా తోటుకు
పోతున్నట్టు... పాతాళాన్ని స్పర్శిస్తూన్న అంధకార మహా
సాగరంలో మునిగిమునిగి అడుగు వెళ్ళిపోతున్నట్టు క్రమశః
మునిగి పోతున్నట్టూ ఉంది పైకి తేలుతున్నట్టూ ఉంది.
పాదాలకింద నేలలేదు, చుట్టూ అంతా శూన్యమే లక్షలాది
యోజనాలు విస్తరించివున్న అనంత అంధకారంలో ఒంటిగా
పయనిస్తున్న యాత్రికురాలు తాను. వేలాది సంవత్సరాలు
ఇలా ఒంటరిగానే పయనిస్తూ ఉంటుంది. మరెవ్వరూ తనకు
దారిలో కనిపించరు. రాత్రంతా ఆమెకు ఇలాగే గడచి
పోయింది. నిద్రలేదు, అలసటలేదు.

మర్నాడు విభ చాల ప్రయత్నించింది: ఉదయాదిత్యు
డున్న కారాగృహంలోకి వెళ్ళిచూడాలని. కాని వెళ్ళలేక
పోయింది. అక్కడికి కెవరూ వెళ్ళకూడదని రాజాజ్ఞ. రోజంతా
పాపం ఏడుస్తూనే గడిపింది. చివరకు తండ్రిగారిదగ్గరకు వెళ్ళింది;
పాదాలమీదపడి దీనంగా బ్రతిమాలింది. అప్పుడు లభించింది
ఆజ్ఞ. మర్నాడు తెల్లవారకముందే లేచి కారాగృహంకేసి

వెళ్ళింది. చూచింది : ఉదయాదిత్యుడు పక్కమీద లేడు. కింద తివాచీమీద కూచున్నాడు – కిటికీ తలుపుకు నుదురు ఆనించి. అలాకూచునే నిద్రపోతున్నాడు. ఆ దృశ్యంచూస్తోంటే ఆమెకు గుండె పగిలిపోయింది. ప్రాణం నిలువునా నీరైపోయింది. చాల కష్టంమీద తన్నుతాను సంబాళించుకుంది. మెల్లిగా వెళ్ళి అతనిదగ్గర కూచుంది. తిన్నగా ప్రభాతకాంతులువ్యాపించాయి. ఆ పక్కనున్న తోటలో పిట్టలు కూయసాగాయి. చేరువనున్న శివాలయంలో నించి శంఖారావం, ఘంటానాదం వినిపించాయి. హఠాత్తుగా ఉదయాదిత్యుడు ఉలికిపాటుగా మేల్కొన్నాడు; విభను చూచాడు. "ఇదేమిటి? ఇంత తెల్లవారకముందే నువ్వు..." అన్నాడు. నాలుగువైపులా చూచాడు. "అరే, నేను ఇక్కడ..." అన్నాడు. మరుక్షణమే తానెక్కడున్నదీ గుర్తుకువచ్చింది. "అబ్బ! నువ్వు వచ్చావా విభా! నిన్న నువ్వు అసలే కనిపించలేదు. ఔను, పూర్వంలాగ ఇక ముందు నిన్ను చూడ్డం పడదు" అన్నాడు.

విభా దేవి కన్నీళ్ళు తుడుచుకుంది. "అన్నయ్యా! కిందనే కూచున్నావేం? పక్కచూస్తే నువ్వు ఒక్కసారికూడా దానిమీద కూచున్నట్టులేదే! ఈ రెండురోజులనించీ ఇలా కిందకూచునే గడిపావన్నమాట. కాసేపైనా పడుకోలేదా?" విభ కన్నీళ్ళు ఆపుకోలేకపోయింది.

మెల్లిగా ఉదయాదిత్యుడిలా చెప్పసాగాడు: "ఆమంచం మీద కూచుంటే నాకు ఆకాశం కనిపించదు విభా! ఈ కిటికీ దగ్గర కూచుంటే ఆకాశం కనిపిస్తుంది; ఆకాశంలో పక్షులు యెగురుతూ ఉండటం చూస్తాను. యేనాటికైనా ఈ పంజరపు

తలుపులు తెగిపోయి నేనుకూడా ఆ పక్షులవలెనే అనంతా కాశంలో ఆనందంగా ఎగిరిపోగలనని ఆశిస్తాను. ఈ కిటికీ విడిచి అవతలకు పోయానంటే నాకు అంధకారంగానే ఉంటుంది; ఏ నాటికైనా నాకు విముక్తి లభిస్తుందనే ఆశ మరచిపోతాను; ఈ సంకెళ్ళు విడిపోయి, ఈ కారాగారంనించి బయట పడ గలన్న ఆశ విలుప్తమైయిపోతుంది. విభా! చేరెడు నేలకంటే లేదు ఈ కారాగారంలో. అయినా ఇక్కడ కూచుంటే 'నేను స్వభావతః స్వతంత్రుడిననీ, ఏ రాజూ, మహారాజూ అయినా నన్ను బంధించ లేడనీ అనిపిస్తూ ఉంటుంది. అదిగో ఆగదిలో మెత్తని పరుపు పరచిన మంచం ఉందే, అక్కడికి వెళ్ళానంటే సరి - అదే నా కారాగారం."

ఈనాడు విభను చూస్తోంటే ఉదయాదిత్యుని మన స్సులో మిక్కిలి ఆనందంగా ఉంది. ఆమెను చూస్తుంటే తన కీ కారాగారపు ద్వారాలన్నీ, సంకెళ్ళన్నీ తెగిపోయి నట్టనిపిం చింది. విభను దగ్గర కూచోబెట్టుకుని ఆయీ కబుర్లు చాల చెప్పాడు. ఇదివరకెన్నడూ అతడింతసేపు, ఇంత తీరుబా టుగా ముచ్చట్లు చెప్పలేదు. అతనిలోని ఆనందాన్ని విభ గుర్తించింది. ఆమె హృదయం పులకించింది. ఎన్నాళ్ళ నించో తపిస్తూ వచ్చింది; ఈనాడు కనిపించింది అన్నయ్యలో ఆనందం. ఆమె హృదయానికి బలం వచ్చింది. ఇన్నాళ్ళకు ఆమె పెదవులపై సహజ మందహాసం వెలిగింది.

విభ కారాగారానికి తరచు వచ్చిపోతూ వుంది. స్నేహా పిచ్ఛలమైన ఆమె విమలమూర్తి వస్తూంటే, ఆకిటికీలో నించి ప్రభాతభాను కిరణప్రకాశం వస్తున్నట్టనిపించేది. జీతం ఇచ్చిపెట్టు

కున్న నౌకర్లతో ఏపనీ చేయించేదికాదు విభ. అన్నయ్యకు సంబంధించిన పనులన్నీ తానుస్వయంగా చేయవలసిందే. కాని ఉదయాదిత్యుని హృదయంలోమాత్రం ఒక మూల బాధ అనుభవిస్తూనే ఉండేవాడు. తరచు అనుకుంటూ ఉంటాడు: "నే నెలాగూ మునిగిపోతూనే ఉన్నాను. నాతోకూడా పాపం విభనుకూడా ముంచుతున్నానే" అని. "వెళ్ళమ్మా, నువు అత్తగారింటికి వెళ్ళిపో" అని ప్రతిరోజూ ఆమెతో చెబుదామనుకుంటాడు. కాని తీరా సమయం వచ్చేసరికి నోటిలోనించి ఆ మాట రాలేకనే పోతున్నది. తప్పకండా రేపు చెప్పేయవలసిందేనని గట్టిగా నిశ్చయించుకున్నాడు. మర్నాడు విభ వచ్చింది. "విభా! నువు ఇక్కడ ఉండవద్దు. నువు అత్తగారింటికి వెళ్ళకుండా ఉన్నావంటే నా మనస్సుకు శాంతి ఉండదు. ప్రతిరోజూ సాయంకాలం అయేసరికి ఈ కారాగారంలో ఎవరోవచ్చి నా చెవుల్లో చెబుతున్నట్టుగా ఉంది: 'విభకు ఆపత్తు రానున్నదీ' అని.' విభా! నువు వేగిరం నన్ను విడిచిపెట్టి పారిపో – నేను శనిగ్రహాన్ని. నా దగ్గర వున్నావంటే నీకు ఆపద రాకండా ఉండదు. వెళ్ళిపో అమ్మా! అత్తగారింటికి వెళ్ళిపో. అప్పుడప్పుడు కబురు తెలుపుతూ ఉండు; నేను సంతోషిస్తాను." అన్నాడు.

విభ ఏమీ మాటాడలేదు. ఉదయాదిత్యుడు తలవంచి ఆమె ముఖంలోకి చూచాడు. ఆమె నేత్రాల్లోనించి అవ్యాహతంగా కన్నీళ్ళు ప్రవహిస్తున్నాయి. తాను కారాగారం నించి విముక్తుడై తేగాని ఆమె వెళ్ళేందుకు ఇష్టపడదు అని తెలుసుకున్నాడు. కాని తాను ఎలా విముక్తుడు కావటం?

# 26

విభ రాకపోవటానికి కారణం ప్రతాపాదిత్యుని శాసనం అనీ, ఉదయాదిత్యుని మంత్రాలోచన అని రామచంద్రరాయ్ ఆలోచన. విభ తనంత తానే బుద్ధిపూర్వకంగానే రాలేదు అని విశ్వసించలేకపోతున్నాడు. అలా విశ్వసించటం ఆత్మగౌరవానికి భంగకరంగా! "ప్రతాపాదిత్యునికి నన్ను అవమానించటమే కావాలి. కనుక విభను ఇక్కడికసలు పంపనేపంపడు. ఈ అవమానం నేను సహించి ఊరుకోవలసిందేనా? ఈ అవమానాన్ని మళ్ళీ అతనికే తిప్పి కొట్టద్దూ! 'నీ కూతుర్ని నేను వొదిలేస్తున్నాను. ఆమెను మీరు నా దగ్గరికి పంపించనవసరం లేదు' అని నేనే ముందుగా ఉత్తరం రాసి పంపిస్తాను" – ఇలా దీర్ఘంగా ఆలోచించి ఒక ఉత్తరం రాశాడు. ఇటువంటి ఉత్తరం ప్రతాపాదిత్యునికి పంపించటమంటే సాధారణమైన విషయంకాదు; ఎంతో సాహసం ఉండాలి. రామచంద్రరాయ్‌కి గుండెలో భయంగానే ఉంది. కాని ఏటుగా ఉన్న ఒక పర్వతం పైనించి జారిపడుతున్నప్పుడు ఎంతైనా భయంగానే వుంటుంది; కాని మధ్యలో ఆగటమనేది అసంభవం; చాలకష్టం. రామచంద్రరాయ్ స్థితి అచ్చం అలాగేవుంది. తలపెట్టిన దుస్సాహసం అమలు పరచటానికే నిశ్చయించుకున్నాడు. నిగ్రహించుకోలేకపోయాడు.

రామమోహన్‌ను పిల్చాడు: "ఈ వుత్తరం తీసుకుని యశోహరపురం వెళ్ళిరా" అని ఆజ్ఞాపించాడు.

"నన్ను బాధించకండి మహారాజా! నన్ను అక్కడికి పొమ్మనకండి. నేను వెళ్ళేను దొరసానమ్మగారు నాకు కబురుచేస్తే తప్ప, అమ్మగారినితీసుకురమ్మని మీరు అజ్ఞాపించి పంపిస్తే తప్ప... ఇక నేను మళ్ళీ అక్కడికి వెళ్ళకూడదని నిర్ణయించుకున్నాను. ఇంకేం సెలవున్నా సరే నేను వెళ్ళనండీ బాబూ!"

రామచంద్రరాయ్ ఇక అతన్ని బలవంతం చెయ్యలేదు. వృద్ధుడైన నయనచంద్‌కు ఉత్తరం ఇచ్చి పంపించాడు.

నయనచంద్ ఉత్తరం తీసుకుని యశోహరపురం వెళ్ళాడు. కాని అతని మనసులో చాల భయంగానే ఉంది. పోయి ఆ ఉత్తరం ప్రతాపాదిత్యునికి ఇస్తే ఆయన ఉగ్రుడై పోయి ఏం చేస్తాడో, ఏంకర్మమో! కనుక ముందుగానే బాగా ఆలోచించాడు. ప్రతాపాదిత్యునికి కాకండా, ఉత్తరం తీసుకు పోయి రాణీగారికిద్దాం అని నిశ్చయించుకున్నాడు; తరువాత ఆమె యిష్టం; ఏమన్నా చేసుకోనీ. రాణిగారికి చాలకాలనించీ మనసులో ఏమీ బాగుండటం లేదు. ఒకవంక విభాదేవిని గురించిన చింత; మరోవంక ఉదయాదిత్యునికి అలాంటిగతి పట్టించారే అని బాధ. పాపం అస్తమానం దిగులుతో ఏడుస్తూనే ఉంది. ఏ పని చెయ్యాలన్నా బుద్ధిపోదు. ఇటువంటి అవసలో... రామచంద్రరాయ్ పంపించినఉత్తరం ఆమె చేతుల్లోకి వచ్చింది. ఏం చేస్తుందిపాపం! ఆమె కేమీ పాలుపోలేదు. విభతో చెబుతుందా? ఊహుఁ. ఆ పిల్ల ది సుతిమెత్తనిగుండె; ఈ సంగతి వినగానే ఏమి అఘాయిత్యం చేస్తుందో! పోనీ మహారాజావారితో వెళ్ళి చెబుదామంటే ఆయన ముక్కోపి; ఏమి అనర్థం వచ్చి

పడుతుందో కొంపదీసి! ఇటువంటి సంకటావస్థలో రాణి ఎవ రితో పోయి ఆలోచిస్తుందీ! ఎవరున్నారు తనకు కాస్త మంచీ, చెడూ చెప్పేవాళ్ళు? ఒక్కతే కూచుని ఆలోచించింది. ఏమి చెయ్యటానికీ ఏమీ తోచలేదు. ఏడుస్తూ కూచుంది. చివరకు లేచి ప్రతాపాదిత్యుని దగ్గరకు వెళ్ళింది. "మహారాజా! మన అమ్మాయిసంగతి కాస్త ఆలోచించండి. పాపం, దాని గతేం కావాలి?" అన్నది వెళ్ళి.

"ఏం? ఇప్పు డేమొచ్చిందీ?"

"ఏం రావటం ఏముందీ? ఇవాళ కాకపోతే రేపైనా అత్తగారింటికి పంపించవలసిందే కదా!"

"ఔను నిజమే. కాని ఇప్పుడు అకస్మాత్తుగా సీ కా విషయం జ్ఞాపకం రావలసిన అవసరం?"

రాణీకి భయంవేసింది. "మీ రెప్పుడూ అదే మాట! ఇప్పుడేదో ముంచుకువచ్చినట్లు నేను మాటాడానా? నేను మొత్తు కునేదేమంటే—ఒకవేళ ఏదన్నా నిజంగా ముంచుకొస్తే..."

"ఏమకాతుం చేమిటి?" గర్జించాడు రాజు.

"ఒకవేళ అల్లుడు మన అమ్మాయిని ఏలనంటే?"—రాణికంఠం రుద్ధమైపోయింది. ఆమె ఏడువసాగింది.

రాజుకు గట్టిగా కోపంవచ్చేసింది. అతని కన్నుల్లోనించి నిప్పురవ్వలు వెలువడినవి. ఆ ఉగ్రమూర్తిని చూచి రాణి అన్నది: "మీ రలా కోపం తెచ్చుకుంటా రెందుకూ! 'మీ అమ్మాయి నాకు అక్కర్లేదు; నేను ఏలుకోను. ఆమెను నా దగ్గరకు మీరు పంపించనక్కర్లేదు' అని ఒకఉత్తరం చంద్రద్వీపం నించే అల్లుడు నిజంగా రాశాడని కాదు నేను చెబుతున్నది.

కాని అలాంటిది జరగవచ్చు; అవకాశం ఉంది. బాగా ఆలో చించండి అని చెబుతున్నాను."

"అలా జరిగిననాడు ఆలోచించుకోవచ్చులే. ఇప్పుడా గొడవంతా పెట్టుకోవటానికి నాకు తీరికలేదు."

రాణి ఏడుస్తూనే ఉంది. "మహారాజా! మీ పాదాల మీద పడతాను. నా మాటకూడా కాస్త వినండి. విభ గతి ఏమి కావాలో కొంచెం ఆలోచించండి. నాగుండె వట్టిరాయిగా తయారైంది కాబోలు. లేకపోతే ఈపాటికి పగిలి ముక్కలై పోయి వుండేది. ఉదయుడిని నా బిడ్డడిని మీరు ఒకమామూ మనిషినిలా ఖైదులో పెట్టారు. రాచబిడ్డడు కదా! అతని తప్పే ముంది? ఏమపరాధంచేశాడనీ? ఒకవేళ ఏదైనా తప్పుచేసినా, నేరని కుంకకదా! రాచనీతి తెలిసినవాడు కాదే! వాడి మతే సరిగ్గా ఉండదు పాపం! భగవంతుడివ్వని తెలివితేటల్ని వా డెక్కడినించి తెచ్చుకుంటాడూ? అటువంటి వాడిని ఒక పెద్ద నేరస్థునిగా భావించటమా?" అంటూ ఆమె ఇంకా ఎక్కువగా ఏడవసాగింది.

రాజుకు ఇంకా ఎక్కువగా కోపం వచ్చింది. "ఈ మాట లన్నీ నువు చాలసార్లు చెప్పావు; నేను చాలసార్లు విన్నాను. ఎందుకూ చెప్పిందే చెబుతూ అలా విసిగిస్తావు?"

రాణి నుదురు కొట్టుకుంది. "అది నా దురదృష్టం; నే నేం చేసేది? ఎంతచెప్పి ఏం ప్రయోజనం? వినేదెవరు? పెట్టేదెవరు? ఒక్కసారి విభ ముఖం చూడండి వచ్చి మహా రాజా! ఆ పిల్ల ఎవరితోనూ ఏమీ మాటాడదు. లోలోపల

కుంగి కృశించిపోతున్నది. మీరేదన్నా ఉపాయం ఆలోచించక పోతే ఇక దాని బ్రతుకేమైపోవాలి?"

విని విని ప్రతాపాదిత్యునికి విసుగెత్తిపోయింది. ముఖము ముడతలు పడిపోయింది. అది చూచి రాణి మారు మాటాడ కుండా వెళ్ళిపోయింది.

## 27

యువరాజును జైల్లో పెట్టారని తెలిసి, సీతారాం హృదయం చాల క్షోభించింది; చేతులాడలేదు; కాళ్ళాడలేదు. యెకాయెకి రుక్మిణి యింటికి వెళ్ళాడు. తిట్టాడు; కొట్టబోయాడు; అప్పటికప్పుడు ఆమెను చంపి పారేద్దామన్నంత కోపం వచ్చిందతనికి. "నువ్వు దయ్యానివి; భూతానివి. నీ యింటికి నిప్పు పెడతాను; స్మశానంచేసి విడిచిపెడతాను. యువరాజును జైల్లోంచి విడి పించలేకపోతే నా పేరు సీతారాం కాదు. ఇదిగో, ఇప్పుడే రాయగడ్ వెడుతున్నాను. తిరిగివచ్చాక నీ పని పడతాను; నీ ముఖం బండమీద పెట్టి పచ్చడి పచ్చడి చెయ్యకపోతే చూడు! నీ మదం దించి నిన్ను ఊళ్ళోనించి వెళ్ళగొట్టినతర్వాత గాని నేను నిద్రబోననుకో."

రుక్మిణి అతని ముఖంలోకి అదేకంగా చూస్తూ ఉండి పోయింది కాసేపు అతని మాటలన్నీ బీరపోకుండా విన్నది. చూస్తూండగానే పళ్ళు పటపట కొరికింది; తిడుతూ గట్టిగా పిడికిళ్ళు పట్టింది; పెదవులు బిగించింది; కనుబొమలు ముడుచుకు పోయాయి; గుడ్లు పైకి మిటకరించాయి. మరుక్షణంలోనే రూపం మహా భయంకరంగా మారిపోయింది. అప్పటికప్పుడు

సీతారామ్ మీద పిడుగులా పడి, అతన్ని భస్మీపటలం చేసి వెయ్యాలని ఉంకిస్తూన్న ఒక పిశాచంలా తయారైంది. కాని అప్పుడే సీతారాం అచ్చోటు వీడి వెళ్ళిపోయాడు. క్రమేణా రుక్మిణికి పిడికిళ్ళు సడలినవి; పెదవులు విడివడినవి; కూచున్నది. "అలాగా! యువరాజు నీవాడేం? యువరాజుకు ఆపదవస్తే నాకు లేని నొప్పి నీకు వచ్చిందా? యువరాజుతో నాకేం సంబంధంలేదు; నీవేనా? తెలివిమాలిన దద్దమ్మా! యువరాజు నావాడోయ్! నీకు తెలీదు కామాలు! అతనికి మేలు చెయ్యాలన్నా! అతన్ని భస్మీపటలం చేయాలన్నా, నే నే చెయ్యాలి. యువరాజును ఖైదులోనించి నువు విడిపిస్తావా? చూస్తాగా ఎలా విడిపిస్తావో!"

సీతారామ్ ఆనాడే రాయగడ్ వెళ్ళాడు.

సాయంత్రం అవలేదింకా. వసంతరాయ్ మేడమీది వరండాలో కూచున్నాడు. ఎదురుగా దూరాన్నించి మైదానం కనిపిస్తూఉంది. ఈమధ్య సితార్ పూర్తిగా మానేశాడు పూర్వంలా అయితే సితార్ వాయిద్యం మారుమోగుతూ ఉండే దే! ఎదురుగా సూర్యాస్తమయ దృశ్యం చూస్తూ భవిష్యత్తులో తన అస్తమయాన్నిగూర్చి చింతిస్తూన్నాడేమో! మనసులో గొనుక్కుంటూ ఉన్నాడు: 'తోటిమిత్రులూ దాటిపోయిరీ, ఈ మోడొకటే మిగిలి యున్నదీ!'

ఇంతలో ఖాన్‌సాహెబ్ వచ్చాడు; వంగివంగి సలాం చేసాడు. ఖాన్‌సాహెబ్‌ను చూడగానే వసంతరాయ్ ముఖం వికసించింది. "ఓహో! ఖాన్‌సాహెబా! రా, కూచో" అన్నాడు. అంటూ నేలేచి ఎదురుగా వచ్చి "అదేమిటి ఖాన్

సాహెబ్! ఇవాళ నీముఖం అలా విచారంగా ఉందేం? ఒంట్లో బాగా లేదా?" అని అడిగాడు.

"ఒంట్లో బాగాలేకేం మహారాజా! మీరే విచారంగా ఉంటుంటే మేము ఆనందంగా ఎలా ఉంటాం చెప్పండి! కవి ఏమన్నాడో చెప్పమంటారా? నిశాదేవి అనుకుంటున్నదిట: 'నాదేముంది? నేనెవరిననీ? నా తలమీద పెట్టుకున్నాను చంద్రుడిని. ఆ చంద్రుడు నవ్వితే నేనూ నవ్వుతాను; ఆయన విచారంగా వుంటే నేనూ విచారంగా ఉంటాను' అని. మహారాజా! మా ప్రజలదికూడా అదే స్థితి. మీరు నవ్వితే మేమూ నవ్వుతాం."

"అదేంమాట! ఖాన్‌సాహెబ్! నాకేం? హాయిగానే ఉన్నానుగా! నన్ను చూచుకుని నాలో నేను ఆనందిస్తూనే ఉన్నానుగా! నాకేమీ విచారంలేదు ఖాన్‌సాహెబ్!"

"మీరు పూర్వంలాగా పాటలుపాడటమే లేదు మహారాజా!"

వసంతరాయ్ ముఖంలోకి గాంభీర్యం వచ్చింది. "నా పాట వినాలని ఉన్నదా ఖాన్‌సాహెబ్!" అంటూ పాట ఆరంభంచేశాడు: "తోటి మిత్రులూ దాటిపోయిరీ..."

"మీ రిప్పుడు సితారు వాయించటమే లేదా! ఎక్కడ పారేశారు?"

వసంతరాయ్ కొంచెంగా నవ్వుతూ "సితారు ఎక్కడో పడివుండాలి. తీగలుమాత్రం తెగిపోయాయి. ఇంక స్వరం ఏమివస్తుంది?" అంటూ తలమీద చెయి తడుపుకుంటూ అటు మామిడితోటవైపు చూస్తూఉండిపోయాడు. ఇంతలో –

"జయము మహారాజావారికి" అంటూ సీతారాం వచ్చాడు; నమస్కారం చేశాడు. వసంతరాయ్ ఆశ్చర్యపోయాడు. "అరె, ఎవరూ? సీతారాం? రా-రా- కూర్చో. బాగున్నావా? దాదాభాయి కులాసాగా ఉన్నాడా? దీదీరాణి బాగా ఉందా?"

ఖాన్‌సాహెబ్ వెళ్ళిపోయాడు. "అంతా చెబుతాను. వుండండి మహారాజా!" అంటూ సీతారాం తీరుబాటుగా కూచుని సర్వవిషయాలూ మెల్లిగా చెప్పాడు. ఉదయాదిత్యుడు కారాగారంలో పడటానికి గల కారణంమాత్రం చెప్పలేదు."

వసంతరాయ్‌కి తలమీద పిడుగుపడి నట్టయింది. కనుబొమలు పైకి లేచాయి. పెదవులు విడివడిపోయాయి. కన్నులు పత్తికాయల్లా అయినవి. "ఆఁ! అలాగా!" అన్నాడు సీతారాం చెయిపుచ్చుకుని.

"ఔను, నిజంగానే మహారాజా!" అన్నాడు సీతారాం.

కాసేపటివరకు వసంతరాయ్ ఏమీ మాటాడలేదు. చివరకు 'సీతారాం!' అన్నాడు పిలుస్తున్నట్టుగా.

"చిత్తం. మహారాజా!"

"దాదాభాయ్ ఇప్పు డెక్కడున్నాడు?"

"కారాగారంలో"

వసంతరాయ్ తలమీద చేత్తో తడువుకోసాగాడు. ఉదయాదిత్యుడు కారాగారంలో వున్నాడు అన్నమాట, అతని మెదడులోకి ఎక్కటంలేదు కామాలు! ఉదయాదిత్యుడు కారాగారంలో బంధితుడైనాడన్న విషయం ఎంతప్రయత్నించినా

నమ్మలేకపోతున్నాడేమో! కొంతసేపటికి మళ్ళీ సీతారాం చెయిపుచ్చుకుని 'సీతారాం!' అని పిల్చాడు.

"చిత్తం మహారాజా!"

"దాదాభాయ్ ఇప్పుడేం చేస్తున్నాడు?"

"చేసేదేముంది మహారాజా! కారాగారంలో ఉన్నారు"

"అందరూ కలిసి అతన్ని జైల్లో పెట్టించారన్నమాట!"

"చిత్తం మహారాజా!"

"ఎవ్వరూ అతన్ని జైల్లోనించి తప్పించలేకపోయారు?"

"ఔను."

"ఒక్కడే కారాగారంలో పడివున్నాడు?"

"ఔను - మహారాజా!"

అసలు ఈ ప్రశ్నలన్నీ వసంతరాయ్ ఎవర్నీ అడగటం లేదు. తనకు తానే అనుకుంటూ ఉన్నాడు. తన్నే అడుగుతున్నాడు కదా అనుకుని సీతారాం జవాబులు యిచ్చాడు. చివరికిలా అన్నాడు వసంతరాయ్: "దాదాభాయీ! రా, నువు నా దగ్గరకు వచ్చెయ్యి నీ హృదయం గుర్తించినవాడెవడూ లేడక్కడ."

# 28

ఆ మర్నాడే వసంతరాయ్ యశోహరపురం వెడదామని బయలుదేరాడు. చాలమంది వద్దన్నారు; కాని అతడు వినలేదు. యశోహరపురం చేరగానే సరాసరి అంతఃపురంలోకి వెళ్ళాడు. విభ అతన్ని చూచి ఆశ్చర్యపోయింది. ఆమెకేమీ

అర్థం కాలేదు చాలసేపటివరకూ. ఎందుకు వచ్చాడబ్బా అను కుంది. విస్మయంలో ఆనందంలో మునిగిపోయి చాలసేపటి వరకూ మాటాడలేకపోయింది; అతనివైపే చూస్తూ నిల్చుండి పోయింది. చివరకు వచ్చి పాదాభివందనం చేసింది. విభాదేవి ముఖంలోకి తదేకంగా చూస్తూ వసంతరాయ్ 'విభా' అన్నాడు. మరేమీ మాటాడలేకపోయాడు. సీతారామ్ చెప్పినదంతా సత్యం కాకపోవచ్చునన్న ఆశాకిరణం ఒకటి అతని మెదడులో క్షణమాత్రంగా తళుక్కుమన్నది. ఆ విషయమై విభను అడుగుదామంటే లోపల భయంగా ఉంది. ఆమె మనస్సులో ఎంత బాధ కలుగుతుందో! అందుచేత భయంభయంగా 'విభా!' అన్నాడు. తా నడగదలచిన ప్రశ్న సగం అందులో ధ్వనించేటట్టు - విభకు అర్థమైంది. కాని ఏమీ సమాధానం చెప్పలేకపోయింది. ప్రప్రథమంలో కలిగిన ఆనందం సన్నగిలు తోంది. తాతయ్య వచ్చాడు ఇన్నాళ్ళకు. తానొక్కతే అతనికి స్వాగతం చెప్పింది. మరెవ్వరూ వచ్చి ఆయన్ను పలకరించిన వాళ్ళే లేరు. సురమ గాలేదుకదా! తానొక్కతే ఈ అంధ కారమయశూన్యభవనంలో తాతయ్యదగ్గర వచ్చి నిల్చుంది. తాతయ్య వచ్చాడంటే సురమ గదిలో ఆనందం పొంగి పొరలుతూ ఉండేది పూర్వం. ఇప్పుడాగది ఎలా ఉందో! స్తబ్ధంగా, శూన్యంగా ఉంది. తాతయ్యను చూస్తూ ఏడుస్తు న్నట్టుంది. తాతయ్య ఎందుకో సురమ గదివైపు నడిచివెళ్లాడు. గదిముందు నిల్చున్నాడు. గుమ్మంలోనించి వంగి లోపల నాలుగు మూలలా చూచాడు. వెంటనే వెనక్కు తిరిగి "ఇంటిలో ఎవరూ ఉంటటం లేదా దీదీ రాణీ!" అన్నాడు.

విభ కన్నుల్లో అశ్రువులు పొర్లాయి. "లేదు తాతయ్యా! ఎవరూ ఉండటం లేదు." అన్నది విభ – "ఎవరూ లేరిక్కడ" అని ఆ నిశ్శబ్ద నీరవస్థితిలో ఉన్న గది హాహాకారం చేస్తూ చెబుతూన్నట్టుగా ఉంది.

వసంతరాయ్ చాలసేపు అక్కడే నిల్చున్నాడు మౌనంగా. చివరకు విభ చెయిపుచ్చుకుని గొణిగాడు: "కోటి మిత్రులూ దాటిపోయిరీ, ఈ ప్రేమాడొకటే మిగిలియున్నదీ."

వసంతరాయ్ ప్రతాపాదిత్యుని దగ్గరకు వెళ్ళాడు. ప్రార్థనాపూర్వక కంఠస్వరంతో ఇలా అన్నాడు: "నాయనా, ప్రతాప్! పాపం, అనవసరంగా ఉదయుడిని బాధపెట్టటం ఎందుకు చెప్పు! అతడు మీకేం అపకారం చేశాడు చెప్పు. అతడంటే మీకు యిష్టం లేకపోతే, అడుగడుక్కీ మీ కతడు కంటకంగా కనిపిస్తూ ఉంటే అతన్ని ఈ ముసలివాడికి ఇచ్చెయ్యకూడదూ! ఈ పెద్దతనంలో నాకు సాయంగా ఉంటాడు; నా దగ్గిరే అట్టిపెట్టుకుంటాను"

ప్రతాపాదిత్యుడు అంతా సావధానంగా విని చివరకిలా అన్నాడు: "పెద్దనాన్నా! నేనుచేసిన పనేదో బాగా ఆలోచించే చేశాను. ఈ విషయంలో నీకు నాకన్న ఎక్కువ తెలియదు. అయినాకూడా పరామర్శచేసిపోవటానికి వచ్చావు. నీ విప్పు డేమిచెప్పినా నేను వినదలచుకోలేదు; వినను"

వసంతరాయ్ లేచి ప్రతాపాదిత్యునికి దగ్గరగావచ్చాడు; అతని చెయిపుచ్చుకున్నాడు. "నాయనా! ప్రతాప్! నీకు గుర్తుందో లేదో, నిన్నెంత గారాబంగా, ప్రేమగా పెంచానో తెలుసునా? నా సోదరుడు నిన్ను నాకు అప్పగించి స్వర్గస్థ

డైనాడు. ఆనాటినించి నీకు నేను ఒక్క కష్టంకూడా కలగనీయ
లేదు. నిస్సహాయస్థితిలో నువ్వువచ్చి నాచేతిలోపడ్డావు; తండ్రి
లేని కొరత నీ కేనాడైనా కలిగేట్టు ప్రవర్తించానా? చెప్పు
ప్రతాప్! ఈ ముసలితనంలో నా కెందుకిలా బాధకలిగిస్తావు?
నేనేమి అపరాధంచేశానో చెప్పు. నేనేదో చిన్నప్పుడు నిన్ను
పాలించాను, పోషించాను కాబట్టి నువ్వు నాకు ఋణపడి
వున్నావు అనికాదు నే ననేది! నాసోదరుడు నాకు అప్పగించిన
బాధ్యత నిర్వర్తించుకున్నాను. అతని ఋణం తీర్చుకున్నాను,
అయిపోయింది. పూర్వపుఋణం చెల్లించమన్న దృష్టితో కాదు
నేనిప్పుడు అడుగుతున్నది. కేవలం యాచనగా అడుగుతు
న్నాను. బిచ్చంకూడా పెట్టవా?" – వసంతరాయ్ కన్నుల్లో
నించి అశ్రువులు స్రవించాయి. రాతివిగ్రహంలా కూచున్నాడు
ప్రతాపాదిత్యుడు. వసంతరాయ్ మళ్ళీఇలాఅన్నాడు: "అయితే
నా ప్రార్థన మన్నించవన్నమాట. బిచ్చంకూడా పెట్టవన్న
మాట! మాటకు జవాబైనా చెప్పవా ప్రతాప్!" – వసంత
రాయ్ ఒక దీర్ఘ నిశ్వాసం విడిచాడు. "సరే, పోనీ – ఇంకొక
చిన్న ప్రార్థన! ఒక్కసారి వెళ్ళి ఉదయుణ్ణి చూడాలనివుంది.
కారాగారంలోకి వెళ్ళేటప్పుడు నన్నెవరూ అడ్డగించకుండా ...
అంతమాత్రం అనుమతి అయినా ప్రసాదిస్తావా?"

ప్రతాపాదిత్యుడు ఒప్పుకోలేదు. అనుమతి నిరాకరిం
చాడు. తానుండగా తనకన్నా ఎక్కువప్రేమ ఉదయాదిత్యునిపై
వసంతరాయ్ ప్రకటించటం ప్రతాపాదిత్యునికి చాల అసహ్యా
మనిపించింది. లోలోపల చాలకోపం వచ్చేసింది. తన్నాక

అపరాధినిగ్గా ఇతరులు అనుకుంటూన్నకొద్దీ అతనికి కాఠిన్యం మరీ జాస్తి అౌతూ ఉంటుంది.

వసంతరాయ్‌హృదయం ఎంతో క్షోభించింది. చాల పచారవడ్డాడు. అంతఃపురంలోకి వెళ్ళాడు. అప్పటి అతని ముఖకవళికచూచి విభ చాలనొచ్చుకుంది. "రా, తాతయ్యా, నా గదిలోకి పోదాం రా!" అన్నది. చెయ్యిపుచ్చుకుని వసంత రాయ్ మెల్లిగా ఆమె వెనుకనే వెళ్ళాడు. గదిలోకివెళ్ళి కూచున్నారు. విభ చేత్తో తాతయ్య తల నిమురుతూఉన్నది. ఇంతలో ఒక దాసివచ్చి "మహారాజా! మహారాణీగారు తమకు ప్రణామంచెయ్యటానికి తమరాకకోసం ఎదురు చూస్తూ వున్నారు" అన్నది.

వసంతరాయ్ రాణివద్గరకు వెళ్ళాడు. విభ కారాగారం వైపు వెళ్ళింది.

రాణి వసంతరాయ్‌కి ప్రణామంచేసింది. "ఆయుష్మతీ భవ!" అని వసంతరాయ్ ఆశీర్వదించాడు.

"నన్నిప్పుడలా ఆశీర్వదించకండి మామయ్యగారూ! నే నెంతదబ్బున దాటిపోతే అంత అదృష్టవంతురాల్ని అను కోండి". అన్నది రాణి.

"రామ, రామ! అలాంటిమాట ఎప్పుడూ అనుకో కూడదమ్మా నువు!" అన్నాడు వసంతరాయి జుగుప్సా సూచ కంగా.

"అనుకోకండా ఎలా ఉండను మామయ్యగారూ! మా యింటికేదో శనిదృష్టి పడ్డట్టుగా ఉంది. విభను చూస్తోంటే నాకు సగం చచ్చినట్టుగా ఉంటోంది అన్నం

తింటూంటే రుచి, పచి కనిపించటం లేదు. ఆ పిల్లను ఏమి అడిగినా బైటికి ఒక్క మాటకూడా చెప్పదు. లోపల్లోపల కుళ్ళి కృశించిపోతున్నది రోజురోజుకూ. నేనేం చెయ్యాను? ... పాలుపోవటంలేదు"

వసంతరాయ్ మిక్కిలి వ్యాకులచిత్తుడైనాడు. "ఇది చూడండి మామయ్యగారూ! దీనికేం ఉపాయం ఆలోచించాలో ఏమో!" అంటూ రాణి అతని చేతికిచ్చింది అల్లుడు పంపిన ఉత్తరాన్ని.

వసంతరాయ్ ఇంకా ఉత్తరం పూర్తిగా చదవనేలేదు రాణి కన్నీళ్ళొత్తుకుంటూ ఇలా చెప్పసాగింది "ఈ యింట్లో నే నింకా సుఖపడేది ఏముంది? ఇంకా బ్రతకటం ఎందుకు? నా బిడ్డడిని తీసుకుపోయి జైల్లో పెట్టారు ఆయన. వాడేం తెలియనివాడు. రాజకార్య వ్యవహారాల్ని నడిపే తెలివితేటలు వాడికి లేవు. అదే వాడిది పెద్ద అపరాధం - తెలివితేటలు లేవే అనుకోండి; ఎంతైనా రాజపుత్రుడుకదా! నా కడుపునగన్న సంతానమే! ఆ కారాగారంలో ఎలా ఉంటున్నాడో ఏమో! నేను కూడా వెళ్ళి చూద్దామంటే వీల్లేదుట" - ఇటీవల కొన్నాళ్ళనించీ రాణి ఏవిషయం మాట్లాడుతున్నా ఉదయుని ప్రస్తావన లేక మానదు. అతన్ని గురించిన చింత ఆమెకు హృదయంలో శూలంలా అహోరాత్రాలు బాధగానే ఉంటున్నది.

ఉత్తరం చదివి వసంతరాయ్ నిర్ఘాంతపోయాడు. తల మీద చెయి రుద్దుకుంటూ ఉండిపోయాడు. "ఈ ఉత్తరం ఎవరికీ చూపించలేదు గదా?" అన్నాడు చివరకు.

"ఇలా ఉత్తరం వచ్చినట్టు తెలిస్తే మహారాజావారు అందరి ప్రాణాలూ తీసివెయ్యరూ! విభకు తెలిస్తే ఏమయ్యో, గాయ్యో చూచుకోదూ!"

"ఇది ఎవరికీ చెప్పకండా దాచివుంచి మంచిపనే చేశావులే. లేకపోతే ఎంత అనర్థం అయేది! ఇప్పటికైనా నువ్వు వెంటనే విభను అత్తగారింటికి పంపించివెయ్యి. లేనిపోని మానాభిమానాలు పెట్టుకోవద్దు."

"నాకూ అలాగే తోస్తున్నది. మానాభిమానాలు పెట్టుకుని చేసేదేముంది గనక? ఆ పిల్ల కాపురం బాగుపడితే నా కంతేచాలు! నా కింకా కావలసిందిమాత్రం ఏముంది? అల్లుడు నాకూతుర్ని అనాదరంగా చూస్తాడేమో అనేది నా కొక్కటే భయంగా ఉంది."

"విభను నిరాదరంగా చూస్తాడా? ఎవరుగాని నిరాదరంగా చూచే వ్యక్తికానేకాదు విభ. ఎక్కడికి వెళ్ళినా ఆమెకు ఆదరం లభించితీరుతుంది ఆమె సాక్షాత్తు లక్ష్మీదేవి. అలాంటి బంగారుబొమ్మ మరెక్కడావుండదు. మీ మీదవున్నకోపంవల్ల రామచంద్రరాయ్ అలా రాసివుంటాడు; అంతేగాని, విభ అక్కడికి వెళ్ళిన తక్షణమే అతనికోపం యావత్తూ చల్లారిపోతుంది." వసంతరాయ్ హృదయం, బుద్ధి అత్యంత సరళమైనవి. అందువల్ల అంతకుమించి ఆతడుఊహించలేకపోయాడు. రాణికూడా అలాగే ఉద్దేశపడ్డది. "చంద్రద్వీపంనించి విభను పంపించవలసిందిగాకోరుతూ అల్లుడుకబురుచేశాడు—అన్నవార్త అంతఃపురంలోవ్యాపింపజెయ్యి. అలాచేస్తే విభకూడా బయలు

దేరి వెళ్ళటానికి ఒప్పుకుంటుంది" అని సలహా చెప్పాడు వసంతరాయ్.

## 29

సంధ్యాసమయం వసంతరాయ్ బయటిగదిలో ఒక్కడే కూచున్నాడు. సీతారాంవచ్చి నమస్కారంచేశాడు. "ఏం, సీతారాం? కబుర్లేమిటి?" అన్నాడు వసంతరాయ్.

"తరువాత చెబుతాను. ముందు మీరు బయలుదేరి నాతో రండి"

"ఎక్కడికి?"

సీతారామ్ ఇంకా దగ్గరగావచ్చి వసంతరాయ్ చెవిలో ఏమో చెప్పాడు. అంతా వినగానే వసంతరాయ్ నేత్రాలు విప్పారినవి. "శేష్, బాగుంది" అన్నాడు.

"బయలుదేరండి మరి!"

"ఇప్పుడేనా?" అడిగాడు వసంతరాయ్ కొంచెం ద్వైధీభావం కనబరుస్తూ.

"చిత్తం; ఈ క్షణంలోనే వెళ్ళాలి."

"ఒక్కసారి విభనుచూచి మాటాడివస్తాను"

"ఊహుం. టైము లేదు."

"ఎక్కడికి వెళ్ళాలి?"

"చెబుతాగా! నాతో రండి"

వసంతరాయ్ లేచాడు: "ఒక్కసారి విభతో చెప్పివస్తే బాగుండునే"

"ఆలస్యంచేస్తే అంతా పాడైపోతుంది"

"సరే, పద"

ఇద్దరూ బయలుదేరి వెళ్లారు. కొంతదూరం వెళ్ళాక "కొంచెం ఆలస్యం అయినా లాభం లేదా?" అని అడిగాడు వసంతరాయ్.

"లాభంలేదు మహారాజా! తలపెట్టినపని యావత్తూ భగ్నమైపోతుంది. పైగా మనం చాల సంకటావస్థలో పడి పోతాం."

తాతయ్యగారు వచ్చినట్టు ఉదయాదిత్యునికి తెలి యదు విభ అయినా చెప్పలేదు. చెప్పినమాత్రం ఏం ప్రయో జనం? తాతయ్య వచ్చి చూడ్డానికి అనుమతి లేదుగా! అందు వల్ల విభ చెప్పలేదు. ఆ నాడు సాయంత్రం కాకముందే ఆమె కారాగారంనించి వెళ్ళిపోయింది. ఉదయాదిత్యుడు దీపం ముందు కూచుని సంస్కృతగ్రంథమేదో చదువుకుంటున్నాడు. ఒక గాలితరగ లోపలికి తోసుకువచ్చి దీపం ఆరిపోయింది. ఉదయాదిత్యుడు పుస్తకం మూసివేసి పక్కమీద పడుకున్నాడు. అతని మనస్సులో ఏవేవో ఆలోచనలు సందడింపసాగాయి: ఇవాళ విభ రావటమే కొంచెం ఆలస్యంగా వచ్చింది. మామూలుకంటే ముందుగానే వెళ్ళిపోయింది. ఒక విభతప్ప తన్నెవరూ చూడ్డానికే రావటంలేదు. అందుచేత విభ పరిస్థితే అతనికి ఒకే ఒక ఆలోచనీయవిషయం అయింది. ఆమె భవి ష్యత్తుగూర్చి ఆలోచించుకుంటూ ఉండగా కాస్త కునుకు పట్టింది.

ఇంతలో బైట పెద్ద కోలాహాలం ఆరంభమైంది. 'నిప్పు, నిప్పంటుకుంది; తగలబడిపోతోంది' అని గడబిడగా కేకలు

వినిపించాయి. ఉదయాదిత్యునికి మెలకువ వచ్చింది. అతని హృదయం కంపించింది. బైటినించి వేలాది మనుష్యుల కంఠాలు గడబిడగా అరుస్తున్నవి. రాజప్రాసాదానికి చేరువలో ఎక్కడో ఏ ఇంట్లో నిప్పంటుకుని తగలబడుతున్నాయేమో ననుకున్నాడు యువరాజు. ఇంతలో తానున్న కారాగారపు తలుపులు తెరచు కున్నాయి. ఆ చీకటిలో యెవరో లోపలికి వచ్చాడు. "ఎవరది?" అన్నాడు యువరాజు ఉలికిపాటుగా.

"నేను సీతారామ్‌ను. మీరు వెంటనే బయటికి వచ్చెయ్యండి - ఇక్కడ ఉండవద్దు"

"ఏం? ఎందుకూ?"

"కారాగారం నిప్పంటుకుంది. చప్పున బైటికి పదండి" అంటూ సీతారామ్ చెయిపుచ్చుకుని యువరాజును బైటికి తీసుకువచ్చాడు.

ఇన్నాళ్ళకు ఉదయాదిత్యునికి విడుదల లభించింది. పైన విశాలమైన ఆకాశం కనిపించింది - విశృంఖలుడై వాయు కుమారుడు ధాటి పరచివచ్చి అతన్ని ఆలింగనం చేసుకున్నాడు. చుట్టూ అంధకారం; పైన నక్షత్రాలు; బాగా గడ్డిమొలిచి వున్న విశాలమైన మైదానంలో అడుగులు వేసుకుంటూ వెడు తూంటే ఉదయాదిత్యునికి ఎంతో ఆనందంగా ఉంది. ఈ ఆనందంలో అతడొకచోట కాసేపు ఆగి "ఇప్పుడు మనం ఏం చెయ్యాలి? ఎక్కడికి వెళ్ళాలి?" అని అడిగాడు.

"రండి, నాతో రండి" అన్నాడు సీతారామ్.

అక్కడ నిప్పు బాగా అంటుకుని తగలబడిపోతూ ఉంది. సాయంత్రమప్పుడు చాలమంది ప్రజలు ప్రధాని, రాజోద్యో

గులతో ఏదో విన్నవించుకోవాలని వచ్చాను. మేడముందు వసారాలో కూచున్నాను. నిప్పంటుకున్నదనీ, తగలబడుతున్నదనీ మొట్టమొదటగా గలభా లేపిందివాళ్ళే కారాగారానికి దగ్గరగానే కావలావాళ్ళు కాపురముండే యిళ్లు ఒక శ్రేణిగా చాల ఉన్నాయి. అవి నిప్పంటుకున్నట్టు తెలియగానే కావలా వాళ్ళంతా ఆదరాబాదరా పరిగెత్తిపోయారు; వాళ్ళ సర్వస్వం ఆ కొంపల్లోనే ఉండాయెను. కారాగారద్వారం దగ్గరకూడా కావలావాడు లేడు. రాత్రి చాలానే పొద్దుపోయింది; ఇంకా నిప్పు ఆరలేదు; ఇండ్లు తగలబడుతూనే ఉన్నాయి. యెటు చూచినా జనం పరిగెత్తటం — నానా గందరగోళంగావుంది. ఇంతలో ఒక స్త్రీ గబగబా పరుగెత్తుకుంటూ వచ్చింది; ఏమిటేమిటో అరుస్తూ ఉంది; కాని ఆమె మాటలు నిల్చుని వినేందుకు యెవరికి తీరికవుంది? విన్న పెద్దమనిషి యెవరో ఒకాయన "యువరాజు పారిపోతే నీకేం, నాకేం? అది దయాల్‌సింగ్ పని. అతనే చూచుకుంటాడు" అంటున్నాడు. అందరూ ఇలాగే ఉపేక్షాభావమే కనబరచేసరికి ఆ స్త్రీ ఉగ్రరూపం దాల్చింది. ఇంతలో యెవరో వచ్చారు అటునైపు — ఆమె అతని చేయి పుచ్చుకుని "తెలివిమాలినవాడా? నీ కళ్ళేమయినా పోయా యేమిటి? యువరాజు పారిపోయాడు; తెలిసిందా? రాజుగారి దగ్గర నౌకరీ చేస్తున్నావే! అంతమాత్రం ఒళ్ళు దగ్గర వుంచుకోనక్కర్లేదూ! రేపు రాజుగారితో చెప్పి మీ అందరినౌకరీ వూడదీయించకపోతే చూడు" అన్నది. "అయితే మంచిదే బాగానే జరిగిందిలే! నీకెందుకు కడుపునొప్పి?" అన్నాడా వ్యక్తి. అంటూ నాలుగు దెబ్బలుకూడా కొట్టాడు ఒళ్ళు వాచేటట్టు.

నిప్పు అంటించినవాళ్ళలో అతను ఒకడు. అలా దెబ్బలు తిని ఆ స్త్రీ ఇంకా ప్రచండరూపం తాల్చింది. ఆకలిగొన్న పులిలా అయిపోయింది. కన్నుల్లోనించి నిప్పుకణాలు చిమ్ముకొస్తున్నాయి. తగలబడుతున్న కట్టె ఒకటి తీసుకుని ఆ వ్యక్తి వెంట పరిగెత్తింది. యెంతసేపటికీ అతడు చిక్కకపోయేసరికి విసిరివేసిందా నిప్పుకట్టె అతనిమీదికి.

# 30

సీతారామ్ యువరాజును సరాసరి కాలువదగ్గరకు తీసుకుపోయాడు. ఒడ్డునే ఒక పెద్దనావ ఉన్నది. ఇద్దరూ నావ దగ్గరకు వెళ్ళి ఆగారు. "దాదాభాయీ! వచ్చావా?" అన్నాడు నావలోని వ్యక్తి ఎవరో యువరాజును చూడగానే. ఆ కంఠధ్వనివినగానే యువరాజు ఉలికిపడ్డాడు. చిరపరిచితమైన కంఠధ్వని! చిన్నప్పటినించీ వింటూన్న కంఠధ్వని! ప్రథమంలో కలిగిన ఆశ్చర్యం తగ్గుతూండగానే వసంతరాయ్ రానేవచ్చాడు; అమాంతం కావిలించుకున్నాడు. ఇద్దరికీ కన్నులు చెమ్మగిలినవి; ఇద్దరూ ఒడ్డుమీదే కూచున్నారు. చాలసేపు అయాక "తాతయ్యగారూ!" అన్నాడు ఉదయాదిత్యుడు. "ఏమిటి దాదాభాయీ!" అన్నాడు వసంతరాయ్. తరువాత చాలసేపటివరకూ ఇద్దరూ మౌనంగానే ఉన్నారు. ఉదయాదిత్యుడు పైకి చూచాడు; కిందచూచాడు; నలువైపులా చూచాడు; వసంత్ రాయ్ ముఖంలోకి చూచాడు. "తాతయ్యగారు! ఇవాళ నాకు విడుదల లభించింది. మీరు కనిపించారు. ఇంకా నాకు కావలసిం

దేముంది? ఇటువంటి క్షణాలు దుర్లభంకదా! ఎంతోసేపు వుండిపుండవుగాదా అన్నాడు వ్యాకుల కంఠస్వరాన."

"యువరాజుబాబూ! పదండి; నావలోకి పదండి" అన్నాడు సీతారామ్ చేతులుజోడించి.

"యువరాజు చకితుడైనాడు. ఎందుకూ? నావలోకి ఎందుకూ?"

"లేకపోతే కాపలావాళ్ళు పరుగెత్తుకుని రానేవస్తారు. మళ్ళీ చిక్కుల్లోపడతాం."

వసంతరాయ్ ఉదయాదిత్యుని చేయిపట్టుకుని "దాదా భాయీ! నేను నిన్ను చౌర్యంచేసి ఎత్తుకుపోతున్నాను. ఇది పాషాణహృదయులరాజ్యం. నిన్ను తీసుకుపోయి నా ప్రాణాల్లో దాచుకుంటాను. అక్కడ నువు నిర్భయంగా వుండవచ్చు" అంటూ ఉదయాదిత్యుని తనహృదయం దగ్గరకులాక్కున్నాడు- ఈ ప్రపంచంనించి అతని లాక్కుపోయి తన స్నేహరాజ్యంలో సుప్రతిష్ఠితునిచేయ గోరుతున్నవాడువలె.

ఉదయాదిత్యుడు కొంతసేపు సాలోచనగా ఉండిపో యాడు. "వద్దు తాతయ్యగారూ! ఈవిధంగా పారి పోవటం నా కిష్టం లేదు."

"అదేమిటి దాదాభాయీ! ఈ ముసలివాడిని ఇప్పుడే మరచిపోయావా?"

"నేను వెళ్ళి నాన్నగారి పాదాలమీదపడి ఏడుస్తాను. ప్రార్థిస్తాను. నేను రాయగడ్ వెళ్ళటానికి వారు అనుమ తించవచ్చు."

వసంతరాయ్ వ్యగ్రచిత్తుడైనాడు.

"దాదాభాయీ! నా మాట విను; నువ్వు అక్కడికి వెళ్ళొద్దు. అక్కడ నీ తలపులు ఫలించవు"

ఉదయాదిత్యు డొక్క దీర్ఘ నిశ్వాసం విడిచాడు. "అయితే నేను మళ్ళీ కారాగారంలోకే వెళ్ళిపోతాను"

"వెళ్ళయితే, ఎలా వెడతావో చూస్తాను. నిన్ను నేను అసలు వెళ్ళనీను" అన్నాడు వసంతరాయ్ అతని చెయిపట్టుకుని.

"తాతయ్యగారూ! నేనొక అభాగ్యుడిని. నన్ను అనవసరంగా తీసుకుపోయి మీరెందుకు ప్రాణంమీదికి తెచ్చుకుంటారు? నేను వున్నచోట శాంతి అనేది ఉంటుందా?"

"నాయనా, బాబూ! ఎంతచెప్పినా అర్థం చేసుకోలేకండా వున్నావేం? నీ మూలంగా విభకూడా కారాగారవాసిని అయిపోయింది. ఈ చిన్నవయస్సులో ఆ పిల్ల తనజీవన సుఖాలన్నింటికీ తిలాంజలి లివ్వుకోవాలనేనా నీ కోరిక!" అంటూ వసంతరాయ్ కన్నీళ్ళు ఒత్తుకున్నాడు.

"అయితే పోదాంపద, తాతయ్యగారు" అన్నాడు మరుక్షణమే ఉదయాదిత్యుడు. వెంటనే సీతారామ్‌వైపు తిరిగి "సీతారాం! ఇప్పుడు కోటలోకి మూడు ఉత్తరాలు రాసి పంపించాలి" అన్నాడు.

"కాగితం, కలం, దీపం నావద్దో ఉన్నాయి, తీసుకువస్తాను ఉండండి; తమరు చెప్పిన రాయాలి. వ్యవధిలేదు" అన్నాడు సీతారామ్.

తండ్రికి, తల్లికి, విభకు మూడు ఉత్తరాలు సంక్షిప్తంగా రాశాడు ఉదయాదిత్యుడు. తండ్రికి రాసిన వుత్తరంలో క్షమాభిక్ష యాచించాడు. తల్లికి ఓదార్పు వాక్యాలు పలు

కుతూ "నేను రాయగడ్ వెళ్ళి తాతయ్యగారిదగ్గర శాంతంగా కాలక్షేపంచేస్తాను. నువు ఏవిధంగానూ మనస్సుకు చింతపెట్టుకో వద్దు" అని రాశాడు. విభకు బుద్ధులు చెబుతూ "నువు ఇక అత్తగారింటికి వెళ్ళి భర్తృసేవలో నిమగ్నురాలివి కావాలి; నా కష్టాలు తీరిపోయినట్టే ఇక. తాతయ్యగారిదగ్గర హాయిగా వుంటాను" అని రాశాడు. ఈ వుత్తరం రాస్తూంటే అతని కన్నులు చెమ్మగిల్లాయి. సీతారామ్ ఆ మూడు వుత్తరాల్నీ ఒక నమ్మకమైన మనిషికి ఇచ్చి కోటలోకి చేర్చమని చెప్పాడు. అందరూ నావలోకి ఎక్కబోతున్నారు. సరిగ్గా ఆ సమయాన ఎవరో అటువైపు పరిగెత్తుకుంటూ రావటం కనిపించింది. సీతారామ్ ఉలికిపాటుగా "అదిగో రానేవచ్చింది దయ్యం" అన్నాడు. చూస్తూవుండగానే రుక్మిణి అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చింది. ఆమె వికృతభయంకరరూపం చూచి అందరూ భయపడ్డారు. ఆడుపులిలా వచ్చి ఆమె ఉదయాదిత్యునిమీద దూకబోయింది. సీతారాం వచ్చి మధ్యలో అడ్డగించాడు. ఆమె అతనిమీదే విరుచుకుపడింది అతడామె నడుము గట్టిగా పట్టి ఆపాడు. ఇంతలో పల్లెవాళ్ళు చాలమంది వచ్చి రుక్మిణిని చుట్టేశారు. ఆమె తలపు నెరవేరలేదు; అధీరురాలైపోయింది; లోపల రోషం వుబుకుతోంది; ఏం చేయలేకపోయింది. నెత్తి బాదుకుంది; రొమ్ము బాదుకుంది, వెంట్రుకలు పీక్కుంది, చీత్కారం చేసింది. "నా పనిఅంతా వ్యర్థమైపోయింది. ఏం చెయ్యలేకపోయాను. ఇక నేను చచ్చిపోతున్నాను. చావండి మీరంతా కూడా, ఆడదాన్ని చంపినపాపం మూటగట్టుకుని అనుభవించండి" అని గొంతు చించుకుని అరి

చింది. ఆమె చీత్కారాలు అభిశాపంవలె నాలుగువైపులా ప్రతిధ్వనించాయి. చూస్తూ చూస్తూండగానే ఆమె పోయి అమాంతం కాలువలో దూకింది.

సీతారామ్ మెడమీద ఆమె గోళ్ళతో రక్కిపెట్టింది కాబోలు, నెత్తురు ధారగా ప్రవహిస్తోంది. ఉత్తరీయం తడిపి కట్టుకున్నాడు. యువరాజు దగ్గరకు వెళ్ళాడు. అతనికి నుచ్చె మటలు పోశాయి; కాళ్ళు చేతులు వణికిపోతున్నాయి. ఇంచుమించు స్మృతి తప్పిన మనిషిలా వున్నాడు. వసంతరాయ్ కూడా విస్తుపోయి చూస్తూ కూచున్నాడు. పల్లెకాళ్లువచ్చి తిన్నగా ఇద్దరినీ నావలోకి తీసుకుపోయి కూర్చోబెట్టారు. నావ బయలుదేరింది. 'ఆరంభంలోనే ఇదొక భయంకరమైన అమంగళం జరిగిందే!" అన్నాడు సీతారామ్.

## 31

నావ కాలువదాటింది; నదిలో ప్రవేశించింది. అప్పుడు సీతారాం నావలోనించి దిగి ఊళ్ళోకివచ్చేశాడు. వచ్చేటప్పుడు యువరాజును అడిగి అతని కత్తి తెచ్చుకున్నాడు. ఉదయాదిత్యుడు రాసిన మూడువుత్తరాలూ ఒక నమ్మకమైన మనిషికి ఇచ్చాడుగా! ఇచ్చాడేగాని వాడికి రహస్యంగా చెప్పాడు: 'ఇవి నీ దగ్గరే వుంచు. నేనువచ్చి తీసుకుపోయి అందజేస్తాను.' అని తిరిగిరాగానే వాడిదగ్గరనించి వుత్తరాలు తీసుకున్నాడు. రాణికి, విభకు రాసిన ఉత్తరాలు అట్టిపెట్టాడు; మూడోది చింపి అవతల పారేశాడు.

అప్పటికీ ఇంకా ఇండ్లు బాగా తగలబడుతూనే ఉన్నాయి. ఈ 'అగ్నికాండ'లో సీతారామ్మకు పాలువున్నదని వేరే చెప్పనవసరంలేదు. ఉదయాదిత్యుడంటే అభిమానం గల రైతులూ, కోటలోని కొందరు నౌకర్లు సీతారామ్మకు సాయ పడటంలో అతని కార్యం ఫలించింది. జనమంతా తగలబడు తోన్న చోటికి పరిగెత్తినప్పుడు సీతారామ్మిత్రులు నెమ్మదిగా వచ్చి ఉదయాదిత్యుడు వుండిన కారాగారానికి నిప్పంటించారు. సీతారామ్‌వచ్చిచూచాడు. ప్లాను ప్రకారం అంతా చక్కగానే జరిగింది. మంటలు బాగానే లేస్తున్నాయి. వెంటనే తాను తెచ్చినమూట ఒకటి విప్పాడు. అందులోనించి కొన్ని యెము కలు, ఒక పుర్రెతీసి కారాగారంలో ఎలాగో పెట్టాడు. ఉదయా దిత్యుని కత్తికూడా అందులో ఉంచాడు.

ఆతరువాత కొంతసేపటికి దూరాన నిప్పు ఆర్పుతూన్న కావలావాళ్ళకు కేకలు వినిపించాయి కారాగారం దగ్గరనించి: "రండి, దబ్బున రండి; యువరాజు గారున్న కారాగారం నిప్పంటుకుంది" అంటూ. కావలా వాళ్ళకు కాళ్ళు చేతులు చల్లబడ్డాయి. దయాళ్‌సింగ్ స్పృహతప్పి పడిపోయాడు. ఇంతలో పరుగెత్తుకుంటూ ఇంకొకడు వచ్చాడు "కారాగా రంలోనించి యువరాజావారు కేకలు వేస్తున్నారు. చూస్తూ చూస్తుండగానే ఆ కేకలు ఆగిపోయాయి. ఏమైందో కదా పాపం!" అని విచారంగా అరుస్తూ. అందరూ కారాగారం వైపు పరిగెత్తి వెళ్ళారు. కప్పుబాగా నిప్పంటుకుని తగలబడు తోంది. మంటలు మిక్కుటంగా లేస్తున్నాయి. లోపలికి వెళ్ళేందు కెవరికీ ధైర్యం చాలలేదు.

యువరాజు చనిపోయినట్టు వార్త వ్యాపింప జేస్తే కొన్నాళ్ళవరకూ బెడద లేకండా గడచిపోతుందని సీతారామ్ ఆశించాడు. దుప్పటిగుడ్డ మెడకు చుట్టుకుని ఇక ఇంటికి బయలు దేరాడు. దారిలో అతని కొక సంగతి జ్ఞాపకం వచ్చింది. "నేనిక యశోహారపురం విడిచి పారిపోవలసిన వాడినే. శ్రమపడకండా కొంత డబ్బు కూడా వస్తుంటే తీసుకునే ఎందుకు వెళ్ళకూడదు? ఆ పాపిష్టి మంగళాంబ చచ్చిపోయిం దాయెను. దాని యింట్లో ఏవైనా కొన్ని సామానులు, డబ్బు. దొరికినంతవరకు తీసుకుపోతాను. మళ్ళీ ఇటువంటి అవకాశం సాధారణంగా దొరుకుతుందా?"— ఇలా అనుకుంటూ అతడు మంగళాంబ యింటివైపు వెళ్ళాడు.

మంగళాంబ యింటి వాకిలి తెరిచే వుంది. సీతారాం సంతోషిస్తూ లోపల ప్రవేశించాడు. నాలుగు వైపులా పరికించి చూచాడు. అంతా చీకటిగా వుంది. కాలికేదో తగిలి తూలి పడిపోయేటంత పనైంది. మరోసారి నుదురు గోడకు కొట్టుకుంది. కాసేపు ఒకచోట ఆగి చూచాడు. ఇంట్లో ఎవరన్నా ఉన్నారేమో నన్నభావం పొడసూపింది భయం భయంగా ముందుకు వెళ్ళాడు. ఇంకా అవతల లోపల గదిలో దీపం ఒకటి వున్నట్టు కనిపించింది. అతనికి సంతోషమైంది. గబగబా రెండు అడుగులు వేశాడు. కాని అక్కడెవరో ఒకావిడ కూచుని వుండటం కనిపించింది. ఎవరు? అదే — ఆ పాపిష్ఠిది చావలేదన్న మాట! కాలువలోనించి ఈదుకుని వచ్చేసిందన్న మాట! ఇంకా ఒంటిమీది చీర తడిసి నీళ్ళు గ్రక్కుతూనే ఉన్నది; వెండ్రుకల్లోనించి కూడా

పళ్ళు కొరుకుతున్నాయి సీతారామ్ ముందుకూ పోలేక, వెనక్కూ పోలేక అక్కడే స్తబ్ధచిత్తుడై నిల్చిపోయాడు. అతడు పిరికివాడేంకాదు; అయినా క్షణమాత్రం భ్రమాన్పడిపోయాడు. చివరకు – "నువ్వు ఎక్కడినించి వచ్చావే! ఇంకా చావలేదు టే రండా!" అన్నాడు ఎకసక్కెంగా.

రుక్మిణి గుడ్లు మిటకరించి, పళ్ళు కొరుకుతూ, కొంత సేపు అతని ముఖంలోకి చూస్తూ వుండిపోయింది. "హుం – మీ అందరినీ భస్మీపటలం చేయకండా నే నప్పుడే చచ్చిపోతా ననుకున్నావా?" అంటూ లేచి నిల్చుని చేతులు తిప్పుతూ "యమలోకంలోనించి నేను తిరిగి వచ్చేశాను. మొదట నిన్నూ, నీ యువరాజును చితిమీద పడుకోబెట్టి నిప్పంటించి, మీ రిద్దరూ బూడిద అయినతరువాత ఆ బూడిద దట్టంగా పులుముకుని ఈ దేహాన్ని సార్థకంచేసుకుంటాను. అంతవరకు దాకానాకు యమలోకంలో స్థానంలేదు; తెలిసిందా?"అన్నది.

రుక్మిణి మాటలు విన్నతరువాత ఆమె భూతం కాదనీ, నిజంగా మంగళాంబేననీ నమ్మకం కుదిరింది. అప్పుడు కాస్త ధైర్యం కలిగింది. దగ్గరకుపోయి నాలుగు పరాచికాలు విసరి ఆమెను మంచి చేసుకుందామనుకున్నాడు. కాని రుక్మిణి ఉగ్ర రూపం తాల్చింది. "ఆగు! నీ నాలుక పీకేస్తానుండు" అంటూ చుట్టూ చూచింది, ఏమున్నా దొరికితే వాడిమీదికి విసిరివేసి ప్రాణంతీసి వేద్దామనే ఆమె ఉద్దేశం. ఆవిడ వ్యవహారం చూచి సీతారాం మెల్లగా అక్కడనించి తప్పుకున్నాడు.

"యువరాజు తప్పించుకుని పారిపోయిన సమాచార మంతా ఈ మంగళాంబకు తెలుసు. దీని మూలాన చేసిన పని అంతా రేపు వ్యర్థమైపోతుంది. ఈ పాపిష్ఠి దాన్ని గొంతుపిసికి చంపిద్దామన్నా రాకపోతినే! ఇంతకూ నేనుమాత్రం ఈ వూళ్ళో ఇక క్షణం ఉండగాడు, పారిపోవలసిందే" అనుకున్నాడు సీతా రామ్. ఆ రాత్రే రాయగడ్ కు పయనమై వెళ్ళిపోయాడు.

రాత్రి చాల పొద్దుపోయాక, కొద్దిగా వర్షంకూడా కురిసింది. చివరకెలాగైతేనేం నిప్పు ఆర్పారు. యువరాజు చని పోయినాడన్న వార్త తెలియగానే ప్రతాపాదిత్యుడు రాజ సభ ఏర్పాటు చేశాడు. కావలావాళ్ళను పిలిపించాడు. మంత్రి హాజరైనాడు, ఇంకా సభాసదులందరూ వచ్చారు. మహారాజు అందరు చెబుతున్న మాటలూ వింటున్నాడు. "బాగా మంటలు లేస్తున్నప్పుడు యువరాజు కిటికీదగ్గరనిల్చునివున్నారు, నేను చూచాను" అన్నాడొకడు. "వారు సహాయంకోసం చాలసేపు అరిచారు. నేను విన్నాను" అన్నాడింకొకడు. కారాగారంలో పడివున్న యువరాజుగారి కత్తి తీసుకువచ్చి చూపించాడు ఇంకొకడు. "మా పెద్దనాన్నగారెక్కడున్నారు?" అని ప్రశ్నించాడు ప్రతిపాదిత్యుడు. "నిప్పంటుకున్నప్పుడు వారు కూడా కారాగారంలోనే వున్నారు" అని ఎవరో జవాబు చెప్పాడు. ఈ విధంగా ఎవరెవరు చెబుతున్న సాక్ష్యా లన్నీ వింటున్నాడు ప్రతిపాదిత్యుడు. ఇంతలో బైట ఏదో కల్లోలం చెలరేగింది. ఎవరో స్త్రీ లోపలికి రావాలని హఠం చేస్తున్నది. కావలావాళ్ళామెను రానీయటం లేదు. ఈ సంగతి ప్రతాపాదిత్యుడు విన్నాడు. "ఆవిడను లోపలికి రానీయండి"

అన్నాడు ప్రతాపాదిత్యుడు. వెంటనే కాపలావాళ్ళు రుక్మిణిని లోపలికి తీసుకువచ్చి హాజరు పరిచారు.

"ఏం కావాలి నీకు?" – ప్రతాపాదిత్యుని ప్రశ్న.

రుక్మిణి చేతులు తిప్పుతూ బిగ్గరగా చెప్పసాగింది: "మహారాజావారు ఈ కాపలావాళ్ళందర్నీ ఆరేసి నెలలకు తక్కువలేకుండా జైల్లో వెయ్యాలి; వాళ్ళమీదికి వేటకుక్కల్ని ఉసిగొలపాలి. అదీ మీరు అనుగ్రహించాల్సింది. అంతకంటే నాకింకేమీ అక్కర్లేదు వాళ్ళకు మీమీద భయభక్తులున్నాయనుకుంటున్నారా? అంతా నమ్మకద్రోహులే–నమ్మక ద్రోహులు." ఈ మాటలన్నీ పక్కనే నిల్చుని వింటూన్న కాపలావాళ్ళ ముఖాలు కోపంతో కందగడ్డలైనాయి. రుక్మిణి ఒక్కసారి వెనక్కుతిరిగి వాళ్ళకేసి చూచి – ఇలా అనసాగింది: "అల్లా చూస్తారేం! నమ్మకద్రోహులు కాదూ మీరు? యువరాజు తాతయ్యగారితో కూడ రాయగడ్‌కు పారిపోతున్నాడని మీలో ప్రతిఒక్కరికీ చేతులుజోడించి విన్నవించానా–లేదా? ఒక్క పాపిష్ఠివాడైనా వినిపించుకున్నాడూ?"

"ఏం జరిగిందో అంతా చెప్పు" అన్నాడు ప్రతాపాదిత్యుడు.

"ఇంకా చెప్పేదేముంది? యువరాజు తాతయ్యగారితో కలిసి రాయగడ్ పారిపోయాడు."

"నిప్పు అంటించిం దెవరో నీ కేమైనా తెలుసా?" – ప్రతాపాదిత్యుడు అడిగాడు.

"నాకు తెలియదు. అదంతా సీతారామ్ పన్నాగం. యువరాజుమీద అతనికి బాగా అభిమానం కదా! ఆ ముసిలి

రాజాగారూ, యువరాజు, సీతారాం – ముగ్గురూ కలిసి మంత్రాలోచనచేసి ఈ తంత్రమంతా చేసివుంటారు."

ప్రతాపాదిత్యుడు చాలసేపటివరకూ స్తబ్ధంగా కూచున్నాడు. "ఈ విషయాలన్నీ నీ కెలా తెలిశాయి?" అని అడిగాడు చివరకు.

"అంతే ననుకున్నారేమిటి? కావలిస్తే నాతో ఎవరినేనా పంపించండి. నేను స్వయంగా వాళ్ళను తీసుకుపోయి అన్ని విషయాలూ చూపిస్తాను కూడా. మీ నౌకర్లంతా దున్నపోతులు; వాళ్ళవల్ల పని అవదు." అన్నది రుక్మిణి

రుక్మిణి వెంట కొంతమంది నమ్మకమైన మనుష్యులను పంపవలసిందిగా ప్రతాపాదిత్యుని ఆజ్ఞ అయింది. కావలా వాళ్ళందరికీ సముచితమైన దండన విధించాడు. తిన్నగా ఒక్కొక్కరే సభాసదులంతా వెళ్ళిపోయారు. చివరకు మంత్రి, రాజు – ఇద్దరే మిగిలారు. మంత్రి అలాగే కూచున్నాడు – రాజు తన్నేమైనా పలుకరిస్తాడేమో ననుకుంటూ. కాని రాజేమీ మాటాడనేలేదు. మంత్రే ఏదో మాటాడబోయి "మహారాజా!" అన్నాడు. కాని రాజు ముఖం తిప్పలేదు; పలుకలేదు. అలాగే స్తబ్ధంగా కూచున్నాడు. మంత్రి చివరకు తిన్నగా లేచి వెళ్ళిపోయాడు.

ఆనాడు సాయంత్రమే ఒక పల్లెకారి వచ్చి కబురు చెప్పాడు: "యువరాజుగారు తప్పించుకుని పారిపోయారు" అని. ఇంకా ఇతర్లవల్ల కూడా రాజుకు ఆ సమాచారం తెలియ వచ్చింది ఒక వారం రోజులు గడిచిన తరువాత, రుక్మిణి వెంట వెళ్ళిన మనుష్యులు తిరిగి వచ్చారు. "యువరాజు

గారిని మేము రాయగడ్‌లో చూచాము'' అని వాళ్ళు తెచ్చిన కబురు. "ఆ స్త్రీ ఏమైంది? ఎక్కడుంది?" అని ప్రశ్నించాడు ప్రతాపాదిత్యుడు. "ఆమె తిరిగి రాలేదు; రాయగడ్ లోనే ఉండిపోయింది" అని వాళ్ళు జవాబు చెప్పారు.

ప్రతాపాదిత్యుడు ముక్తియార్‌ఖాన్ అనే సేనాపతిని పిల్చి రహస్యంగా ఏమో చెప్పాడు. అతడు రాజాజ్ఞ శిరసా వహిస్తున్నట్టుగా సలాంచేసి వెళ్ళిపోయాడు.

## 32

యువరాజు పారిపోయినా డన్న వార్త రాణికీ, విభకూ ప్రతాపాదిత్యునికన్న ముందే తెలిసింది. ఆ సంగతి రాజుగారికి గనక తెలిస్తే ఆయన కెంత కోపం వస్తుందో, ఏమి చేస్తాడోనని ఆ యిద్దరూ చాల భయపడి పోయారు. క్రమేణా రాజుకు అన్ని సంగతులూ తెలియ వస్తున్నాయి పాపం, ఆ తల్లీ కూతుళ్ళకు ప్రాణాలు ప్రాణాల్లో లేకండా వున్నాయి. ఒక వారం రోజులు గడిచాక రాజుకు ఒక విశ్వసనీయుడైన గూఢచారి ద్వారా నిజమైన కబురు అందింది. కాని ఆయ నేమీ ప్రతిక్రియను పూనుకోలేదు; మనసులోని కోపం రవం తైనా బైటికి కనబరచనే లేదు. రాణిక లోలోపల భయం గానే వుంది; ఉండబట్టలేక ఒకనాడు "మహారాజా! మిమ్మల్ని ఒక్క భిక్ష అడగ దలచుకున్నాను. ఈసారికి మాత్రం ఉదయుడిని మీరు క్షమించాలి. నా బిడ్డని మీరింకా కష్టాలపాలు చేయదలచుకుంటే మాత్రం...నిజం

చెబుతున్నాను ... నేను విషం తాగి చచ్చిపోతాను"
అన్నది.

ప్రతిపాదిత్యునికి లోలోపల చాల కోపం వచ్చింది. "ఇంతవరకు ఏమీలేదు. నువు అప్పుడే ఏడుపు మొదలు పెట్టావే! నే నేం చేశానని!"

తానింకా ఎక్కువగా మాటాడితే రాజుగారి కెక్కడ మళ్ళీ కోపం పుట్టుకొస్తుందోనని రాణి అంతటితో ఆ ప్రసంగం ఆపివేసి వెళ్ళిపోయింది. కాని ఆమెకు లోలోపల భయంగానే ఉంది. ఒకటి, రెండు, మూడురోజులుగడిచాయి. రాజుగారిలో మరోవిధమైన భావమేమీ కనిపించలేదు. అందువల్ల రాణికి, విభకు హృదయాలు కొంచెం కుదుటపడ్డాయి. యువరాజు దగ్గర వుండకండా మరెచ్చటికో వెళ్ళిపోయిన కారణాన రాజు మనోవ్యథ తీరి, సంతుష్టి గాంచినట్టు వాళ్ళు అనుకున్నారు. ఇద్దరూ చాలవరకు నిశ్చింతగానే ఉన్నారు.

అత్తగారింటిదగ్గరనించి తనకు పిలుపువచ్చినట్టు విభకు తెలిసింది; తల్లి చెప్పింది; దాసీలూ చెప్పారు. ఇదివరకు రామమోహన్ రావటం, తానతన్ని ఊరికనే పంపించివెయ్యటం జరిగింది. నాటినించీ ఆమె మనస్సులో తీరని వ్యథగానేవుంది. మళ్ళీ ఈ నాటికి చాలసంతోషం కలిగింది. తీరిక సమయాల్లో భర్తను తలచుకుంటూ వుంది. పూర్వంలాగ ఇప్పుడామె నీరసంగా, బడలిపోయినట్టూ, వాడిలిపోయినట్టూ కనిపించటం లేదు. మబ్బులులేని స్వచ్ఛమైన శారదాకాశలక్ష్మిలాగె సముజ్వలంగా వుంటున్నది. తమ్ముడు సమరాదిత్యునితో కలిసి పసిపిల్లలా ఆడుకుంటుంది. ఒక చంటిపిల్లలాగా తల్లిని కావిలిం

చుకుని ముద్దుముద్దుగా మాటాడుతుంది పనిపాటల్లో తల్లికి సాయపడుతున్నది. కుమార్తె ఆనందంచూచి తల్లి పొంగి పోయింది. కాని హృదయాంతరాళంలో ఏదో ఒక అనిష్టశంక ఉండి వుండి కలతపెడుతూనే వుంది. కాని అది కూతురికి కని పించకండా లోలోపలే దాచుకున్నది. కన్నబిడ్డముఖంలోని ప్రశాంత మందహాస రేఖల్ని ఏతల్లి మలినపరచగలదు?

విభను అత్తగారింటికి పంపించట మనే ప్రస్తావన వచ్చి నప్పుడు రాణి "నా మనస్సు ఇంకా నిశ్చింతగా వుండటంలేదు. ఇప్పుడప్పుడే కూతుర్ని ఆనందంగా పంపించలేకపోతున్నాను. మరి నాలుగురోజులు గడిచాక పంపిస్తాను" అను తాపాన్ని కన బరుస్తుంది. రెండువారాలు గడిచాయి. ఉదయాదిత్యుని విష యమై అందరూ ఒకవిధంగా నిశ్చింతగానే ఉన్నారు. కాని విభను అత్తగారింటికి పంపించేవిషయమై రాణి ఇంకా ఒక నిర్ణ యానికి రాలేకండా వున్నది. ఇలా మరికొన్నిరోజులుగడిచాయి. రోజులు గడుస్తూన్నకొద్దీ విభకు ఆందోళన హెచ్చుతోంది. ఎక్కువరోజులు గడుస్తున్నకొద్దీ భర్తయెడల తాను ఎక్కువ అపరాధం చేస్తున్నట్టు ఆమె భావించసాగింది. ఆయనే స్వయంగా రమ్మని కబురుచేశారాయెను? తాను ఆలస్యం చెయ్యొచ్చా? ఇదివరకొకసారి వారు క్షమించారు; మాళ్ళీనా? చాలరోజులు ఆమె ఏమీ మాటాడలేదు. చివర కిక ఉండబట్ట లేకపోయింది. చివర కొకనాడు ఆమె తల్లిమెడ కావిలించుకుని "అమ్మా!" అన్నది. ఆమె హృదయభావం తల్లికి ఇట్టే అర్థమైపోయింది. "ఏమిటితల్లీ!" అన్నది కూతుర్ని గట్టిగా గుండెకుహత్తుకుంటూ. విభ చాలసేపటివరకూ మాటాడలేదు.

చివరకు "అమ్మా నన్నెప్పుడు పంపిస్తావు మరి!" అన్నది. అలా అంటూండగానే ఆమె ముఖంలో నెత్తురుచుక్క లేకండా అయిపోయింది. తల్లి రవంత మందహాసంచేసింది – "ఎక్కడికి పంపించ మంటావమ్మా!" అని అడుగుతున్నట్లు. 'చెప్పమ్మా! దబ్బున" అన్నది విభ, చంటిపిల్ల మారాంచేసినట్టుగా. "రెండు మూడురోజుల్లో పంపిస్తాగా!" అన్నది తల్లి అశ్రుపూర్ణా కులేక్షణయై.

## 33

ఇంతకాలానికి మళ్ళీ ఉదయాదిత్యుడు రాయగఢ్ వచ్చాడు. కాని అతనికి ఇదివరకులా మనసు ఆనందంగా లేదు. లోలోపల ఏమున్నా భయభావాలు తొలుస్తున్నాయేమో మరి! తాతయ్య చాల సాహసంచేశాడు. అందుకాయనమీద ఎప్పుడేమి వచ్చిపడుతుందో ఎవరు చెప్పగలరు? తన తండ్రి గారు ఇదంతా ఉపేక్షించి ఊరుకుంటారనుకోటానికి వీల్లేదు. తాతయ్యను ఒక కంట కనిపెడుతూనే ఉంటారు, తప్పదు. ఇంతకూ తాను జన్మించిన వేళ మంచిది కాదనుకున్నాడు ఉదయాదిత్యుడు. "తాతయ్యగారూ! నేను మళ్ళీ ఇంటికి వెళ్ళిపోవటమే బాగుంటుంది" అన్నాడొకసారి.

వసంతరాయ్ ఒక పాటపాడుతూ అతనిమాట వినిపించు కోనట్టుగా నటించాడు. కాని అదేమాట ఉదయాదిత్యుడు మాటి మాటికీ అడుగుతోంటే ఆయనకు చాల బాధ అనిపిం చింది. పాట ఆపివేసి, విషణ్ణహృదయుడై "ఏం? ఏంవచ్చిం

దిప్పుడు? నా దగ్గరవుంటే నీ కేమన్నా కష్టంగా ఉందా?"
అన్నాడు. ఉదయాదిత్యుడు మళ్ళీ ఆమాట అనలేదు.

ఉదయాదిత్యుడెప్పుడూ అన్యమనస్కుడుగానూ, ఉదాసీనుడుగానూ వుండటం చూచి, వసంతరాయ్ అతన్ని సంతోష పెట్టేందుకుగాను సర్వవిధాలా ప్రయత్నించాడు. మళ్ళీ సితార్ వాయించటం ఆరంభించాడు, అతన్ని వెంటబెట్టుకుని షికార్లు వెళుతున్నాడు, ఉంచుమించుగా రాచకార్యాల ప్రసక్తే మానివేశాడు. తన దగ్గరనించి ఉదయాదిత్యుడు ఏ నిమిషాన వెళ్ళిపోతాడో అన్న భయం ఏర్పడిపోయింది. రాత్రింబగళ్ళు అతన్ని కనిపెట్టుకునే వుంటున్నాడు. "దాదాభాయీ! నిన్ను మళ్ళీ ఆ హృదయంలేని దేశంలోకి నేను పంపించ దలచుకో లేదు" అంటూవుంటాడు.

తిరిగి తండ్రిదగ్గరకు వెళ్ళాలన్న భావం ఉదయాదిత్యునికి క్రమేణా తగ్గిపోయింది. నిర్దయాత్మకమైన గోడల మధ్యనించి ఎలాగో బయట పడ్డాడు; ఇప్పుడు హాయిగా, స్వేచ్ఛగా తాతయ్యగారి స్నిగ్ధహృదయంలోని ప్రేమలో మునకలు వేయగలుగుతున్నాడు. ఇక్కడ చెట్టు - చేమ, పొలం - పుట్ట, మిన్ను - మన్ను అన్నీ ఆనందంగా చూడగలుగుతున్నాడు. ఎక్కడికి కావాలంటే అక్కడికి పోగలుగుతున్నాడు. తన్ను చిన్నప్పటినించీ ఎరిగివున్న వాళ్ళు వచ్చి చూచి మాటాడి పోతున్నారు. రోజులు హాయిగానే గడుస్తున్నాయి. తండ్రిగారి కోపం ఈపాటికి తగ్గిపోయి వుండొచ్చు. తానిక్కడకు పారిపోయి రావటం ఆయనకు సంతుష్టికరంగా వుండి వుండవచ్చు. లేకపోతే ఇన్నాళ్ళు ఊరుకుంటారా?

కాని ఇటువంటి ఆలోచనలు అతన్ని ఎంతో కాలం చీకటిలో ఉంచలేక పోయాయి. తాతయ్యగారికి ఏమి ఆపద వచ్చివస్తు తుందోనన్న భయం అతనిలో కొన్నాళ్ళనించీ దాగివుంది. అది ఇప్పుడు ఉగ్ర రూపంలో పైకి వచ్చింది మళ్ళీ. ఇంటికి వెళ్ళి పోతానని తాతయ్యగారితో చెప్పినందువల్ల ప్రయోజనం ఉండదు కాబట్టి ఎప్పుడో ఒకసారి అక్కడినించి రహస్యంగా లేచి వెళ్ళిపోదామని నిర్ణయించుకున్నాడు. కాని మరు క్షణమే కారాగారం గుర్తుకు వచ్చింది హతాశుడైనాడు. అయినాసరే, వెళ్ళిపోవడానికే నిశ్చయించుకున్నాడు. 'ఇవాళ మంచిది కాదు; రేపు' అని ఎప్పటికప్పుడు అనుకుంటూ రోజులు గడుపుతున్నాడు. ఒకనాడు వసంతరాయ్ అతని దగ్గరకు వచ్చి "దాదాభాయీ! నిన్నరాత్రి నాకొక చెడ్డకల వచ్చింది. చాల చెడ్డకల! ఏదో ఒక భయంకరమైన అనర్ధం జరుగుతుందేమోననిపిస్తున్నది, ఏమైనా, నిన్ను విడిచి నేను ఈ జన్మకు వేరైపోవటం – అది మాత్రం జరక్కుండా వుండాలి, అది నాకు చాలు" అన్నాడు.

"విడిపోతే మాత్రం, జన్మలో మళ్ళీ కలుసుకోకుండా విడిపోతామా తాతయ్యగారూ!" అన్నాడు ఉదయాదిత్యుడాయన చేయి పుచ్చుకుని.

వసంతరాయ్ మరోవైపు చూస్తూ ఇలా అన్నాడు: "కాకపోతే యేమిటిమరి! ముసలివాడనైపోయాను. ఇంకా ఎన్నాళ్ళుంటా నిక్కడ?". రాత్రి వచ్చిన దుస్వప్నం అతని హృదయంలో ఇంకా బాగా అంకితమై వుంది. అందుచేత మిక్కిలి అన్యమనస్కుడై వున్నాడు.

ఉదయాదిత్యుడు కాసేపు ఆగి "తాతయ్యగారూ! ఒకవేళ మనం విడిపోయేట్టయితే మాత్రం ఏమవుతుంది?"

వసంతరాయ్ ఉదయాదిత్యుని మోహ కౌగిలించు కున్నాడు: "దాదా భాయీ! ఎందుకు విడిపోతాం మనం? నువ్వు నన్ను విడిచిపెట్టబోకు ఈ ముసలి తనంలో నన్నిలా వొదిలేసి నువ్వు ఎక్కడికీ పోవద్దు."

ఉదయాదిత్యుని కన్నుల్లో నీళ్ళు తిరిగాయి. తనహృదయంలోని ఆలోచన తాతయ్య కెలా తెలిసిందో! అతనికి ఆశ్చర్యం అయింది. ఒక్క నిట్టూర్పు విడిచాడు. "నన్ను మీ దగ్గర అట్టిపెట్టుకుంటే మీకు ఆపద వచ్చితీరుతుంది తాతయ్య గారూ!"

వసంతరాయ్ నవ్వాడు "నాకు ఆపదేమిటి? ఈ వయసులో నేను ఆపదలకు దడుస్తానా? చస్తే చచ్చిపోతాను. అంతే కన్నా అయ్యేదేముంది? ఎప్పుడైనా చేసేదల్లా వున్నదే. ఏరోజు కారోజు మృత్యువు నాకోసం ఎదురుచూస్తూనే వుంది. దానికి నేను భయపడేది లేదు. జీవితంలో అనేక సంకటాలు దాటి వృద్ధాప్యంలో అడుగుపెట్టాను ఇంతకాలం జీవించిన నా జీవిత నౌక వచ్చివచ్చి ఒక్కసారి మునుంగుతుందంటే అంటుంది; ఏం అయితే?"

ఆ పగలంతా ఉదయాదిత్యుడు వసంతరాయ సమక్షం లోనే వున్నాడు. రోజంతా కొంచెంకొంచెం వర్షం పడుతూనే వుంది. సాయంత్ర మప్పుడు వర్షం తగ్గింది. ఉదయాదిత్యుడు ఎక్కడికో వెళ్ళాలని లేచాడు.

"ఎక్కడికి వెడతావు దాదాభాయీ?"

"అలా కాస్త షికారు వెళ్ళివస్తాను"

"ఇవాళ షికారుకు పోవద్దు. ఈపూట నువ్వు ఎక్కడికీ వెళ్ళద్దు నాయనా! నా దగ్గరే వుండు."

"ఇప్పుడే మళ్ళీ తిరిగివచ్చేస్తాను. ఎంతోదూరంవెళ్ళను."

ఉదయాదిత్యుడు బయలుదేరి కోటముఖద్వారందగ్గరకు వెళ్ళాడు. "యువరాజుబాబూ! నేనుకూడా వస్తాను మీతో" అన్నాడొక కాపలావాడు.

"ఎందుకూ? అక్కర్లేదు"

"మీచేతిలో కత్తికూడా లేదే! అలాగే వెడతారా?"

"కత్తిఎందుకూ?" అంటూ యువరాజు సాగిపోయాడు.

పోయిపోయి ఒక మైదానంలో ప్రవేశించాడు. అతని మనసులో రకరకాల ఆలోచనలు తిరిగాయి. "ఒక లక్ష్యం అనేది లేని బ్రతుకేం బ్రతుకు? ఒక ఆశయం లేదు; స్థితి లేదు; స్థాయిలేదు; ముందేమి జరుగుతుందో స్పష్టంగా తెలియదు. ఇలాంటి బ్రతుకు ఎలా గడపాలి?"—ఆ తరువాత మళ్ళీ అతడు విభ భవిష్యత్తును గురించే ఆలోచించ సాగాడు. ఏమేమో ఆలోచించుకుంటూ చాల దూరమే వెళ్ళాడు.

పోగా పోగా, ఒకచోట విశ్రాంతిగా కూచోటానికి వీలైన చోటు కనిపించింది. సాధారణంగా పశువుల కాపర్లు వచ్చి కూచుంటూ వుంటా రక్కడ. చుట్టూ చెట్లువున్నాయి. యువరాజు వెళ్ళి అక్కడ కూచున్నాడు. వెలుతురు సన్నగిల్లింది; క్రమేణా చీకటి పడింది. ఉదయాదిత్యుడు చెల్లెలి విషయం ఆలోచిస్తూ కూచున్నాడు. కొంతసేపటికి 'దాదాభాయి పారిపోయాడని తెలిస్తే తాతయ్య ఏమనుకుంటాడు!'

అన్న ఆలోచన ఒకటి మనసులో తళుక్కు మన్నది. మరుక్షణమే "అదుగో, మీ యువరాజు అక్కడున్నారు. అదిగో అక్కడే" అని పలుకుతూన్న ఒక యువతి కర్కశ కంఠస్వరం వినిపించింది. ఆ మరుక్షణమే ఇద్దరు సైనికులు చేతుల్లో దివిటీలు పుచ్చుకుని యువరాజుదగ్గరకు రానేవచ్చారు. చూస్తూ ఉండగానే ఇంకా కొందరు సైనికులు కూడా వచ్చారు. అందరూ యువరాజు చుట్టూ గోడకట్టినట్లు నిల బడ్డారు. అప్పుడా యువతి ఎదుటికి వచ్చింది. "ఏమండీ! నన్ను గుర్తుపట్టారా! కొంచెం తలెత్తి ఇలా చూడండి — బహుశా గుర్తుకు వస్తానేమో!" అన్నది. దివిటీల వెలుగులో యువరాజు చూచాడు; ఆమె రుక్మిణి యని గుర్తించాడు సైనికులకు రుక్మిణి వ్యవహారం అసభ్యంగా కనిపించింది." పో పో, నువ్వు అవతలికి పో" అని గద్దించారు ఆమెను. కాని ఆమె వాళ్ళమాటల్ని లెక్కపెట్టలేదు. యువరాజును ఉద్దే శించి ఇంకా ఇలా పలుకసాగింది: "ఇదంతా ఎవరు చేశారో తెలిసిందా? నేనేచేశాను. ఇప్పటికైనా బోధపడిందా? ఇదంతా నా పనే. ఈసైనికులందర్నీ తీసుకువచ్చిం దెవరనీ? నేనే తెచ్చాను; నేనే — నీ కోసం నేను ఇంత చేశాను; నువుమాత్రం ..."

యువరాజుకు ఆమెను చూస్తోంటే అసహ్యం వేసింది. ఆమెకు వెడమొగంపెట్టి లేచి నిల్చున్నాడు. సైనికులామెను పట్టుకుని దూరంగా నెట్టేశారు. ఇంతలో ముక్తియార్ ఖాన్ వచ్చి ఎదురుగా నిల్చుని సలాం చేశాడు.

"ఎవరు? ముక్తియార్ ఖాన్! ఏమిటి కబుర్లు? —" సవ్యంగా అడిగాడు యువరాజు.

"చిన్నబాబూ! మహారాజావారి ఆజ్ఞ శిరసావహించి వచ్చాను" అన్నాడు ముక్తియార్ ఖాన్ సవినయంగా.

"ఏమిటా ఆజ్ఞ?"

అతడు తన వద్దనున్న ఆజ్ఞాపత్రం తీసి యువరాజు చేతికి అందించాడు. యువరాజు అది చదువుకున్నాడు. "ఇందుకు గాను ఇంతమంది సైనికులు దేనికి? నాకొక చిన్న వుత్తరం రాస్తే వాచ్చేసేవాడినిగా! అసలు నేను స్వయంగా రావాలనే అనుకుంటున్నాను. సరే; ఇంకా ఆలస్యం ఎందుకూ? పోదాం, పద."

ముక్తియార్ ఖాన్ చేతులు జోడించాడు. "నేను ఇప్పుడే బయలుదేరి రావటానికి వీల్లేదు".

యువరాజుకు కొంచెం భయం కలిగింది. "ఏం? ఎందుకనీ?"

"మహారాజావారు నా కింకో పనికూడా ఒప్పజెప్పారు. అదికూడా సానుకూలం చేసుకుని మరీ వస్తాను"

యువరాజుకు అనుమానం జాస్తి అయింది "ఏమిటా పని?"

"మన మహారాజావారు రాయగడ్ రాజాగారికి ప్రాణ దండన విధించారు"

యువరాజు చకితుడైనాడు. "అబద్ధం; వట్టిమాట." అన్నాడు అప్రయత్నంగా.

"అబద్ధంకాదు, యువరాజుబాబూ! నిజమే. ఆ విష యమై మహారాజావారు స్వయంగా రాసి యిచ్చిన ఆజ్ఞాపత్రం కూడా నా దగ్గర వుంది."

అన్న ఆలోచన ఒకటి మనసులో తళుక్కు మన్నది. మరుక్షణమే "అదుగో, మీ యువరాజు అక్కడున్నాడు. అదిగో అక్కడే" అని పలుకుతూన్న ఒక యువతి కర్కశ కంఠస్వరం వినిపించింది. ఆ మరుక్షణమే ఇద్దరు సైనికులు చేతుల్లో దివిటీలు పుచ్చుకుని యువరాజుదగ్గరకు రానేవచ్చారు. చూస్తూ ఉండగానే ఇంకా కొందరు సైనికులు కూడా వచ్చారు. అందరూ యువరాజు చుట్టూ గోడకట్టినట్టు నిలబడ్డారు. అప్పుడా యువతి ఎదుటికి వచ్చింది. "ఏమండీ! నన్ను గుర్తుపట్టారా! కొంచెం తలెత్తి ఇలా చూడండి — బహుశా గుర్తుకు వస్తానేమో!" అన్నది. దివిటీల వెలుగులో యువరాజు చూచాడు; ఆమె రుక్మిణి యని గుర్తించాడు. సైనికులకు రుక్మిణి వ్యవహారం అసభ్యంగా కనిపించింది. "పో పో, నువ్వు అవతలికి పో" అని గద్దించారు ఆమెను. కాని ఆమె వాళ్ళమాటల్ని లెక్కపెట్టలేదు. యువరాజును ఉద్దేశించి ఇంకా ఇలా పలుకసాగింది: "ఇదంతా ఎవరు చేశారో తెలిసిందా? నేనేచేశాను. ఇప్పటికైనా బోధపడిందా? ఇదంతా నావనే. ఈసైనికులందర్నీ తీసుకువచ్చిం దెవరనీ? నేనే తెచ్చాను; నేనే - నీ కోసం నేను ఇంత చేశాను; నువుమాత్రం..."

యువరాజుకు ఆమెను చూస్తోంటే అసహ్యం వేసింది. ఆమెకు వెడమొగంపెట్టి లేచి నిల్చున్నాడు. సైనికులామెను పట్టుకుని దూరంగా నెట్టేశారు. ఇంతలో ముక్తియార్ ఖాన్ వచ్చి ఎదురుగా నిల్చుని సలాం చేశాడు.

"ఎవరు? ముక్తియార్ ఖాన్! ఏమిటి కబుర్లు? —" సవ్యంగా అడిగాడు యువరాజు.

"చిన్నబాబూ! మహారాజావారి ఆజ్ఞ శిరసావహించి వచ్చాను" అన్నాడు ముక్తియార్ ఖాన్ సవినయంగా.

"ఏమిటా ఆజ్ఞ?"

అతడు తన వద్దనున్న ఆజ్ఞాపత్రం తీసి యువరాజు చేతికి అందించాడు. యువరాజు అది చదువుకున్నాడు. "ఇందుకుగాను ఇంతమంది సైనికులు దేనికి? నా కొక చిన్న వుత్తరం రాస్తే వాచ్చేసేవాడినిగా! అసలు నేను స్వయంగా రావాలనే అనుకుంటున్నాను. సరే; ఇంకా ఆలస్యం ఎందుకూ? పోదాం, పద."

ముక్తియార్ ఖాన్ చేతులు జోడించాడు. "నేను ఇప్పుడే బయలుదేరి రావటానికి వీల్లేదు".

యువరాజుకు కొంచెం భయం కలిగింది. "ఏం? ఎందుకనీ?"

"మహారాజావారు నా కింకో పనికూడా ఒప్పజెప్పారు. అదికూడా సానుకూలం చేసుకుని మరీ వస్తాను"

యువరాజుకు అనుమానం జాస్తి అయింది. "ఏమిటా పని?"

"మన మహారాజావారు రాయగడ్ రాజాగారికి ప్రాణదండన విధించారు"

యువరాజు చకితుడైనాడు. "అబద్ధం; వట్టిమాట." అన్నాడు అప్రయత్నంగా.

"అబద్ధంకాదు, యువరాజుబాబూ! నిజమే. ఆ విషయమై మహారాజావారు స్వయంగా రాసి యిచ్చిన ఆజ్ఞాపత్రం కూడా నా దగ్గర వుంది."

యువరాజు మిక్కిలి వ్యగ్రచిత్తుడై, సేనాపతి చెయి పుచ్చుకుని "నువ్వు పొరపాటుగా అర్థంచేసుకున్నావు ముక్తియార్ ఖాన్! మహారాజావారి ఆజ్ఞ: ఒకవేళ నేను చిక్కక పోతే అప్పుడు వసంతరాయ్‌ని... ఇదిగో నేను చిక్కానుగా! ఇంకా ఇతరవిషయాలు మీకెందుకూ? నన్ను ఇప్పటి కిప్పుడే తీసుకుపోండి. ఈ క్షణంలో బయలు దేరి రావటానికి నేను సిద్ధంగానే వున్నాను. నన్ను ఖైదుచేసి తీసుకుపోండి; ఊఁ; పదండి. ఆలస్యం చెయ్యకండి" అన్నాడు.

"యువరాజుబాబూ! నేనేమీ పొరపాటుగా అర్థం చేసుకోలేదు. మహారాజావారు నాకు స్పష్టంగాచెప్పారు. వారి ఆజ్ఞ శిరసావహించి వచ్చాను."

యువరాజు మిక్కిలి అధీరుడై పోయాడు. "ముక్తియార్ ఖాన్! నువ్వు తప్పకండా పొరపాటుపడ్డావు. మహారాజావారి ఉద్దేశం అదికానే కాదు. పదండి, యశోహరపురంవెడదాం; మహారాజావారి సమక్షంలోకి వెళ్ళాక మీకే తెలుస్తుంది. మళ్ళీ వారు అలాగనే ఆజ్ఞాపించేట్టయితే సరే వద్దువుగాని."

"క్షమించండి యువరాజుబాబూ! నేనిప్పుడు రాజాలను, రాను" అన్నాడు ముక్తియార్ ఖాన్ చేతులుజోడించి.

యువరాజు ఇంకా మిక్కిలి అధీరుడై పోయాడు. "ముక్తియార్ ఖాన్! కొంచెం బాగా ఆలోచించుకో. ఎప్పటికైనా నేను సింహాసనం ఎక్కుతాను నా మాట విను. నాకు అసంతుష్టి కలిగించబోకు."

ముక్తియార్ ఖాన్ జవాబేమీ చెప్పలేదు. మౌనంగా నిల్చున్నాడు.

యువరాజు ముఖంలో నెత్తురుచుక్క లేకండా అయి పోయింది. అతనినుదుటిమీద చెమటచుక్కలుమెరుస్తున్నాయి. ఒక అడుగు ముందుకువేసి ముక్తియార్ ఖాన్ చెయిపుచ్చు కున్నాడు. "ముక్తియార్! ఏ పాపమూ ఎరగని పుణ్యాత్ముడిని చంపినందువల్ల నీకు చివరకా నరకంలోకూడా చోటుండదు."

"యజమాని ఆజ్ఞ పాలించటం పాపంకాదు"

"అబద్ధం. అటువంటి నీతినిబోధించే ధర్మశాస్త్రంకూడా శుద్ధ అబద్ధమే. పాపాత్మకమైన ఆజ్ఞను పాటించటంకూడా పాపమే. నువ్వు ఆసంగతి బాగా తెలుసుకో ముక్తియార్!"

ముక్తియార్ ఖాన్ జవాబు చెప్పలేదు. మౌనంగా నిల్చున్నాడు.

ఉదయాదిత్యు డొకసారి చుట్టూ చూచాడు. "అయితే నన్నిప్పుడు వొదిలివెయ్యండి; తిరిగి రాయగడ్ వెడతాను, మీరు సైన్యం పోగుచేసుకొని రండి. నేను మిమ్మల్ని యుద్ధానికి ఛాలెంజి చేస్తున్నాను. ఆ యుద్ధంలో నువ్వు జయంపొందిన తరువాత ఆజ్ఞాపాలనధర్మం చూచుకుందువుగాని."

ముక్తియార్ జవాబేమీ చెప్పలేదు. మౌనంగా నిల్చున్నాడు. సైనికులంతా ఇంకా దగ్గరగా వచ్చి యువరాజు చుట్టూ మూగారు. యువరాజు మరి గత్యంతరం ఏమీ కనిపించక "తాతయ్యగారూ! మీరు జాగ్రత్తగా వుండాలి" అంటూ బిగ్గరగా అరిచాడు. ఆ ధ్వని మైదానమంతా ప్రతిశబ్దించింది. సైనికులు ముందుకువచ్చి యువరాజును పట్టుకున్నారు. "తాతయ్యగారూ! జాగ్రత్త! జాగ్రత్త!" అంటూ మరొకసారి గొంతు చీరుకుపోయేట్టు అరిచాడు.

ఎవరో ఆ దారిన పోతున్న మనిషి దగ్గరకు వచ్చి ఏమిటని అడి గాడు. "వెళ్ళు; పరిగెత్తుకుంటూ వెళ్ళు. రాయగఢ్ మహా రాజా వారిని మిక్కిలి సావధానులుగా ఉండమని చెప్పు" అన్నాడు యువరాజు ఆత్రుతగా. కాని సైనికులు లాభాట వారిని వెళ్ళనీయ లేదు. ఖైదీగా పట్టుకున్నారు. ఇలా దారిని వస్తూన్న బాటసారు లందర్నీ సైనికులు ఖైదీల్నిగా పట్టుకున్నారు.

కొందరు సైనికులు ఉదయాదిత్యుని అక్కడే బంధించి వుంచారు. మిగిలిన వాళ్ళు ముక్తియార్ ఖానుతో సహా... సైనిక దుస్తులు తీసివేసి, మామూలు దుస్తులు ధరించి, అస్త్ర శస్త్రాలు గుప్తంగా పెట్టుకుని రాయగడ్ కు బయలు దేరారు. రాయగఢ్ లో ప్రవేశించేందుకు చాల ద్వారాలు వున్నాయి. అందరూ తలా ఒక ద్వారం గుండా రాయగఢ్ లో ప్రవే శించారు.

ఆ సమయాన వసంతరాయ్ కూచుని సంధ్యావందనం చేసుకుంటున్నాడు. కోటలోని దేవాలయంలో హారతి ఇస్తు న్నారు. ఆ గంటల చప్పుడు తప్ప విశాల రాజభవనంలో మరేవిధమైన కోలాహలమూ లేదు. ఎటు చూచినా నిశ్శబ్ద శాంతి! ఎక్కడా నౌకర్లు కూడా లేరు. సాయంత్రమప్పుడు కొంతసేపు నౌకర్లందరికీ విశ్రాంతి ఇస్తాడు వసంతరాయ్ మామూలుగా.

సంధ్యావందనం చేసుకుంటూ వుండగా ముక్తియార్ ఖాన్ పూజా మందిరంలోకి వస్తూ వుండటం వసంతరాయ్ చూచాడు. అతడు చకితుడై "ఖాన్ సాహెబ్! ఈ మందిరం

లోకి రాబోకు. నేను సంధ్య పూర్తిచేసుకుని ఇప్పుడే వస్తాను; అక్కడ వుండు" అన్నాడు. ముక్తియార్ ఖాన్ వెనక్కి తిరిగి బైటికి వెళ్ళాడు. గుమ్మం దగ్గర నిలువబడ్డాడు. వసంతరాయ్ సంధ్య పూర్తిచేసుకుని బైటికివచ్చాడు. ముక్తియార్ ఖాన్ వీపుమీద చెయివేసి "కులాసాగా వున్నావా, ఖాన్ సాహెబ్!" అని పలుకరించాడు.

"చిత్తం – మహారాజా!" అని సంతుష్టంగా జవాబు చెప్పాడు ముక్తియార్ ఖాన్ సలాం చేస్తూ.

"భోజనం చేశావా ?"

"చిత్తం"

"అయితే నువ్వు ఈ రాత్రి ఇక్కడే ఉండిపో. నీకు పడుకోటానికీ అదీ ఏర్పాటు చేస్తాను".

"లేదండి– పని పూర్తిచేసుకుని వెంటనే వెళ్ళిపోవాలి"

"అలా కాదులే ఖాన్‌సాహెబ్! ఇవాళ నిన్ను పోనీను. చాలాకాలానికి వచ్చావు; ఇవాళ నువ్వు ఇక్కడ వుండాలి."

"వీలుకాదులెండి మహారాజా! త్వరగా వెళ్ళిపోవాలి"

"ఏం? తొందరేమిటి? పనేమన్నా ఉందా? ప్రతాప్ కులాసాగా వున్నాడా? ఇంకా అక్కడ యావన్మందికీ కుశలమేనా?"

"చిత్తం, అంతా కులాసాగానే ఉన్నారు."

"మరి నీకింత తొందరెందుకుకూ? చప్పునచెప్పు; నా మనస్సుకు ఆందోళనగాఉంది. ప్రతాప్ ఏవిధమైన ఆపత్తులో చిక్కుకోలేదు కదా!"

"ఆపత్తేమీ లేదండి. మహారాజావారి ఆజ్ఞ ఒకటి శిరసా వహించి ఇలా వచ్చాను."

వసంతరాయ్ మరింత వ్యాకులచిత్తుడైనాడు. "ఆజ్ఞ! ఏమిటది? వెంటనే చెప్పవేం?"

ముక్తియార్‌ఖాన్ ఆజ్ఞాపత్రం తీసి వసంతరాయ్ చేతి కిచ్చాడు. ఆయన అది దీపం దగ్గరకు తీసుకుపోయి చదువు కుంటున్నాడు. ఇంతలో ఇతర సైనికులంతా వచ్చి చుట్టూ మూగారు. ఆజ్ఞాపత్రం చదువుకుని వసంతరాయ్ ముక్తియార్‌ఖాన్ దగ్గరకు వచ్చాడు.

"ఈ ఆజ్ఞా పత్రం ప్రతాప్ తన స్వహస్తంతో రాసిందేనా ?"

"చిత్తం"

"ఈ ఆజ్ఞాపత్రం ప్రతాప్ తన చేతులతో రాసిందేనా?" మళ్ళీ అడిగాడు వసంతరాయ్.

"చిత్తం – మహారాజా !"

వసంతరాయ్ చాల నొచ్చుకున్నాడు; కన్నీళ్ళు కార్చాడు. "ఖాన్ సాహెబ్! నేను ప్రతాప్‌ను ఒళ్ళో కూంచో బెట్టుకుని అన్నం తినిపించాను. ఎంతో గారాబంగా పెంచాను" అని పలికి కాసేపు ఆగాడు. మళ్ళీ ఇలా అన్నాడు; "ప్రతాప్ పసివాడుగా ఉన్నప్పుడు రాత్రింబగళ్ళు ఎత్తుకుని మోశాను. ఒక్క క్షణంకూడా నన్ను విడిచిపెట్టి ఉండేవాడు కాదు. ఆ ప్రతాప్ పెద్దవాడైనాడు; పెళ్ళి అయింది, నేను అతన్ని సింహాసనం ఎక్కించాను, అతని పిల్లల్ని నేను పెంచాను. ఆ

ప్రతాప్ ఈ నాడు ఇలా ఈ ఆజ్ఞాపత్రం రాసి ఇచ్చాడా ఖాన్ సాహెబ్!"

ముక్తియార్ ఖాన్ కన్నులు చెమ్మగిల్లినవి. తలవంచుకుని నిల్చున్నాడు.

"దాదాభాయ్ . . . మా ఉదయుడు ఏడీ?"

"వారిని పట్టుకుని మహారాజావారి దగ్గరకు పంపించేశాను."

వసంతరాయ్ వ్యాకులచిత్తుడైనాడు. "ఉదయుని ఖైదీగా పట్టుకుపోయారా? ఖైదీగానా? నేను ఒక్కసారి అతన్ని చూడకూడదా?"

"వీలుకాదు మహారాజా!" అన్నాడు. ముక్తియార్ ఖాన్ చేతులు రెండూ పుచ్చుకున్నాడు "ఒక్కసారైనా నన్నతన్ని చూడనియ్యి ఖాన్‌సాహెబ్!"

"నాదేముంది మహారాజా! కేవలం మా యజమాని గారి ఆజ్ఞ పాలిస్తూన్న నౌకర్ని-అంతే!"

వసంతరాయ్ ఒక్క దీర్ఘనిశ్వాసం విడిచాడు. ఈ ప్రపంచంలో ఎవరికీకూడా రవంత దయ అంటూ ఉండదన్నమాట! సరే, కానీ, ఖాన్‌సాహెబ్! నీ ఆజ్ఞాపాలన నెరవేర్చుకో."

ముక్తియార్ ఖాన్ మరుక్షణమే వంగి సలాంచేశాడు. "నన్ను క్షమించండి మహారాజా! నేను కేవలం మా యజమానులవారి ఆజ్ఞ పాలిస్తున్న వాడిని మాత్రమే - నా దోషం ఏమీలేదు."

"ఔను - నీ దోషం ఏమీలేదు ఖాన్ సాహెబ్! నీ దోషం ఏముందనీ? నిన్ను నేను క్షమించవలసిన అవసరం

మాత్రం ఏముంది?" అంటూ వసంతరాయ్ ముక్తియార్‌ను కావలించుకున్నాడు. "నువ్వు తిరిగి వెళ్ళాక, నేను ప్రతాప్‌ను హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తూ చనిపోయానని చెప్పు - ఇంకో మాట: ఖాన్ సాహెబ్! ఇక ఉదయుడిని గురించిన భారం నీకు వొప్పజెప్పి నేను చచ్చిపోతున్నాను. అతను నిరపరాధి. అన్యాయంగా అతన్ని శిక్షిస్తారేమో! అతనికేవిధంగానూ కష్టాలు రాకండా కనిపెట్టివుండు" అంటూ లోపలికి వెళ్ళాడు.

పూజామందిరంలోకి వెళ్ళాడు తన ఇష్టదేవతముందు సాష్టాంగపడి నమస్కారం చేశాడు. కన్నులు మూసుకుని కొంతసేపటివరకూ ధ్యాన నిష్ఠలో కూచున్నాడు. ఎడమచేతిలో జపమాల తిప్పుతూ వున్నాడు: "ఊం—ఖాన్‌సాహెబ్ ఇక . ."

"అబ్దుల్లా!" అని పిల్చాడు ముక్తియార్‌ఖాన్. విచ్చుకత్తి పుచ్చుకుని అబ్దుల్లా ముందుకువచ్చాడు. ముక్తియార్‌ఖాన్ వెనక్కి తప్పుకుని ముఖం తిప్పుకున్నాడు. మరునిముషంలో అబ్దుల్లా నెత్తురు గక్కుతున్న విచ్చుకత్తి పుచ్చుకుని పూజా మందిరంలోనించి బైటికి వచ్చాడు. మందిరమంతా నెత్తురు మయమైపోయింది.

## 34

ముక్తియార్‌ఖాన్ తిరిగి మైదానంలోకి వచ్చాడు. సేనలో చాలభాగం రాయగడ్‌లో వదిలిపెట్టి, ఉదయాదిత్యుని తీసుకుని యశోహరపురంవెళ్ళాడు. అది రెండురోజుల ప్రయాణం. ఆ రెండురోజులూ ఉదయాదిత్యుడు అన్నం, నీళ్ళు పుచ్చుకోలేదు. ఎవరితోనూ ఏమీ మాటాడలేదు. నావలో

అలా కూచుని ఆలోచిస్తూఉండేవాడు. రాతిబొమ్మలా కూచునే వాడు. కంటికి నిద్రలేదు; కన్నీటి చుక్కలేదు, చూపులేదు; రెప్పవాల్చటంలేదు; ఏదో ఎడతెగని ఆలోచన. పడవసాగి పోతూ వుంది. ఆ నీళ్ళవైపే చూస్తున్నాడు; తెడ్ల చప్పుడు చెవుల్లో జొరబడుతూనే ఉంది. కాని అతనికేమీ కనిపించటం లేదు; ఏమీ వినిపించటం లేదు. ఏదో ఆలోచిస్తూఉన్నాడు. రాత్రి అయింది; ఆకాశాన నక్షత్రాలు వచ్చాయి. పల్లెవాళ్ళు నావ ఆపి లంగరు వేశారు. అందరూ నిద్రపోతున్నారు. చిన్న చిన్న అలలు వచ్చి పడవకు కొట్టుకుంటూన్న చప్పుడు తప్ప అంతా నిశ్శబ్దంగా ఉంది. యువరాజు రెప్పవాల్చకండా ఎదురుగా దూరపు ఇసుకతిన్నెలవైపు చూస్తూ ఆలోచిస్తున్నాడు. తెల్లవారబోతోంది. పల్లెవాళ్లు మేల్కొన్నారు; మళ్ళీ ప్రయాణంసాగింది. ప్రభాతవాయువులు వీస్తున్నవి. తూర్పుదిక్కున ఆకాశం రాగరంజితమైంది. యువరాజు అలాగేకూచుని ఆలోచించుకుంటున్నాడు. మూడవనాడు యువరాజు కన్నుల్లోనించి అశ్రువులు కాలువలుగా ప్రవహించాయి గడ్డంకింద చేతులు పెట్టుకుని నీళ్ళవైపు, ఆకాశంవైపు చూస్తూకూచున్నాడు.

ఇదంతా చూస్తూ ముక్తియార్‌ఖాన్ చాలబాధపడ్డాడు. ఒకమాటు యువరాజువద్దకు వచ్చి కూచున్నాడు. "ఏమిటి ఆలోచిస్తున్నారు యువరాజుబాబూ!"

యువరాజు ఉలికిపడ్డాడు. చాలసేపు స్తబ్ధచిత్తుడై ముక్తియార్‌ఖాన్ ముఖంలోకి చూస్తూఉండిపోయాడు. ఆముఖంలో దయ, మమత కనిపించాయి. వెంటనే తన బంధితప్రాణానికి విడుదల లభించినట్టయింది. అన్నాడు: "నేనీ ప్రపంచంలో

పుట్టి ఇంతవరకు చేసిం దేమిటీ అని ఆలోచిస్తున్నాను. నా బ్రతు కంతా సర్వనాశనమైపోయిందే! అయ్యో భగవంతుడా! నా వంటి వట్టిబలహీనులు అసలు ఎందుకుపుట్టాలి? తన కాళ్ళ మీద తాను నిల్చోలేనివాడు, అడుగడుక్కీ ఇతర్ల సాయం కావలసినవాడు ప్రపంచానికి ఏమి మేలుచేస్తాడు? తనకు కరా వలంబనం ఇచ్చేవాడినికూడా తనతోపాటు అడుక్కి తీసుకు పోయేవాడు ప్రపంచంలో ప్రతివనికీ ఆటంకప్రాయుడే ఔతాడు వాడు. తాను సరిగ్గా నిలబడలేడు; తనకు ఆలంబనమైనవాడికి మితిమీరిన భారంగా తయారౌతాడు. నేను దుర్బలుడిని; పిరికి వాడిని; భగవంతుడు నన్నే చచ్చిపోకండా అట్టిపెట్టాడు; ప్రపంచానికి ఆనందం ఇచ్చేవాడిని, రక్షణ ఇచ్చేవాడినీ చంపి పారేశాడు. ఇంకా ఎందుకు నేను బ్రతికివుండటం? ఇక నే నీ ప్రపంచంనించి సెలవుపుచ్చుకోవలసిందే!"

ఉదయాదిత్యుడిని ఖైదీగా పట్టుకొచ్చి ప్రతాపాదిత్యుని ముందు వుంచారు. ప్రతాపాదిత్యుడు ఉదయాదిత్యుని అంతః పురంలో ఒక గదిలోకి తీసుకుపోయాడు. లోపల తలుపు వేశాడు. తండ్రి సమక్షంలోకి రావటంతోనే ఉదయునికి ఒడలంతా కంటకిత మైంది. ఒక రకమైన ఏహ్యాభావంతో శరీరంలోని నరాలు, కండరాలు కుంచుకు పోయాయి. తలెత్తి తండ్రి ముఖంలోకి చూడనే లేదు. "నీ కెటువంటి శిక్ష విధిం చాలి? నువ్వే చెప్పుకో" అన్నాడు ప్రతాపాదిత్యుడు గంభీ రమైన కంఠస్వరాన.

"మీరు ఎలా నిర్ణయిస్తే అలాగే" అన్నాడు ఉద యుడు. ఏమాత్రం విచలితుడు కాలేదు.

"నా యీ రాజ్యాన్ని పాలించేందుకు నీకు యోగ్యత లేదు."

"లేదు మహారాజా! నేనందుకు తగినవాడిని కాదు. మీ రాజ్యం నాకు అక్కర్లేదు. మీ సింహాసనం నించి నన్ను దూరంగా పంపించెయ్యండి. అదే నేను మిమ్మల్ని యాచించ దలచుకున్న భిక్ష."

ప్రతాపాదిత్యునికి కావలసిందే అది. "ఆ నీ చెప్పే మాటలు హృదయంలో నించే వస్తున్నట్టు నా కేమిటి నమ్మకం?"

"నేను పుట్టుకలోనే వట్టి దుర్బలుడిని. కాని నా స్వార్థం కోసం నే నెప్పుడూ అబద్ధం ఆడింది లేదు. మీ కింకా నమ్మకం కుదరకపోతే భగవంతుని సమక్షంలో శపథం తీసుకుంటాను: యీ మీ రాజ్యంలో సూదిమొన మోపి నంత ప్రదేశం కూడా నాకు అక్కర్లేదు. సమరాదిత్యుడే ఈ రాజ్యానికి ఉత్తరాధికారి ఔగాక!"

"ఇక పోతే నీకు కావలిసిందేమిటి?–" ప్రతాపాది త్యుడు అడిగాడు పరిపూర్ణ సంతుష్టుడై.

"నాకు మరేమీ అక్కర్లేదు మహారాజా! పలుపుపెట్టి ఒక గుంజకు కట్టివేసి ఉంచే పశువును లాగా నన్ను కారాగా రంలో బంధించకండి. నన్ను వదిలి పెట్టెయ్యండి. నే నిప్పుడే కాశీకి వెళ్ళిపోతాను. కొంచెంగా డబ్బు మాత్రం దానం చెయ్యండి నాకు. నే నక్కడ తాతయ్యగారి పేరుమీద ఒక మందిరం, అతిథిశాల కట్టిస్తాను. అంతే నేను కోరేది."

"సరే బాగుంది; అలాగే."

ఆనాడే ఉదయాదిత్యుడు దేవాలయంలోకి వెళ్ళి ప్రతాపాదిత్యుని సమక్షంలో శపథం తీసుకున్నాడు! "దేవా! సర్వాంతర్యామివి నీవు సాక్షిగా, నీ పాదాలు స్పృశించి ఈ నాడు శపథం చేస్తున్నాను. ఈ జన్మలో ఈ యశో హార రాజ్యంలో సూదిమొన మోపినంత భూమి కూడా నాకు అక్కర్లేదు. యశోహార రాజ్య సింహాసనంమీద నేను కూచోను. యశోహార రాజదండము నేను స్పృశించను. మాట తప్పితినా, తాతయ్యగారిని హత్యచేసిన పాపం అంతా నాదియై నన్ను పీడించునుగాక!" – ఈ చివరిపదాలు పలుకు తూంటే అతని శరీరం యావత్తూ లోలోపల కంపించిపోతున్న ట్టనిపించింది.

# 35

ఉదయాదిత్యుడు, విభ బయలుదేరి వెళ్ళటానికి యేర్పాట్లన్నీ జరిగాయి. విభ తల్లిని కౌగిలించుకుంది. వచ్చిన ముత్తయిదువలంతా అత్తగారింటికి వెళ్ళనున్న విభకు అనేక విధాలుగా ఉపదేశాలు యిచ్చారు.

"నాయనా! అమ్మాయిని అత్తగారింటికి తీసుకు పోతు న్నావు. అక్కడ ఆమెకు అగౌరవం జరక్కుండా చూడు" అన్నది రాణి ఉదయాదిత్యుని పిలిచి.

ఉదయాదిత్యుడామాట విని విచలితుడైనాడు. "అదేమి టమ్మా! అగౌరవం ఏమిటి?"

"ఏమోమరి! అతనికి అమ్మాయిమీద కోపంగలిగి ఏమన్నా..."

"అలా ఎందుకు జరుగుతుందమ్మా! విభ ఇంకా చిన్న పిల్ల. దానిమీద ఆయనకు కోపం ఎందుకువస్తుంది."

రాణి కన్నీళ్ళు ఒత్తుకుంది. "జాగ్రత్తగా తీసుకుపోయి దిగబెట్టిరా నాయనా! అక్కడ అగౌరవమే జరిగిందంటే విభ మనకు దక్కదు."

ఉదయాదిత్యుని హృదయంలో ఒక ఆశంక ఉత్పన్నమైంది. అత్తగారింట్లో విభకు అగౌరవం ఎదురౌతుందన్న ఆలోచన అతని కిదివరకెన్నడూ కలలోకూడా కలగలేదు. ఇప్పటికీ తన కర్మ సాంతం వదల్లేదన్నమాట! ఇంకా కొంత మిగిలేవుందన్నమాట! విభ అంటే తనకు అపేక్ష. తత్ఫలితంగా విభకు ఏ అనర్థం రానున్నదో కదా!

బయలుదేరేముందు విభ, ఉదయాదిత్యుడు తల్లికి నమస్కారం చేశారు. విభ తల్లిని కావిలించుకుంది. అమంగళమని తల్లి ఏడవలేదు. కాని విభ వెళ్ళిపోగానే ఆమె కింద పడుకుని చాలసేపు ఏడ్చింది. ఆ తరువాత అన్న, చెల్లెలు–తండ్రికీ, ఇంకా పెద్దలకు నమస్కారాలుచేశారు. ఉదయాదిత్యుడు సమరాదిత్యుని ఎత్తుకుని ముద్దుపెట్టుకున్నాడు. "తమ్ముడూ! నువ్వు అధిష్ఠించబోయే సింహాసనాన్ని అంటిపెట్టుకునివుండే అభిశాపాలు నిన్ను స్పృశించకుండుగాక!" అని మనసా ఆశీర్వదించాడు.

రాజప్రాసాదంలో నౌకర్లు చాలమందికి ఉదయాదిత్యుడంటే ఎంతో అభిమానం. వాళ్ళంతా వచ్చిఅతనికి ప్రణామం చేశారు; కన్నీళ్ళు పెట్టుకున్నారు.

చివరకు దేవాలయంలోకి వెళ్ళి దేవునికి నమస్కారం చేసి ఇద్దరూ ప్రయాణమై వెళ్ళిపోయారు.

దుఃఖాలకు, ఆపదలకు ఆకరమైన రంగభూమి వెనుక పడిపోయింది. జీవిత కారాగారం వెనుకబడి పోయింది. వాళ్ళిద్దరూ ముందుకు దాటి పోయారు. పాషాణ మయమైన ఆ ప్రాసాదానికి తానిక మళ్ళీ రాబోవటం లేదు; ఆ సంగతి ఉదయాదిత్యునికి తెలుసు. ఒక్కసారి వెనక్కుతిరిగి చూచాడు. కఠిన హృదయం కలిగి, రక్త పిపాసువైన ఆ రాజ ప్రాసాదం తలెత్తుకుని ఒక రాక్షసిలా నిల్చుంది. దుష్టములైన పన్నాగాలు, స్వేచ్ఛాచరణలు రక్తలాలస, దుర్బల పీడనోద్వృత్తి, నిస్సహాయుల కన్నీళ్ళు - అన్నీ వెనుకనే దాటిపోయాయి. ఇక ఎదురుగా, ముందు స్వచ్ఛ స్వాతంత్ర్యం, ప్రకృతి మాత నిర్మల సౌందర్యం, స్నిగ్ధహృదయ ప్రేమ - ఇవన్నీ వచ్చి అతన్ని ఆలింగనం చేసుకోబోతున్నవి. ప్రభాత సౌందర్యాన్ని, ప్రకృతిలోని ఆనందాన్ని చూచి ఉదయాదిత్యుని హృదయం పిట్టల కలకలారావం శృతిగా స్వతంత్ర గానం చేయసాగింది.

నావ దాటిపోతున్నది. పల్లెకారులు పాటలు పాడుతున్నారు. ఇద్దరూ ముందుభాగంలో కూచున్నారు. విభాదేవి ప్రశాంత హృదయంలో ఉజ్వలానంద రేఖ విరాజిలుతున్నది. చెక్కులలో గులాబీల తళుకులు నాట్యం చేస్తున్నవి. ఒక దుస్స్వప్నంలోనించిమేల్కొని లోకంముఖం చూస్తున్నట్టున్న దామెకు. తాను అత్తగారింటికి వెడుతున్నది. ఎవరిదగ్గరకు? భర్త దగ్గరికి. ఎవరు ఆమెను పిలుస్తున్నది? అనంతము, నిశ్చలము అయిన

ప్రేమ. ఒక చిన్న గోరువంక పిట్టలాగ రెక్కలు ముడుచుకుని మృదులప్రేమను హృదయంలో దాచుకుని కూచుంది. చేరువనే ఉదయాదిత్యుడు కూచుని అలలచప్పుడువంటి మృదువైన కంఠ స్వరంతో ఏవేవో కథలు చెబుతున్నాడు. అతడు చెబుతు న్నదంతా ఆనందకరంగా ఉన్న దామెకు.

నావ రామచంద్రరాయ్ రాజ్యంలో ప్రవేశించింది. నలు వైపులా విస్తారమైన శోభ చూచి విభ హృదయం పులకించింది. మెల్లిగా నావ రాజధానీ నగరం చేరువకు వచ్చింది. తాము వచ్చినట్టు ముందుగా ఒక మనిషిచేత కోటలోకి కబురుచేద్దా మని ఉదయాదిత్యుడు భావించాడు. కోటలోకి కబురుచేరితే, అప్పుడు రాజుగారి తరఫునించి మనుష్యులు వచ్చి తమను సగౌ రవంగా తీసుకు పోగలరని అతనివుద్దేశం. అందుచేత రాజధానికి ఇవతల ఒక గ్రామందగ్గర నావ ఆపుకున్నారు. అప్పటికి సూర్యాస్తమయం అయింది. అందుచేత ఆ రాత్రి అక్కడే గడిపేసి, మర్నాడు ఉదయమే కోటలోకి కబురు చేద్దామని ఉదయాదిత్యుడు అనుకున్నాడు. విభ హృదయంలో మాత్రం అప్పటికప్పుడే కబురు పంపుదామని ఆందోళనగా వున్నది.

## 36

చంద్రద్వీపంలో ప్రజలంతా గొడవగొడవగా వున్నారు. ఎక్కడ చూచినా మేళాలు, తాళాలు, ఏదో ఉత్సవం జరుగు తున్నది కాబోలు! ఇక్కడ విభ హృదయంలో ఆనందం తరంగాలు పొంగి పడుతున్నది. పైగా చుట్టూ మంగళతూర్య నినాదాలు వినబడుతూంటె హృదయం ఇంకా సముల్లసిత

మోతున్నది. ఏదో ఉత్సవపు పడవల్లా బయలుదేరటం ప్రారంభం చూచి ఉదయాదిత్యుడు చూచి వద్దామని గ్రామములోకి వెళ్లాడు. ఇంతలో ఎవరో ఒడ్డునించి వెనుకనుంచి "ఎక్కడిదండీ ఈ నావ?" అని అడిగాడు. ఆ ప్రశ్న వినబడటంతోటే నావ లోని ఒక నౌకరు సముల్లాసంగా "ఎవరూ? రామమోహన్! రా రా" అని పిల్చాడు. రామమోహన్ నావలోకి వచ్చాడు.

"మోహన్!" అన్నది విభ అత్యన్త హర్షంతో ముఖం విప్పారి.

"దొరసానమ్మగారూ!" అని పలికి రామమోహన్ ఒక నిమిషంపాటు ఆమె పెదవిమీద సహజసరళ మందహాసరేఖ చూస్తూ ఉండిపోయాడు. ఆఖరికి ఎలాగైతేనేం "వచ్చారా అమ్మా!" అన్నాడు.

"ఔను వచ్చాను. మేము వచ్చినట్టు మహారాజావారికి కబురు తెలిసిందా ఏమిటి? నువ్వు నన్ను తీసుకోపోవటానికి వచ్చావా?"

"లేదమ్మా! మీరంతగా తొందరపడకండి — రేపు చూద్దాం"

విభాదేవి ముఖం వాడిపోయింది. "ఏం, మోహన్! ఇవాళయితే ఏం?"

"ఇవాళ ప్రొద్దుగ్రుంకిపోయిందిగా! పోనీయండి"

విభకు ఏదో భయంకలిగింది "నిజంచెప్పు మోహన్! ఏమీ వైపరీత్యం జరగలేదుకద!"

రామమోహన్ ఇక ఉండబట్టలేకపోయాడు. ఏ విష యమూ అతడు గుండెల్లో దాచిపెట్టుకునే స్వభావంగలవాడు

కాదు. కూచున్నాడు. అతనికన్నులు అశ్రుసిక్తములైనాయి.
"అమ్మా! ఈ రాజ్యానికి అసలు మహారాణివి నీవు. నీకే
నీరాజ్యంలో ఈనాడు స్థానంలేకండాపోయింది. ఇవాళ మహా
రాజావారు ఇంకో పెళ్ళిచేసుకుంటున్నారు."

ఆ మాటవినగానే విభముఖంలో నెత్తురుచుక్క లేకండా
అయిపోయింది. చేతులు, కాళ్ళు మంచుగడ్డలా చల్లబడి
పోయాయి.

"అమ్మా! ఆ నాడు ఈ నీకొడుకు వచ్చాడు కదమ్మా
మిమ్మల్ని పిల్చుకురావటానికి! అప్పుడే మీ రెందుకు రాలే
దమ్మా! రాయిలా కాఠిన్యందాల్చి నన్నెందు కలా తిప్పి
పంపించేశారమ్మా! అందువల్ల మహారాజావారికి మళ్ళీ నా
ముఖం చూపించలేకండా అయిపోయానే! నా గుండె పటపటా
పగిలిపోయింది. నేను వారికి ఒక్క మాటకూడా చెప్పలేక
పోయాను."

విభ కన్నులముందు దట్టంగా చీకటివ్యాపించిపోయింది.
తల తిరుగసాగింది. కూచున్నచోట కూచున్నట్టు మూర్ఛపో
యింది. వెంటనే రామమోహన్ నీళ్ళుతెచ్చి ఆమె ముఖం
మీద చల్లుతూ కూచున్నాడు. కొంతసేపటికి విభకు తెలివి
వచ్చింది; లేచి కూచుంది. ఒక దెబ్బతో ఆమె ఆశాసౌధాలు
కూలిపోయాయి; ధూళిలో కలిసిపోయాయి. భర్తగారి రాజ
ధాని పొలిమేరదాకా వచ్చింది తాను; రాచనగరుద్వారం
ఇంకెంతో దూరంలేదు. భర్తృదర్శనస్వప్రహేళులైయున్న తన
ఆశలన్నీ మరీచికలలో విలీనమైపోయాయి చిత్తమంతావ్యాకుల

పడిపోయింది, "మోహన్, నన్ను పంపించవలసిందని వారు ఉత్తరం రాశారుకదా! ఆలస్యంచేశానా?"

"ఆలస్యమే అయిందమ్మా! అయింది"

విభ చాల అధీనురాలై పోయింది. "వారు నన్ను క్షమించ లేరంటావా ?"

"ఎందుకు క్షమిస్తారమ్మా !"

"మోహన్! ఒక్కసారి వెళ్ళి చూస్తాను వారిని" అంటూ విభ కన్నీళ్ళు ఒత్తుకుంది.

"ఇవాళ కాదు లెండమ్మా"

"కాదు మోహన్! ఇప్పుడే తీసుకుపో"

"అన్నయ్యగారిని రానీయండి మరి"

"అక్కర్లేదు. ఇప్పుడే తీసుకుపో నన్ను," అన్నయ్య వస్తే... అక్కడ తనకు జరుగబోయే అవమానాన్ని ఊహించి వెళ్ళనీయ డేమోనని ఆమె భయం.

"పల్లకీ తీసుకు రమ్మన్నారా ?"

"పల్లకీ ఎందుకు ? నేను రాణిని కాదుకదా ఇప్పుడు. పల్లకీ అవసరం లేదు. ఒక మామూలు వ్యక్తిలాగ, ఒక బిచ్చగత్తెలాగ బయలుదేరి వస్తాను."

"నా ప్రాణం ఉండగా మీరలా రావటం నేను ఒప్పుకో నమ్మా!"

"మోహన్! నీ పాదాలమీద పడతాను. నువు ఇప్పు డేమీ అభ్యంతరం చెప్పకు. పద, ఆలస్యం ఔతోంది—"

ఆమె కంఠం వొణికి పోయింది.

"సరే కానీండి; అలాగే వచ్చేయండి" అన్నాడు రామ మోహన్. అతని హృదయం చాల బాధపడ్డది.

ఒక సాధారణ స్త్రీ వేషంలో విభాదేవి నావదిగి వెడుతూంటే నౌకర్లు ఆశ్చర్యపోతూ అడిగారు: "అదేమిటండమ్మా; దీదీ రాణీ! మామూలు దుస్తుల్లో అలా ఎక్కడికీ వెడుతున్నారు ?"

"ఇదంతా దొరసానమ్మగారి రాజ్యమేగా! వారి యిష్టం వచ్చిన చోటికి వెళ్ళచ్చు—" అన్నాడు రామ మోహన్.

నౌకర్లు అడ్డు వచ్చారు. ఆమెగారు అలా వెళ్ళటం వాళ్ళకు ఇష్టం లేదు. కాని రామమోహన్ వాళ్ళను బెదరగొట్టి, వెనక్కు పారిపోయేట్టు చేశాడు.

# 37

ఎక్కడచూచినా ప్రజలు గుంపులు గుంపులుగా వున్నారు. ఒకసాధారణ వేషంలో ఇలా బైటికి వెళ్ళటమనేది విభకు మామూలుగా ఇష్టముండదు. కాని ఈ నాడామెకు బాహ్యదృష్టి లుప్తమై పోయింది. కనిపిస్తున్నదంతా ఆమె కంటికి మిధ్య, మరీచిక అయింది.

ప్రజలగుంపులోనించి తోసుకుంటూ తిన్నగా రాజ నగరద్వారం చేరుకున్నారు. అక్కడి ద్వారపాలకుడామె చెయిపట్టుకుని ఆపాడు; లోనికి వెళ్ళనీయలేదు. అప్పుడామెకి బాహ్యజగత్తు జ్ఞాపకంవచ్చింది. చుట్టూ చూచింది; సిగ్గుతో కుంగిపోయింది. ఇంతసేపటినించీ మేలిముసుగు కిందికి జారి

పోయే వుంది; ఇప్పుడది బాగా ముఖం మీదికి సగ్గుతున్నది. రామమోహన్ ముందు నడచి వెళుతున్నాడు. వెనక్కి తిరిగి ద్వారపాలకుని వైపు గుడ్లురజేసి చూచాడు. ఘర్నాండిన్ అక్కడే వున్నాడు. అతడు వచ్చి ద్వారపాలకుడిని ఒక్క లెంపకాయ కొట్టాడు. విభ రాజ ప్రాసాదంలో అడుగు పెట్టింది. కాని అక్కడి నౌకర్లు, దాసీలు ఎవరూ ఆమెపట్ల ఏమాత్రమూ ఆదరం చూపలేదు.

లోపలగదిలో రాజుగారు ఒక్కరే కూచుని వున్నారు. తోడుగా రమేశభట్టు మాత్రం ఉన్నాడు. విభ లోపలికి వచ్చింది. రాజు ముఖం చూచింది. వెంటనే అతని పాదాల మీద వాలిపోయింది. రాజు తొట్రుపాటుగా "ఎవరు నీవు ? బిచ్చగత్తెవా ? ముష్టి అడుక్కోటానికి వచ్చావా?"

విభ తలెత్తి రాజుముఖంలోకి చూచింది. కన్నుల్లో అశ్రువులు ఉబుకుతున్నవి.

"కాదు మహారాజా! నేను నా సర్వస్వం దానం చేసి పోదామని వచ్చాను. మిమ్మల్ని మరొకరిచేతుల్లో అప్పగించి సెలవు తీసుకుని వెళ్ళి పోదామని వచ్చాను".

రామమోహన్ ఇక ఓపికపట్టలేకపోయాడు. రాజువద్దకు వెళ్ళాడు "మహారాజా! వీరు మా దొరసానమ్మగారు. యశోహార రాజపుత్రి." అని చెప్పాడు.

రామచంద్రరాయ్‌కి ప్రాణం ఉలికిపడ్డట్టయింది. కాని ఆసమయానరమేశభట్టు రాజువైపుచూస్తూ వెక్కిరింపుగా "ఏం? అమ్మాయిగారు, ఇప్పటికి అన్నయ్యగారితో తనిః పోయారేమిటి?" అన్నాడు.

రాజుహృదయంలో విభాదేవియెడల రవంత కరుణ ఉత్పన్నమౌతూఉన్నది. ఆసమయంలో రమేశభట్టు ఈ వ్యంగ్య వాక్యంవిసిరాడు. మరుక్షణమే రాజుహృదయం మళ్ళీ కాఠిన్యం వహించింది. నవ్వేసాగాడు. విభపట్ల తానిప్పుడు మమతచూపటంవల్ల పరిహాసపాత్రుడి నౌతానని భయపడ్డాడు.

విభకు తలమీాద వేలాదిగా పిడుగులు పడినట్టు అనిపించింది. సిగ్గుతో పాతాళానికి కుంగిపోతున్నట్టనిపించింది. కళ్ళు మూసుకుంది. కాళ్ళకింద పృథివి ఎప్పుడు పగులువారి విచ్చిపోతుందా, ఎప్పుడు భూగర్భంలో దిగబడి దాగిపోదామా అనుకుంది. మిక్కిలి భయంభయంగా చుట్టూ చూచింది ఒకసారి. చివరకొక నిస్సహాయురాలువలె రామమోహన్ వైపు చూచింది. మరుక్షణమే రామమోహన్ ఒక పులిలా వెళ్ళి రమేశభట్టుమీాద ఎగబడ్డాడు; గట్టిగా మెడబట్టి అతన్ని గుమ్మం అవతలకు నెట్టివేశాడు.

రాజుకు కోపంవచ్చేసింది. "రామమోహన్! నా కళ్ళముందే ఏమిటా దుండగం నీకు?"

రామమోహన్ భయపడుతూ జవాబుచెప్పాడు: "మహారాజా! దుండగమే చేశాను. ఆ అమ్మ మీా మహారాణీగారు; మా దొరసానమ్మగారు. ఆమెగార్ని అలాగ ఎవడో ఒక విదూషకుడు కన్నూ మిన్నూ కానకుండా అవమానిస్తూంటే... నేను చచ్చిపోలేదుగా... చూస్తూ ఊరుకోమన్నారా? అప్పుడే ఏమైందిలెండి, మహామహారాజా! వాడి తల గొరిగించి, ముఖానికిమసిపూసి, గాడిదమీాదఎక్కించి ఊరంతా తిప్పకపోతే నా పేరు రామమోహన్ కాదనుకోండి"

"ఎవరోయ్ నా కిక్కడ మహారాణి! ఈవిడెవరో నే నెరగ ననలు" – గర్జించాడు రాజు.

ఒక్క క్షణంలో విభాదేవిముఖం నల్లబడిపోయింది. చీరచెరగుతో ముఖం కప్పుకుంది. ఆమె శరీరం యావత్తూ వొణికిపోయింది. వొణికి మూర్ఛితయై నేలమీద పడిపోయింది. అప్పుడు రామమోహన్ రాజును ఉద్దేశించి ఇలా అన్నాడు:

"మహారాజా! మా తాత ముత్తాల దగ్గరనించీ మేము తమ ఆస్థానంలో నౌకరీ చేస్తున్నాం. కాని ఈ నాడు తమరు మా తల్లిని మహారాణీగారిని అవమానం చేశారు. తమ రాజ్యలక్ష్మినే తిరస్కరించి పంపించేస్తున్నారు. ఈ నాటితో నేను మీ నౌకరీ విడిచిపెట్టేసి వెళ్ళిపోతున్నాను. ఇక మా దొరసానమ్మగారి సేవ చేసుకుంటూ బ్రతుకుతాను. మధూకరం అడుక్కుతినియైనా పొట్ట పోసుకుంటాను గాని మళ్ళీ యీ మీ కోట నీడ చాయలకైనా రాను." అంటూ ఒక్క నమస్కారం చేశాడు. వెంటనే విభాదేవి వైపు తిరిగి "అమ్మా! ఇక పదండమ్మా! ఇక్కడినించి తొందరగా వెళ్ళిపోదాం తల్లీ! ఒక్కక్షణంకూడా ఇక్కడిక ఉండకూడదు" అంటూ తక్షణమే ఆమెను భుజాలమీదనెత్తుకుని బైటికి వెళ్ళిపోయాడు.

బైట ద్వారంవద్ద పల్లకీలు చాలానే ఉన్నాయి. అర్ధవివశురాలై వున్న విభాదేవిని ఒక పాలకీలో పడుకోబెట్టి నావ దగ్గరికి మోసుకు పోయాడు రామమోహన్.

విభాదేవి ఉదయాదిత్యునితో సహా కాశీకి వెళ్ళింది. అక్కడ దానధర్మాలు చేస్తూ, ధ్యాన నిష్ఠలోనూ, దైవ

సేవలోనూ నిమగ్నమై, అన్నయ్యను కనిపెట్టుకుని వుంటూ కాలక్షేపం చేస్తున్నది.

రామమోహన్ బ్రతికి వున్నన్నాళ్ళూ ఆమెను కని పెట్టుకునే వున్నాడు. సీతారామ్‌కూడా కుటుంబ సహితంగా కాశీకి వచ్చేశాడు. ఉదయాదిత్యుని దగ్గరే ఉంటున్నాడు.

ఆనాడు విభాదేవి నావ చంద్ర ద్వీపం వచ్చి ఆగిన రేవు ఈనాటికీ 'రాణీఘాట్' అను పేర ప్రసిద్ధమై వుంది.

—0—